సిద్ధగంధాన్ని ధరించాలి, హనుమాన్ ఒత్తులతో దీపారాధన చేయండి. ఆంజనేయస్వామి అనుగ్రహానికి పాత్రులుకండి. పంచమంలో సంచరించు గురు రాహువులు, అష్టమంలో సంచరించు శని, ఏకాదశులలో సంచరించు కేతువు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నారు. మొత్తం మీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. పెట్టుబడిపెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు, ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

## స్త్రీలకు ప్రత్యేకం

మేషరాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. ముఖ్యమైన విషయాలు ముడిపడతాయి. ఆర్థిక ఇబ్బందులను అధిరోహించగలుగుతారు. ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. వృత్తి, ఉద్యోగాలలో స్థిరత్వం వస్తుంది. కుటుంబ విషయాలు, సంతాన విషయాలు బాగున్నాయి. విద్యా సంబంధమైన విషయాలు కూడా అనుకూలంగా ఉన్నాయి. విదేశాలకు సంబంధించిన అంశాలు కూడా అనుకూలంగా ఉన్నాయి. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు, మంచి ఉద్యోగం సాధించగలిగామన్న సంతృప్తిని కలిగి ఉంటారు. నమ్మిన వ్యక్తి ఆశ్చర్యంగా మోసం చేయడం జరుగుతుంది. ప్రేమ వివాహాల పట్ల నమ్మకం పోతుంది. ఐ.ఐ.టి మరియు మెడిసిన్ సీట్లు సాధిస్తారు. గతంలో జరిగిన తప్పిదాలను తిరిగి జరగకుండా జాగ్రత్త వహిస్తారు. నూతన గృహం కొనుగోలు చేయాలనే మీ ప్రయత్నాలు సఫలీకృతం అవుతాయి. స్థిరాస్థుల విక్రయానికి ఇష్టపడరు. కొన్ని సందర్భాలలో నిర్ణయాలు వెంటవెంటనే చెప్పలేని పరిస్థితులు నెలకొంటాయి. మెతక వైఖరి కొంత ఇబ్బందులను తెచ్చిపెడుతుంది. సంతానం లేని వారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. అవివాహితులైన వారికి మంచి సంబంధం కుదురుతుంది, వివాహం జరుగుతుంది. ఫైనాన్స్ కంపెనీల ద్వారా నష్టపోతారు. సంతాన విషయంలో ఏకపక్ష నిర్ణయాలను తీసుకుంటారు. సహోదర సహోదరీ వర్గంతో నిష్కారణ విభేదాలు ఏర్పడతాయి. కొన్ని ముఖ్యమైన విషయాలలో తల్లిదండ్రులను ఒప్పించలేని పరిస్థితి ఏర్పడుతుంది. అందరినీ కాదనుకుని మీకు మీరుగా కఠిన నిర్ణయాలను తీసుకుంటారు. వృత్తి, ఉద్యోగాల పట్ల ఉన్నటువంటి చికాకులు తొలగిపోతాయి. కోర్టుతీర్పులు మీకు అనుకూలంగా వచ్చినా మనస్తాపం కలుగుతుంది. ఆత్మీయతలని, అనురాగాలని మరచిపోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. విలాసవంతమైన జీవితం గడపాలని ఊహాగానాలు చేస్తారు. సంగీత సాహిత్య రంగాలలో రాణిస్తారు. క్రీడలలో గుర్తింపు వస్తుంది. మార్షల్ ఆర్ట్స్, డ్రైవింగ్ నేర్చుకోవాలని కష్టపడతారు. ప్రతిరోజు ఆరావళి కుంకుమతో మహాలక్ష్మికి పూజ చేయండి. లక్ష్మీతామర వత్తులతో దీపారాధన చేయండి. ఆరోగ్య పరిరక్షణకు, శారీరక సౌందర్య పరిరక్షణకు ప్రాధాన్యతనిస్తారు. సాంకేతిక విద్యపరంగా మంచి రాణింపు వస్తుంది. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలో సీటు లభిస్తుంది. విదేశీయాన విషయాలు అనుకూలిస్తాయి, గ్రీన్‌కార్డు లభిస్తుంది. మొత్తం మీద ఒకటి రెండు విషయాలు మినహా సంతృప్తికరంగా ఉంటుంది. పుణ్యస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో వృషభరాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం - 14 | రాజ - 4 | అవ - 7 |
|---|---|---|---|

**కృత్తిక 2, 3, 4, పాదములు, రోహిణి 4 పాదములు, మృగశిర 1, 2 పాదములందు పుట్టినవారు మరియు "ఈ, ఊ, ఏ, ఓ, వా, వీ, వు, వె, వో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు వృషభరాశికి చెందినవారు.**

# 2016-2017 సంవత్సర ఫలితములు

వృషభరాశివారికి ఈ సంవత్సరము సంతృప్తికరంగా ఉంది. ఆర్థికంగా పుంజుకుంటారు. ఆరోగ్య విషయంలో అజాగ్రత్త మంచిది కాదు. ఏ విషయాన్ని నిర్లక్ష్యం చేయకుండా ఉంటే మంచి ప్రయోజనాలు దక్కుతాయి.

శక్తి సామర్థ్యాలకు తగిన గుర్తింపు, చదివిన చదువుకి తగిన ఉద్యోగం లభిస్తుంది. ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది. గ్రీన్‌కార్డు కోసం ప్రయత్నించేవారికి ఈ సంవత్సరం గ్రీన్‌కార్డు తప్పక లభిస్తుంది. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. సామాజిక సేవా కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొంటారు. మీ శక్తి కొలదీ ఇతరులకు సహాయపడతారు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న వృద్ధాశ్రమాలు, విద్యాసంస్థలు, అనాథ ఆశ్రమాలు, వికలాంగులకు సంబంధించిన ఆశ్రమాలు మొదలైన వాటికి మంచి ఖ్యాతి లభిస్తుంది. ఆర్థిక సహాయం అందుతుంది. రాజకీయాలలో ఉన్నవారికి ఊహించని విధంగా పదవిప్రాప్తి కలుగుతుంది. శత్రువర్గం మీద ఆధిపత్యం చెలాయించాలనే మీ చిరకాలవాంఛ నెరవేరుతుంది. ఈ సంవత్సరం మీ జీవితాశయం నెరవేరుతుంది. విద్యాసంబంధమైన విషయంలో, పోటీ పరీక్షల సంబంధమైన విషయంలో ఎంతో శ్రమించి మంచి ఫలితాలు సాధిస్తారు. పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలు, బ్యాంకు పరీక్షలు, టీచరు పరీక్షలు మొదలైన వాటిల్లో సానుకూల ఫలితాలు సాధిస్తారు. ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్., ఐ.ఐ.టి వంటి ప్రతిష్టాత్మకమైన వాటికి ఎంపిక అవుతారు. సమాజంలో గౌరవాన్ని పెంచుకోగలుగుతారు. మీ వ్యక్తిత్వం మరింత ప్రకాశిస్తుంది. నలుగురికి సహాయపడాలనుకునే మీ మనస్తత్వానికి భగవంతుడు తగినవిధంగా మంచి ఫలితాలను అందిస్తాడు. మీ ప్రతిభా సామర్థ్యాలతోపాటు మీ పూజలు, పురస్కారాలు, దానధర్మాల ఫలితం అన్ని విషయాలలోనూ అక్కరకు వస్తుంది. వ్యాపారంలో రొటేషన్ బాగుంటుంది. లాభాలు బాగుంటాయి. నూతనంగా ప్రారంభించిన మీ వ్యాపారం విజయవంతం అవుతుంది. రాజకీయ నాయకులు, అధికారుల అండదండలు లభిస్తాయి. సమాజం పోకడ మీద నమ్మకం పోతుంది. ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో తెలుసుకోవటం అత్యంత కష్టమైన పని అవుతుంది. ఆప్యాయతలు, అనుబంధాలు, స్నేహాలు, బంధుత్వాలు ఇవన్నీ డబ్బుల ముందు ఎందుకూ కొరగావని తెలుసుకుంటారు. తెలిసినవారైనప్పటికీ, సన్నిహితులైనవారైనప్పటికీ లంచం ఇవ్వనిదే

పని జరగదని తెలుసుకుంటారు. చిరునవ్వుల వెనుక ఉన్న వైషమ్యాన్ని గ్రహించలేరు. అందరూ మనవాళ్ళే కదా అని భావిస్తారు. ఇందువల్ల కొంత ఇబ్బంది పడతారు. సమాజం పోకడ పూర్తిగా అర్థమవుతుంది. కుటుంబ పురోగతి బాగుంటుంది. సంతాన పురోగతి బాగుంటుంది. సంతానం విద్య విషయమై శక్తికి మించి ఖర్చుచేస్తారు. కాంట్రాక్టులు, లీజులు మీకు లాభిస్తాయి. వ్యాపారానికి ఇబ్బంది లేనటువంటి వాతావరణాన్ని ఏర్పరచుకోగలుగుతారు. రాజకీయ వ్యాపారం చేస్తున్నామా అని ఒక దశలో ఆలోచిస్తారు. కొన్ని సాంకేతిక కారణాలవల్ల బ్యాంకు లోనులు తీసుకుంటారు. ప్రైవేటు వ్యక్తులనుండి లోనులు తీసుకునే పరిస్థితి ఏర్పడుతుంది. మాట తప్పే వ్యక్తులవల్ల చికాకు, నష్టం కలుగుతుంది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలకు నూటికి తొంభైశాతం కాలం బాగుంది. అయినప్పటికి సామాజిక పరిస్థితులవల్ల, వాతావరణ పరిస్థితులవల్ల కొద్దిగా ఇబ్బంది కలుగుతుంది. లీజులకి సంబంధించిన విషయాలు, గనులకు సంబంధించిన విషయాలు, ఇసుక వ్యాపారం, ఇటుకరాళ్ళ వ్యాపారం కొంత వివాదస్పద మవుతాయి. కళలు, సాహిత్య, సాంస్కృతిక రంగాలలోని వారికి మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. అవార్డులు, బిరుదులూ లభిస్తాయి. రాజకీయం చేసి అవార్డులు సాధించారని మీపై నిందారోపణ రావడం మానసిక వేదనకు కారణమవుతుంది. ఈ దుష్ప్రచారం మీ మీద అనుకూలంగా ప్రభావం చూపిస్తుంది. మరింత సాధన చేసి మీ నైపుణ్యాన్ని బహిరంగ సభలలో చాటుతారు. ప్రజలే మీ ప్రతిభకు పట్టం కడతారు. ప్రశంసల జల్లు కురిపిస్తారు. మిత్రబృందాన్ని విస్తరింపచేయడం కన్నా నిజమైన మిత్రులను గుర్తించి వారితో సఖ్యత పెంచుకోవడం మంచిది. కొంతమంది నమ్మకద్రోహం చేసినా అది ఎవరికీ చెప్పరు. లోపంలేని మనిషి ఉండదని సరిపెట్టుకుని సన్మార్గంలో నడవమని హెచ్చరించి వదిలివేస్తారు. కంటి సైటు పెరిగే అవకాశం ఉంది. జాగ్రత్త వహించండి. దీర్ఘకాలిక అనారోగ్యాలు తగ్గుముఖం పడతాయి. ఒక మందిరం కాని, గుడినికాని కడతారు లేకపోతే దీనికి విశేషంగా సహాయం చేస్తారు. క్రమశిక్షణతో పొదుపు పథకాలను అమలుపరిచే ఆర్థిక స్థిరత్వం కోసం ప్రయత్నిస్తారు. దుర్వ్యసనాల ప్రభావం, స్నేహితుల ప్రభావం కొంత పెడదోవ పట్టించే అవకాశం ఉంది. జూదార్జిత ధనం కోసం ఎదురుచూడకండి. బెట్టింగులు, కోడిపందాలు, పేకాట, స్పెక్యులేషన్లకు దూరంగా ఉండండి. పదిమందికి బాగోగులు చెప్పే స్థానంలో ఉన్న మీరు చిన్నవాళ్ళతో నీతులు చెప్పించుకోవలసిన పరిస్థితులు ఏర్పడకుండా జాగ్రత్తపడండి. సరైన సమయంలో వచ్చినటువంటి మంచి సంబంధాలను తిరస్కరించినందుకు ఇప్పుడు బాధపడే పరిస్థితి ఏర్పడుతుంది. అమ్మాయి నచ్చితే జాతకం కుదరకపోవడం, జాతకం కుదిరితే అమ్మాయి నచ్చకపోవడం ఇవన్నీ బాగుంటే అమ్మాయితరపువారు సంబంధం వద్దు అనడం, దగ్గరదాకా వచ్చిన సంబంధాలు వెనక్కి వెళ్ళిపోవడం మానసిక వేదనకు కారణమవుతాయి. ఎట్టకేలకు ఒక మంచి సంబంధం కుదురుతుంది, మానసిక సంతోషం కలుగుతుంది. శుభకార్యాల విషయంలో మీ మీదున్న బాధ్యతలు సక్రమంగా నెరవేర్చగలుగుతారు. వివాహం ఒక అంతుపట్టని రహస్యంగా భావిస్తారు. కాలప్రవాహం వివాహాన్ని ఎటు తిప్పుతుందో మనం గ్రహించలేమని తెలుసుకుంటారు. చాలా విషయాలలో ఎంతో పరిజ్ఞానం ఉన్న పరిజ్ఞానులు మీరు. అలాంటి మీరు చిన్న చిన్న విషయాలలో పొరపాటు అడుగులు వేస్తారు. చాలా సామాన్యమైన వ్యక్తి చేతిలో మోసపోతారు. మీరు అమాయకురాలు, బుద్ధిమంతురాలు అని భావించిన ఒక స్త్రీ అగ్గిపిడుగు అవుతుంది. మీ అంచనాలు తలక్రిందులు అవుతాయి. స్నేహితులు, సన్నిహితులు ప్రక్కవారి మాట వింటే

**మోహం మనిషిని పతనం చేస్తుంది.**

మీకు ఇలాంటి పరిస్థితులు దాపురించేవి కావు. అతి గోప్యమే మీ శత్రువు అవుతుంది. దిద్దుబాటు చర్యలు, బుజ్జగింపులు, మధ్యవర్తి పంచనామాలు ఇలాంటివి కొంత ఊరట కలిగిస్తాయి. సహాయం చేసినవాళ్ళ ఎడల అంతా మరచిపోయినట్లుగా నటించే వ్యక్తులు మీ ఆగ్రహానికి కారణమవుతారు. చిన్న సమస్యలే కదా అని నిర్లక్ష్యం చేస్తే అవే పెరిగి పెరిగి కొండలాంటి సమస్యలుగా తయారవుతాయి, కనుక అలాంటి పరిస్థితి తెచ్చుకోకండి. అనుకూలమైనటువంటి శుక్రగ్రహ ప్రభావం వల్ల విలాసాలు, విందులు, వినోదాలు అనుభవిస్తారు. సంతానం పురోగతి గర్వించే విధంగా ఉంటుంది. ఇష్టమైన స్వగృహాన్ని ఏర్పరచుకోగలుగుతారు. అపార్టుమెంటు కల్చర్‌కు దూరంగా ఉండాలని భావిస్తారు. చెల్లించినటువంటి బిల్లులనే తిరిగి చెల్లించే పరిస్థితి ఏర్పడుతుంది. మంచి స్వప్నాలు (కలలు) మానసిక ఉల్లాసాన్ని కలిగిస్తాయి. రాత్రిపూట చేసే ఆలోచనలు కలిసివస్తాయి. చాలామంది జీవితాలు మీ ఆలోచనా విధానాల మీద, మీ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి ఉంటాయి, కనుక ఎప్పుడూ మనస్సు ప్రశాంతంగా ఉంచుకోండి. యోగాభ్యాసాలు, మెడిటేషన్ గురించి ప్రచారంలో ఉన్నటువంటి ప్రయోజనాలు మీకు దక్కవు. దైవాంశసంభూతులమని ప్రచారం చేసుకునేవారి మాటలు విని నష్టపోతారు. ప్రతిరోజు అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి, సిద్ధగంధాన్ని ధరించండి. బంధువులతో ఉన్న విభేదాలను పరిష్కరించి ఒక శుభకార్యం జరగడానికి మీరు కారకులు అవుతారు. కొద్దికాలం జ్యేష్ఠ సంతానం వైఖరి ఇబ్బందికరంగా మారుతుంది. కుటుంబంలో మరోకొత్త ఆదాయం ప్రారంభమవుతుంది. అంటే మరొకరికి ఉద్యోగం వస్తుంది. దైవానుగ్రహం వలన చాలా విషయాలలో అదృష్టం మిమ్మల్ని వరిస్తుంది. వైరివర్గంతో ఏర్పడినటువంటి స్థిరాస్థి వ్యవహారాలూ, లిటిగేషన్ వ్యవహారాలూ మీకు అనుకూలిస్తాయి. దైనందిన జీవితంలో మార్పులు తెస్తారు. పగ, ప్రతీకారం, ముక్కుమీద కోపం, వ్యసనాలు మొదలైన వాటికి దూరంగా ఉంటారు. అన్ని విషయాలలోనూ లౌక్యం ప్రదర్శిస్తారు. ఇతర భాషలు నేర్చుకోవాలనే విషయంలో చాలా శ్రద్ధ వహిస్తారు. వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారం బాగుంటుంది. పాతస్నేహాలు, కొత్తస్నేహాలు కలగలుపుగా పరపతి కలిగిన వారి పరిచయాలే ప్రాతిపదికగా, ప్రామాణికంగా కొన్ని కాంట్రాక్టులు, వ్యాపారాలు చేసి ప్రయోజనం పొందుతారు. ఎంత ఒత్తిడి తెచ్చినా శ్రమించని సోమరిపోతులకు భాగం ఇవ్వడానికి ఇష్టపడరు. మీ వ్యక్తిగత రహస్యాలను ఇతరులకు చేరవేస్తున్న వ్యక్తులను గమనిస్తారు. వారిని తగినవిధంగా దండించి దూరంగా ఉంచుతారు. కుటుంబ విషయాలలో బయటివారి అతి జోక్యానికి అడ్డుకట్ట వేస్తారు. ఎవరి పరిధిలో వారిని ఉంచి మీ పరిధి ఏమిటో తెలుసుకుని ప్రవర్తిస్తారు. నీతులు చెప్పడమే కాదు ఆచరణయోగ్యమని నిరూపిస్తారు. కొంతమంది విషయాలలో వాలెంటరీ రిటైర్మెంట్ గురించి ఇంట్లో ఒత్తిడి వస్తుంది. అందరూ ఇష్టపడరు. దానివల్ల ప్రయోజనాల కన్నా నష్టాలే ఎక్కువని భావించి ఆ విషయాన్ని పక్కన పెడతారు. స్నేహితుల ఒత్తిడి మేరకు యూనియన్ కార్యక్రమాలలో పాల్గొనవలసి వస్తుంది. యూనియన్ కార్యక్రమాలను పకడ్బందీగా జాగ్రత్తగా నడిపి మీడియా దృష్టిని ఆకర్షిస్తారు. రాజకీయ పరపతి పెరుగుతుంది. సర్వరక్ష చూర్ణంతో స్నానం చేయడం మంచిది. దురాశకు పోయి నష్టపోయినటువంటి ఆత్మీయులను ఆదుకుంటారు. కార్యాలయంలో నిష్కారణంగా మిమ్ములను వేధిస్తున్న ఓ అధికారికి ట్రాన్స్‌ఫర్ రావడం మీకు ఊరట కలిగిస్తుంది. కుటుంబానికి సంబంధించిన కొన్ని విషయాలలో కఠినంగా వ్యవహరిస్తారు. ఏకపక్ష నిర్ణయాలు తీసుకుంటారు. గతంలో పొదుపు చేసినటువంటి ధనం ఇప్పుడు కొన్ని మంచి కార్యక్రమాలకు

ఉపయోగపడుతుంది. ఇదే విధంగా గతంలో పెట్టుబడి పెట్టిన రకరకాల అంశాలు ఇప్పుడు కొండంత అండగా నిలబడతాయి. స్థిరాస్థుల విలువ బాగా పెరుగుతుంది. పసుపు, మిర్చి, కాటన్, కూరగాయలు, బియ్యం, కందిపప్పు వ్యాపారాలకు మంచి లాభాలు ఈ సంవత్సరం సూచిస్తున్నాయి. ఈ సంవత్సరం మీ సమస్యలకంటే ఎక్కువగా ఇతరుల సమస్యలను పరిష్కరించడానికే ఎక్కువ సమయం కేటాయించవలసి వస్తుంది. అనుకూలమైన శని, శుక్ర గ్రహాల వల్ల అవరోధాలను అధిగమించగలుగుతారు. మీ ఫ్యాక్టరీలో మీరు తయారుచేస్తున్న ఉత్పత్తులకు డూప్లికేట్స్ బెడద పొంచి ఉంది. అర్థంలేని రాజకీయాలు, అంతుచిక్కని మనుష్యుల ఆంతర్యం చికాకు కలిగిస్తాయి. భ్రాంతితో, భయంతో వెళ్ళదీస్తున్న వ్యక్తులను చేరదీసి ధైర్యం చెబుతారు. మీ నైపుణ్యానికి సంబంధించి అవార్డులు, రివార్డులు వస్తాయి. మీ మనస్తత్వానికి విరుద్ధంగా మీకు ఇష్టం లేకపోయినా కొన్ని పైరవీలు చేస్తారు. భాగస్వామి వ్యాపారాలు లాభాల దిశగా నడుస్తాయి. అయితే భాగస్వాముల నిజాయితీని పరిశీలించుకోవాల్సి ఉంటుంది. వ్యాపార సంబంధమైన లోనులు తీసుకుంటారు. కొన్ని మొండిబాకీలు వసూలు అవుతాయి. ప్రభుత్వ పరంగా, ప్రైవేట్ సంస్థలపరంగా రావాల్సిన ధనం అతికష్టం మీద చేతికి వస్తుంది. బ్యాంకు బ్యాలెన్స్ చూసుకోకుండా చెక్కులు ఇవ్వడం వలన స్వల్ప ఇబ్బందులు ఎదురవుతాయి. నిర్మాణ సంబంధమైన పనులకు సంబంధించి మంచి లాభాలు, పేరుప్రఖ్యాతలు లభిస్తాయి. ఫైనాన్సియల్ స్కీమ్స్‌లలో చేరవద్దు, నష్టపోతారు. విదేశాలలోని మిత్రులనుండి కొద్దిపాటి ఆర్థికసాయం లభిస్తుంది. లాభం చేకూర్చే ప్రయణాలు వ్యూహ ప్రతివ్యూహాలు ఆర్థికపరమైన రహస్య లావాదేవీలు మొదలైనవి చోటుచేసుకుంటాయి, ఆహార నియమాలు పాటిస్తారు. తలనొప్పి, పార్శ్వపునొప్పి కొంత ఇబ్బందిని కలిగించవచ్చు. వర్గ వైషమ్యాలు, తగాదాలు, వివాదాలు చికాకు కలిగిస్తాయి. సందర్భోచిత నిర్ణయాలు తీసుకుని తామరాకు మీద నీటిబొట్టువలె ప్రవర్తిస్తారు. మీ వ్యక్తిత్వానికి ఎలాంటి మచ్చ రాకుండా జాగ్రత్తపడతారు. పరోపకారం చేయకుండా అదేపనిగా గొప్పలు చెప్పుకోవడం, అహంభావం ప్రదర్శించడం, పరనిందతో కాలం గడిపేవారిని దూరంగా ఉంచుతారు. ఇందుకోసం కొన్ని ప్రయోజనాలను కూడా త్యాగం చేస్తారు. ఇతరుల పేరుమీద మీరు చేసే వ్యాపారాలు కలసివస్తాయి. పశువుల పెంపకం, కోళ్ళ పెంపకం, ఆహారసంబంధమైన వ్యాపారాలు కలసివస్తాయి, వ్యూహాత్మకమైన విషయాలు లాభిస్తాయి. ఏకాంతంగా జరిగిపోయిన కొన్ని విషయాల గురించి ఆలోచిస్తారు. కొన్ని విషయాలను డైరీలలో భద్రపరుస్తారు. కాలప్రవాహానికి ఎదురీదుతారు, కాలగమనానికి అనుకూలంగా నడుచుకుంటారు. ఎదుటివాళ్ళను అంచనా వేయడంలో దాదాపుగా పొరపాటు పడరు. మీ అంచనాలు, వ్యూహాలు, పలుకుబడి, సమయస్ఫూర్తి, భాగస్వాములకు, సంస్థలకు కొండంత అండగా నిలుస్తాయి. మీ మానసిక పరిస్థితిని అర్థం చేసుకోగలిగినవారు నిజంగా ఎవరని తెలుసుకోగలుగుతారు. అవసరమైన వ్యక్తులను, స్వార్థపరులను చేరదీసినందులకు విచారిస్తారు. దూర ప్రాంతాలనుండి ప్రతిష్ఠాత్మకమైన ఆహ్వానం అందుకుంటారు. నిత్యం, నాగసింధూరాన్ని ధరించండి, సిద్ధగంధంతో శ్రీ వేంకటేశ్వర స్వామివారిని అర్చించండి. న్యాయపరమైన చిక్కుల్లో వున్న మీ వాళ్ళను రక్షించవలసిన బాధ్యత మీపై పడుతుంది. కనుమరుగైన వస్తువులు తిరిగి లభిస్తాయి. స్వల్ప కారణాలు పెరిగి పెద్దవై, భేదాభిప్రాయాలు ఎక్కువై ముఖ్యవ్యక్తులతో చట్టపరంగా విడిపోతారు. సర్దుకుపోయే మనస్తత్వం ఇరువైపులా ఉండదు, విడిపోవటమే పరిష్కార మార్గం అవుతుంది. గతంలో మీకు రవ్వంత సహాయం చేసినవాళ్ళు ఆ సహాయాన్ని భూతద్దంలో చూపి గొప్ప

మేలు చేశామని ప్రచారం చేస్తారు, మీ నుండి పెద్ద మొత్తంలో సహాయాన్ని ఆశిస్తారు. న్యాయనిపుణుల సలహాలు, సంప్రదింపులు జరిపిన తరువాత వివాదంలో ఉన్న ఓ ఆస్తిని కొనుగోలు చేస్తారు. గతంలో వద్దు అనుకున్న వ్యవహారాలను తిరిగి ప్రారంభిస్తారు. పురోగాభివృద్ధికి ఉపకరించే ఏ అంశాన్నీ నిర్లక్ష్యం చేయరు. మీ ప్రవర్తనలో ఉన్న లోపాలను ఇతరులు విమర్శించకముందే మార్పులు చేసుకుంటారు. మాట నిలకడలేని మనుషుల వల్ల కొన్ని చెడు అనుభవాలు ఎదురవుతాయి. మీ సన్నిహిత వర్గం చేసిన పనులకుగాను మీరు ఓ సామాజిక వర్గానికి దూరం అవుతారు. వృత్తి, ఉద్యోగాల పరంగా కొంతకాలం చికాకులు ఏర్పడతాయి. మీతో జాగ్రత్తగా ఉండకపోతే దెబ్బతింటామని కార్యాలయంలో సహోద్యోగులు తెలుసుకుని జాగ్రత్తగా మసలుకొంటారు. నష్టం వస్తుందని భావించిన ఓ విషయంలో నష్టం రాదు, ఇదే గొప్ప అదృష్టంగా భావిస్తారు. ప్రచారానికి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. దైవికంతో ధూపం వేయండి, దుష్టశక్తులకు దూరంగా ఉండండి. ఓం నమో నారాయణాయ వత్తులతో దీపారాధన చేయండి. దీర్ఘకాలిక ఋణాలను గడువుకు ముందే తీర్చివేస్తారు. భాగస్వామ్య వ్యాపారాలు విస్తరిస్తాయి. ఆర్థికమాంద్యాన్ని మీరు అధిగమిస్తారు. కొన్ని సందర్భాలలో అసమర్థులైన రాజకీయ దురంధరుల వల్ల ఎలాంటి ఉపయోగం లేకపోవడం నిరాశకు దారితీస్తుంది. విధిలేని పరిస్థితిలో మీ ఉనికికి ముప్పు వస్తుందని భావించి శత్రువర్గం విషయంలో కఠినంగా వ్యవహరిస్తారు, దెబ్బతీస్తారు. యాదృచ్ఛికంగా జరిగే సంఘటనలు మీకు లాభిస్తాయి. అనవసరమైన పోచుకోలు సంభాషణలతో కాలయాపన చేస్తున్న మీ ఆత్మీయవర్గాన్ని మందలించి దారిలో పెడతారు. ప్రతిష్ఠాత్మకమైన సభలను, సమావేశాలను ఏర్పాటుచేసి మీ పరపతి మరింత పెంచుకుంటారు. వాయిదాల మీద వాయిదాలు పెడుతూ మిమ్ములని విసిగిస్తున్న ఓ ముఖ్యమైన పని కార్యాలయంలో పరిష్కారమవుతుంది. కీలకమైన స్థానంలో ఉన్న ఓ అధికారి ద్వారా దాన్ని సాధిస్తారు. వివాహాది శుభకార్యాల విషయాలు ప్రధాన ప్రస్తావన అంశాలు అవుతాయి, నిర్ణయాలు తీసుకోవాల్సిన తప్పనిసరి పరిస్థితి ఏర్పడుతుంది. తెలివిగా ప్రవర్తించి అన్ని విధాలా ఆలోచన చేసి శుభకార్యాల విషయాన్ని ఓ కొలిక్కి తెస్తారు. పునర్వివాహ సంబంధ విషయాలలో కూడా మీ కృషి ఫలిస్తుంది. ప్రేమవివాహాలను మాత్రం కఠినంగా వ్యతిరేకిస్తారు. చతుర్థ స్థానంలో సంచరించు గురు రాహువులు, సప్తమ స్థానంలో సంచరించు శని, దశమ స్థానంలో సంచరించు కేతువు, సూర్యచంద్ర గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. అవివాహితులకు వివాహం జరిగే అవకాశం స్వల్పంగా ఉన్నాయి. మీ మనస్సాక్షికి విరుద్ధంగా కొన్ని కార్యక్రమాలు చేయవలసి వస్తుంది. విదేశీ సంబంధాలు కుదిరే అవకాశం ఉంది. స్వతంత్ర నిర్ణయాలు తీసుకుని కుటుంబంలోనూ, బంధువులలోనూ కొంత అలజడి సృష్టిస్తారు. ఇతరులకు సంబంధించిన ముఖ్యమైన డాక్యుమెంట్స్ మీ దగ్గర భద్రపరుస్తారు. దైవికంతో ధూపం వేయండి అది దుష్టశక్తులకు అడ్డుకట్ట అని తెలుసుకొండి. సంవత్సర ప్రథమార్థం కన్నా ద్వితీయార్థం బాగుంటుంది. మొత్తంమ్మీద మానసిక సంతృప్తి మిగులుతుంది. పెట్టుబడిపెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు. ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

**స్త్రీలకు ప్రత్యేకం**

ఈ సంవత్సరం అనేక బరువుబాధ్యతలను మోయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. విద్యారంగంలో మంచి ఫలితాలను సాధిస్తారు. మీరు కోరుకున్న మెడిసిన్ సీటు లభిస్తుంది. సివిల్ సర్వీసులకు ఎంపిక అయ్యే అవకాశం ఉంది. ప్రభుత్వ ఉద్యోగం కోసం ప్రయత్నం

చేసేవారికి ప్రభుత్వ ఉద్యోగం లభిస్తుంది. కుటుంబంలో ప్రశాంతత లోపించకుండా జాగ్రత్త వహిస్తారు. నమ్మిన వ్యక్తులు అయినకాడికి డబ్బులు దుర్వినియోగం, దిగమింగటం జరుగుతుంది. దొంగలని తెలిసికూడా చర్యలు తీసుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. ప్రసార సాధనాల వల్ల లాభనష్టాలు సరిసమానంగా ఉంటాయి. మీడియా ద్వారా మీ వైరివర్గం ప్రయోజనం పొందకుండా చర్యలు తీసుకుంటారు. స్వంత మనుషుల ద్వారా ఆశించిన పనులు నెరవేరవు, దీనికిగాను మీరు మరొకరిని వెతుక్కోవలసి వస్తుంది. కోర్టుతీర్పులు అనుకూలంగా వచ్చినా ప్రయోజనాలు మాత్రం ఆలస్యంగా ఆచరణలోకి వస్తాయి. ఆధ్యాత్మిక, సామాజిక, పితృదేవతల జ్ఞాపకార్థం ధనం వెచ్చిస్తారు. ప్రేమవివాహాలు మోసం అని గ్రహిస్తారు. కొంతమంది విషయంలో ఆత్మీయులతో అనురాగాలు పంచుకోవలసింది పోయి, చట్టపరంగా శాశ్వతంగా విడిపోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఉన్నతవిద్యా అవకాశాలు కలసివస్తాయి. నిత్యం పసుపు వత్తులను అష్టమూలికా తైలంతో కలిపి దీపారాధన చేయండి. ఆయాచితంగా కొన్ని శుభఫలితాలు చేతికి అందుతాయి. పెట్టుబడులు, స్థిరాస్థుల వ్యవహారాలు క్రమవృద్ధిలో ఉంటాయి. పెద్దలు, వృద్ధుల పట్ల మీ బాధ్యతలు నెరవేర్చుకో గలుగుతారు. రహస్యంగా కొంతమందికి ఆర్థికసాయం అందజేస్తారు. ప్రశాంతంగా జరుగుతున్న మీ జీవితంలో ఓ వ్యక్తి ప్రవేశం కొన్ని మార్పులకు దారితీస్తుంది. సంతాన క్రమశిక్షణపై ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. క్రమశిక్షణాయుతమైన జీవితాన్నే గడుపుతారు. స్వయం సంపాదన కొండంత అండగా నిలుస్తుంది. యోగా, మెడిటేషన్ వల్ల లాభపడతారు. ఆప్యాయతలకు, అన్యోన్యతకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. చాలా విషయాలలో ఓర్పు, సహనం కనబరుస్తారు. మంచి సంబంధం కుదురుతుంది. వివాహం జరుగుతుంది. పునర్వివాహ ప్రయత్నాలు చేసేవారికి కాలం అనుకూలంగా ఉంది. అన్యభాషలు నేర్చుకోవాలనే ఆసక్తి కలుగుతుంది. మార్షల్ ఆర్ట్స్, డ్రైవింగ్ పట్ల మక్కువ చూపుతారు. పూలతోటల పెంపకం, వ్యక్తిగత సౌందర్య పరిరక్షణకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. బ్యూటీపార్లర్స్ నడిపేవారికి కాలం చాలా అనుకూలంగా ఉంది. మీరు వేసే ప్రతి అడుగు అభివృద్ధికి సోపానం కావాలని చాలామంది కోరుకుంటారు. ఆరోగ్యపరమైన సమస్యలు తగ్గుముఖం పడతాయి. రీవాల్యుయేషన్, రీకౌంటింగ్ లాభిస్తాయి. అధ్యాపకుల వల్ల లాభం పొందుతారు. కోపం, మాట దురుసుతనం, తగ్గించుకుంటే మరింత మంచి ఫలితాలు ఉంటాయి. స్థిరాస్థులు ఏర్పడతాయి, ఆర్థిక పురోగతి బాగుంటుంది. విదేశాలలో చదువుకునే అవకాశం లభిస్తుంది. ముఖ్యమైన విషయంలో పెద్దల మాటలు వినడం మీకు సర్వదా శ్రేయస్కరం. మధ్యమధ్యలో మోకాళ్ళ నొప్పులు, కీళ్ళ నొప్పులు బాధిస్తాయి. రాజకీయ పదవి ప్రాప్తి ఉంది. ఉద్యోగంలో ప్రమోషన్ లభిస్తుంది. స్త్రీకి స్త్రీయే శత్రువు అన్న సామెత మీ విషయంలో నిజమవుతుంది. ప్రతిరోజు అష్టమూలికా గుగ్గిలంతో ధూపం వేయడం మంచిది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో మిథునరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 14 | వ్యయం - 11 | రాజ - 7 | అవ - 7 |

**మృగశిర 3, 4 పాదములు, ఆరుద్ర 4 పాదములు, పునర్వసు 1, 2, 3 పాదములందు పుట్టినవారు "కా, కి, కూ, ఖం, ఙ, ఛ, కే, కో, హా" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మిథునరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

మిథునరాశి వారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. ముఖ్యమైన విషయాల్లో విజయం సాధిస్తారు. ప్రజలలో ప్రఖ్యాతి పెరుగుతుంది. ఆర్థికస్థితి బాగుంటుంది. ప్రతిష్ఠాత్మకమైన అవార్డులు లభిస్తాయి. కుటుంబ పురోగతి బాగుంటుంది. స్థిరాస్తులు వృద్ధి చెందుతాయి. అనారోగ్య సమస్యలు పోతాయి. కోర్టుతీర్పులు అనుకూలంగా వచ్చినా ప్రయోజనాలు మాత్రం ఆలస్యంగా ఆచరణలోకి వస్తాయి. వృత్తి, ఉద్యోగాలపరంగా పోటీదారులను సమర్థవంతంగా ఎదుర్కొంటారు. వృత్తి, ఉద్యోగాల అభివృద్ధికి వ్యూహరచన ఫలిస్తుంది. దివారాత్రులు కష్టపడి పనిచేస్తారు. సానుకూలమైన ఫలితాలు సాధిస్తారు. విద్యా సంబంధమైన విషయాలు, సాంకేతిక సంబంధమైన విషయాలు, వైద్యవిద్యకు సంబంధించిన విషయాలు, సివిల్ సర్వీసులకు సంబంధించిన విషయాలు సానుకూలపడతాయి. జీవితాశయం సాధించామన్న సంతృప్తి కలుగుతుంది. కుటుంబం పట్ల మీ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తారు. పెద్దలను, వృద్ధులను గౌరవిస్తారు. వాళ్ళ అవసరాలు దగ్గరుండి చూసుకుంటారు. సంతాన పురోగతి బాగుంటుంది. మెరిట్ మార్కులు సాధిస్తారు. కుటుంబంలో మరొకరికి ఉద్యోగం వస్తుంది. పగలూ, ప్రతీకారాలకు దూరంగా ఉంటారు. వివాదాస్పదమైన అంశాలలో తలదూర్చరు. ఎప్పుడో కొనుగోలు చేసిన స్థిరాస్తులకు మంచి ధర వస్తుంది. స్థిరాస్తులు వేటినీ అమ్మకూడదని కుటుంబపరంగా నిర్ణయం తీసుకుంటారు. విద్యార్థినీ విద్యార్థులు బాగా రాణిస్తారు. నిత్యం సరస్వతీ తిలకాన్ని ధరించాలి, జ్ఞాన చూర్ణాన్ని సేవించాలి. విదేశాలలో ఉన్న వారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. పి.హెచ్.డి చేయాలన్న మీ కోరిక ఫలిస్తుంది. నూతన భాగస్వాములతో చేసే నూతన వ్యాపారాలు బాగుంటాయి. ప్రభుత్వపరంగా, ప్రైవేట్‌పరంగా వర్క్ ఆర్డర్స్ వస్తాయి. కాంట్రాక్టులు, సబ్ కాంట్రాక్టులు, లీజులు అనుకూలిస్తాయి. వ్యాపారంలో నూతన బ్రాంచీలను నెలకొల్పుతారు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న సేవాసంస్థలు, విద్యాసంస్థలకు మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. మీరు చదివిన చదువుకి తగిన ఉద్యోగం లభిస్తుంది. పోటీ పరీక్షలలో విజయం చాలా తేలికగా విజయం సాధిస్తారు. ఇన్‌కంటాక్స్ రిటర్న్స్ దాఖలు చేసే విషయంలో జాగ్రత్త వహించండి. ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న అగ్రిమెంట్లు పూర్తవుతాయి. నూతన లైసెన్సులు లభిస్తాయి. పి.ఎఫ్. లేదా ఫిక్స్‌డ్ డిపాజిట్ల వల్ల లాభం పొందుతారు. రహస్యంగా బ్యాంకు అకౌంట్స్

ప్రారంభిస్తారు. కొందరి విషయంలో విడాకులు అనివార్యం అవుతాయి. పాల ఉత్పత్తులకు సంబంధించి లాభాలు అంతంతమాత్రంగానే ఉంటాయి. ఇంటర్నెట్, వైద్య పరికరాలు అమ్మే వ్యాపారులకు కాలం అనుకూలంగా ఉంది. రాజకీయ పైరవీలు లాభిస్తాయి. మీ పేరుమీద ఇతరులు చేసే వ్యాపారాలలో అవకతవకలు చోటు చేసుకుంటాయి. మీ సన్నిహితుల సహకారంతో వీటిని గాడిలో పెట్టగలుగుతారు. సామాజిక, సేవాకార్యక్రమాలలో అనాథాశ్రమ కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటారు. సేవ చేస్తారు. కార్యాలయంలో టీం స్పిరిట్‌తో పనిచేసి మంచి ఫలితాలు సాధించి, ఉన్నత అధికారుల మెప్పు పొందుతారు. పోస్ట్‌పోన్ చెక్కులు వివాదాస్పదం కాకుండా జాగ్రత్త వహించండి. ఫైనాన్షియల్ స్కీమ్‌లు, లక్కీడ్రాలకు దూరంగా ఉండండి. వృత్తి, ఉద్యోగపరంగా మీ స్థాయి, మీ స్థానం పెరుగుతుంది. నూతన వాహనం కొనుగోలు చేస్తారు. లాభం చేకూర్చే ప్రయాణాలు చేస్తారు. విద్యార్థినీ విద్యార్థులకు కొద్దికాలం చదువులో ఏకాగ్రత లోపిస్తుంది. మేధో దక్షిణామూర్తి రూపు మెడలో ధరించాలి. నూతన భాషలు అభ్యసించాలని, జనరల్ నాలెడ్జ్ పెంచుకోవాలని, ఆహార నియమాలు పాటించాలని నిర్ణయించుకుంటారు. సాంప్రదాయ వంటకాల వైపు మొగ్గు చూపుతారు. ఫాస్ట్‌ఫుడ్స్‌లకు దూరంగా ఉంటారు. కీళ్ళనొప్పులు, ఇ.ఎన్.టి. నొప్పులు ఇబ్బందిపెడతాయి. యోగాసనాలు, మెడిటేషన్ వల్ల లాభం పొందుతారు. తెలిసీ తెలియని వైద్యాలు చేయించుకోవద్దు. ఇందువలన తప్పనిసరిగా ఇబ్బందులు ఎదురవుతాయి. పుస్తక పఠనం, గ్రంథరచన పట్ల శ్రద్ధ పెడతారు. పట్టుదలతో కృషి చేస్తారు. దీని వెనుక ఆంతర్యంలో పట్టుదల, ప్రతీకారం పొంచి ఉంటాయి. సందర్భోచిత నిర్ణయాలు తీసుకుని మీ పెద్దరికాన్ని కాపాడుతారు. సహోదర సహోదరీ వర్గంతో బాంధవ్యాలు బాగుంటాయి. వాళ్ళని అవసరమైనప్పుడల్లా ఆదుకుంటారు. తల్లిదండ్రులపట్ల మీ బాధ్యతను సక్రమంగా నిర్వహిస్తారు. కోర్టుపరమైన వ్యవహారాల గురించి విస్తృతమైన చర్చలు కొనసాగిస్తారు. కోర్టుతీర్పులు రాకుండానే మధ్యవర్తి రాజకీయ యత్నాలు చేస్తారు. మీ ప్రయోజనాలను పరిరక్షించుకుంటారు. మీ భాగస్వాముల వద్ద, స్నేహితుల వద్ద మీ నిజాయితిని నిరూపించుకోవలసి రావటం ఇబ్బందికరంగా మారుతుంది. మానసిక వేదనకు కారణమవుతుంది. మీరు అందరిలోనూ ప్రత్యేకంగా ఉండడం కొందరి అసూయకు కారణమవుతుంది. మొండికి పడిన పనులు సానుకూలపడతాయి. సెంటిమెంటు వస్తువుల భద్రతా విషయంలో జాగ్రత్త వహించండి. వర్గ వైషమ్యాలు మీ మీద వ్యతిరేక ప్రభావం చూపిస్తాయి. కొంతమందికి ఉద్యోగాలు ఇప్పించి పరోపకారం చేస్తారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. మొక్కుబడులు తీరుస్తారు. వినోద కార్యక్రమాల కొసం కొన్ని వృథా చర్చలు చేస్తారు. అయితే ఇది జీవితంలో ఒక భాగం అని సరిపెట్టుకుంటారు. ప్రేమ వివాహాలకు సంబంధించిన విషయాలలో ఎన్నో ఆశలు పెట్టుకుంటారు. అయితే, చివరకు నిరాదరణ మిగులుతుంది. కొంతమంది విషయంలో ప్రేమ వివాహాలు ఫలిస్తాయి. వివాహానంతర పరిస్థితులు చాలా ఇబ్బందికరంగా మారుతాయి. విడాకులు అనివార్యం అవుతాయి. పరపతి కలిగిన వ్యక్తులతో పరిచయాలు బలపడతాయి. కొన్ని సందర్భాలలో ఇతరులను ఆదర్శంగా తీసుకుని వినూత్న ప్రయోగాలు చేసి నామమాత్రపు ప్రయోజనాలు పొందుతారు. అపరిమితమైన విజ్ఞానాన్ని చేజిక్కించుకుంటారు. చిన్న విషయాలకు కూడా ఎక్కువగా ప్రతిస్పందించడం మంచిది కాదని గ్రహించండి. మీ ప్రతిస్పందన శత్రువులకు బలం చేకూరుస్తుంది. కేశ సంరక్షణకై మీరు తీసుకునే జాగ్రత్తలు సఫలీకృతం అవుతాయి. స్వార్థపరుల సంకుచిత వైఖరి మీకు

స్పష్టంగా అర్థం అవుతుంది. అపరిమితమైన విజ్ఞానాన్ని చేజిక్కించుకుంటారు. కొన్ని దీర్ఘకాలిక కాంట్రాక్టుల పట్ల విముఖత ఏర్పడుతుంది. వివాదాస్పదమైన సంపాదన, ఇతరులకు లాభాలు పంచటం, మానసిక ఉద్వేగం, మిగిలేది కొద్ది మొత్తం. ఈ తరహా వ్యవహారాలు మీకు విసుగును కలిగిస్తాయి. ఇలాంటి పనులకు స్వస్తి చెబుతారు, ప్రయోజనాలు వదులుకుంటారు. స్త్రీలతో విరోధం, స్త్రీల సహాయ నిరాకరణ, వాళ్ళతో అభిప్రాయభేదాలు ఏర్పడి కొన్ని మంచి కార్యక్రమాలను అనుకున్న సమయానికి పూర్తి చేయలేరు. మీ ఐకమత్యం సిద్ధాంతం వల్ల మీరు ఒంటరివాళ్ళవుతారు. కట్టడాల నిర్మాణ సంబంధమైన పనులు అనుకూలిస్తాయి. అందులో పురోగతి బాగుంటుంది. కొన్ని ప్రయోజనాలను వదులుకుని మీ పెద్దరికాన్ని, మర్యాదని నిలుపుకుంటారు. జనాకర్షణ పెరుగుతుంది. మీకు ఇబ్బంది కలిగించే ఉత్తర్వులు, మీ ప్రమేయం లేకుండానే రద్దవుతాయి. దైవానుగ్రహం ఉంది అని నిరూపించే విధంగా కొన్ని సంఘటనలు జరుగుతాయి. రాజకీయరంగంలో ఉన్నవారికి అనుకూల ఫలితాలు గోచరిస్తున్నాయి. స్థిరాస్థులకు సంబంధించి తొందరపడి అడ్వాన్సులు ఇవ్వద్దు. అన్నీ సరిచూసుకుని నిపుణుల సలహాలు తీసుకున్న తరువాత అడ్వాన్సులు ఇవ్వండి. ప్రత్యామ్నాయం లేక చాలామందికి మీరే దిక్కవుతారు. పనిచేసే సామర్థ్యం, నేర్పరితనం ఇవే మిమ్ములను నిలబెడతాయి. పాత విషయాలకు సంబంధించిన వివాదాలు తిరిగి తెరపైకి వస్తాయి. మీకు లేని ఉద్దేశ్యాలు ఆపాదించబడతాయి. మీరు ద్వేషించే వ్యక్తులే మీకు ఆత్మీయులని ఆరోపణ వస్తుంది. మీ వాళ్ళ ప్రతిభ విదేశాలలో రాణిస్తుంది. ప్రభుత్వపరమైన స్కాలర్‌షిప్‌లు లభిస్తాయి. వ్యాపార విస్తరణకు, ఫ్యాక్టరీ కట్టడానికి సంబంధించి అవసరమైన ప్రభుత్వ అనుమతులు ఆలస్యం అవుతాయి. సాంకేతిక నిపుణులతో సాన్నిహిత్యం ఏర్పడటం వల్ల మీకు అనుభవంలేని వ్యాపారాలలో కూడా అడుగుపెడతారు. ఖనిజ, లోహపు సంబంధమైన వ్యాపారాలు కలిసివస్తాయి. గ్రానైట్స్ వ్యాపారం కూడా లాభిస్తుంది. ప్రత్యర్థివర్గ బలహీనతలను సందర్భానుసారంగా ఉపయోగించుకుంటారు. ప్రింటింగ్, అడ్వర్టైజ్‌మెంట్ రంగంలోని వారికి అనుకూలంగా ఉంది. దురలవాట్లు ఉన్నవారికి ముఖ్యమైన పనులు అప్పజెప్పి ఇబ్బందులు పడతారు. కుల, మత, వర్గ విచక్షణ లేకుండా పనిచేసుకునే వ్యక్తిగా ఏ వర్గానికీ చెందని వ్యక్తిగా అందరికీ మీపై అభిప్రాయం ఉంటుంది. ఆత్మీయ వర్గంలోని వ్యక్తి ఇక్కడ పెద్ద మొత్తంలో స్థిరాస్థుల కొనుగోలు చేస్తారు. భవిష్యత్తులో మంచి ధర వస్తుందన్న ఆశతో కొనుగోలు చేస్తారు, మీ అంచనాలు నిజమౌతాయి. మీవాళ్ళు కొన్న ఆస్థులు నాలుగురెట్లు అవుతాయి. పొట్ట, ఒళ్ళు తగ్గించుకోవడానికి చాలా డబ్బు ఖర్చు పెడతారు. ఇందువల్ల ఆశించిన ప్రయోజనం ఉండదు. ప్రకటనలు అబద్ధాలు అని తేలిపోతుంది. బ్యాంకు రుణాలకు సంబంధించి సింగిల్‌టర్మ్ సెటిల్మెంటు కుదురుతుంది. చందాలు, విరాళాలు ఇవ్వడం ఎక్కువ అవుతుంది. దూరపుకొండలు నునుపు అని భ్రమపడతారు, జీవితంలో పొరపాటు నిర్ణయాలు తీసుకోవద్దు. పెద్దలు నిర్ణయించిన వివాహం సఫలం అవుతుంది. పునర్వివాహం కోసం ప్రయత్నించే వారికి అనుకూలమైన మంచి సంబంధం కుదురుతుంది. మోడువారిన జీవితం మళ్ళీ చిగురిస్తుంది. ఈ రాశివారికి ఆకస్మిక అదృష్టం కలిసివస్తుంది. సాధారణంగా జరగవలసిన శుభకార్యాల పట్ల మీకు సరి అయిన అవగాహన ఉంటుంది. ఆందోళన పడరు, కొత్త బంధుత్వాలు ఏర్పడతాయి. ఊబకాయం, అంగవైకల్యంతో బాధపడుతున్న వారిని చూసి మనోవేదన చెందుతారు, సుయోధనుడు, కర్ణుని పరాక్రమాన్ని నమ్ముకుని యుద్ధంలో భంగపడినట్లు మీరు

ఇతరుల నుండి సలహాలను తీసుకోవడం మంచికి దారితీయదు. ప్రచార, ప్రసార సాధనాలు మీపై ఎక్కువ ప్రభావం చూపిస్తాయి. శక్తిసామర్థ్యాలు ఎక్కువగా ఉన్న మీకు ఇతరుల సలహాలు అవసరం లేదని గ్రహించండి. వైరివర్గాన్ని బహిరంగంగా విమర్శించి వాళ్ళకు విలువ తీసుకురావద్దు, చాలా విషయాలలో పట్టించుకోనట్లుగా ఉండడం మంచిదని గ్రహిస్తారు. ఉపయుక్తమైన సభలు, బహిరంగ సభలు ఏర్పాటుచేస్తారు. మీ కార్యదర్శత్వం మరొకసారి నిరూపించుకోగలుగుతారు. కొన్ని విషయాలలో అందరూ పక్కనే ఉన్నా ఒంటరిగా ఫీల్ అవుతారు. ఈ విషయంలో మీ పద్ధతి మార్చుకోవాలి. మర్మావయవాలకు సంబంధించిన సమస్యలు రావచ్చు. జాగ్రత్త వహించండి. మానవతా విలువలు నశించిపోవడం మీకు బాధ కలిగించే అంశంగా మారుతుంది. బద్ధకం, అతినిద్ర వల్ల మంచి అవకాశాలు కోల్పోతున్న మీ సన్నిహితులలో మార్పు తేవడానికి ప్రయత్నిస్తారు. వారిని గాడిలో పెడతారు. ఏ పరిస్థితులు ఏ విధంగా ఉన్నా మీరు మాత్రం కార్యనిర్వహణలో వెనుకంజ వేయరు. కుటుంబం పట్ల శ్రద్ధ ఉందని, ఆప్యాయత ఉందని, కుటుంబ సభ్యులపై విశ్వాసం ఉందని నిరూపించుకోవాల్సి రావటం మీ మానసిక వైరాగ్యానికి కారణమవుతుంది. గణితంలో లోపాలు జరగడం వల్ల పెనాల్టీ చెల్లించాల్సి వస్తుంది. అర్థంలేని ఆలోచనలకు స్వస్తి చెప్పండి. మీకు రావాల్సిన బిల్లులు వాయిదాల మీద వాయిదాలుగా వస్తాయి. పెట్టుబడి పెట్టడానికి దిక్కుతోచని పరిస్థితి ఏర్పడుతుంది, భాగస్వాములతో పెట్టుబడి పెట్టిస్తారు. మీరు భాగస్వాములను మోసం చేస్తున్నారనే నిందలు ప్రచారంలో ఉంటాయి. కొంతమంది అమాయకులకు దీర్ఘకాలిక వేధింపులనుండి విముక్తి కలిగిస్తారు, వారికి రక్షణ కలిగిస్తారు. చట్టాన్ని, న్యాయాన్ని తెలివిగా ఉపయోగించు కుంటారు. విద్యాసంబంధమైన వ్యాపారాలు బాగుంటాయి, విద్యాసంస్థలు లాభాల బాటలో నడుస్తాయి. మధ్యవర్తిగా సంతకాలు చేయవద్దు, మధ్యవర్తిగా ఉండవద్దు. స్థిరచరాస్థులకు సంబంధించిన విషయాలలో కొన్ని సాంకేతికపరమైన ఇబ్బందులు ఎదురవుతాయి. బంధువులలోని ఒక వర్గం మీతో కలసిరాకపోవడం, వ్యతిరేక వ్యాఖ్యానాలు చేయడం మనస్సుకి కష్టం కలిగిస్తుంది. వాళ్ళు కాళ్ళ బేరానికి వచ్చే విధంగా వ్యూహరచన చేస్తారు. మీకు రావాల్సిన పెండింగ్ బిల్సు ఆలస్యంగా చేతికి అందుతాయి. అతీంద్రియ శక్తుల గురించి, మానవాతీత శక్తుల గురించి చెప్పి మిమ్ములని భయపెట్టాలని అనుకునేవారిని దూరంగా ఉంచుతారు. ఈ సమాజంలో విష మనస్తత్వం కలిగిన వ్యక్తుల వలన చెడు జరుగుతుందని గాని, శ్మశానంలో శాశ్వతనిద్రలో ఉన్నవారి వలన ఎటువంటి అపకారం కలగదనే నమ్మకం కలిగి ఉంటారు. మిమ్ములను ఎంతో అభిమానించే స్త్రీ ఆకస్మికంగా మనస్సు మార్చుకుంటుంది. ఇది మీకు మింగుడు పడని అంశంగా మారుతుంది. అసాంఘిక శక్తులతో (రౌడీలు) మీ స్థాయి మరచి పోరాడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. భయపడి చందాలు ఇవ్వడానికి గాని, దౌర్జన్యానికి విరాళాలు రాల్చడం కాని (ఇవ్వడం) చేయరు. ఇలాంటి విషయాల పట్ల పోరాడటానికి ఎంతదూరం అయినా వెళతారు. పెద్దలకు సంబంధించిన సెంటిమెంటు వ్యవహారాలలో ఏ లోటూ లేకుండా విధి విధానంగా నిర్వహిస్తారు. ఆత్మసాక్షికి విలువనిచ్చి మున్ముందుకు సాగిపోతారు. ఈ పోరాటం వలన కార్యాలయంలో మీ సహోద్యోగులకు కూడా ఉద్యోగపరంగా చాలా మేలు జరుగుతుంది. భాగస్వాములు, మీరు నమ్మిన సన్నిహితుల పనితీరు మీకు నచ్చదు. ప్రతి విషయానికి తగాదాలు పడి వారి విలువ చెప్పుకోదగిన స్థాయిలో చికాకు కలుగుతుంది. అర్థంలేని తగాదాలకు పరిష్కారం కనిపించదు. మీరుమీరుగా కొన్ని కఠినమైన బాధ్యతలనుండి

తప్పుకుంటారు. భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని వ్యూహాత్మకంగా ఈ పనిచేస్తారు. నష్టాల దిశగా పయనిస్తున్న కొన్ని వ్యాపార వ్యవహారాలను మీ కృషి, పలుకుబడి వలన లాభాల బాటలో నడిపిస్తారు. మీరు అందరి విషయంలో ఒకే విధంగా ప్రవర్తించి విమర్శలు రాకుండా జాగ్రత్తపడతారు. ఈ రాశివారు ఈ సంవత్సరం రుద్రపాశుపత హోమం చేయించాలి. అన్యభాషలు నేర్చుకోవడానికి విశేషమైన కృషి చేస్తారు. మీరు శ్రమించిన స్థాయిలో మెరిట్ మార్కులను సంపాదించగలుగుతారు. సంవత్సర ద్వితీయార్థం సంతాన పురోగతి చాలా బాగుంటుంది. వడ్డీ వ్యాపారాలు, ఫైనాన్స్ వ్యాపారాలకు దూరంగా ఉండడం మంచిది. సంతానానికి సంబంధించిన విషయాలలో బంధువుల సహాయసహకారాలు తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. కుటుంబ ఖర్చులు, వ్యక్తిగతమైన ఖర్చులు ఎక్కువ అవుతాయి. అందుకు తగ్గట్టుగానే ఆదాయం కూడా పెరుగుతుంది. స్టేషనరీ ఖర్చులు, ఇంటి సామాను ఖర్చులు, సమాచార సంబంధమైన ఖర్చులు, టెలిఫోన్, ఎలక్ట్రిసిటీ బిల్లుల ఖర్చులు అధికమవుతాయి. ప్రతిష్ఠాత్మకమైన, రహస్యమైన సమావేశాలకు మీకు ఆహ్వానం అందుతుంది. ఇతరులకు సంబంధించిన స్థిరాస్థులు లిటిగేషన్ వ్యవహారాలు పరిష్కరించి కొంత ప్రయోజనం పొందగలుగుతారు. రాజకీయంగా మీ ద్వారా ప్రయోజనం పొందిన వ్యక్తులు మీ అవసరాలకు తగినవిధంగా సహాయం చేయరు. ఈ విషయమై ఒంటరిగా పోరాడి మీ ప్రయోజనాలను కాపాడుకుంటారు. స్వార్థప్రయోజనాల కోసం దిగజారే వ్యక్తుల ప్రవర్తన మీకు ఆశ్చర్యం కలిగిస్తుంది. వాళ్ళు మీ సహచరులు కావడం మీ మానసిక వేదనకు మరింత కారణం అవుతుంది. కలిసి ప్రయోజనాలు పంచుకుందామన్న కనీస ఇంత జ్ఞానం మీ సన్నిహిత వర్గంలో లోపిస్తుంది. అవగాహన లోపం బంధువర్గం, మిత్రవర్గం నష్టపోయి మిమ్మల్ని కూడా నష్టపరుస్తారు. జీవితాన్ని ఇప్పుడు చూస్తున్న కోణంలో కాకుండా మరో కోణంలో చూస్తారు. ప్రజలను ఒప్పించి మెప్పించి మీరు అనుకున్న కార్యక్రమాలలో వారిని భాగస్వాములను చేయగలుగుతారు. వ్యాపార ప్రదేశం గురించి కొంత వివాదం చెలరేగుతుంది. స్నేహితులతో బంధుత్వం కలుస్తుంది. కొంతకాలం విందులు, వినోదాలు, పిక్నిక్‌లు అధికం అవుతాయి. వైరివర్గంతో ముఖాముఖీ తలపడటానికి ఇష్టపడరు. వాళ్ళ బారినుంచి తప్పించుకోవడానికి మాత్రమే చూస్తారు. పూలతోటలు, పళ్ళతోటలు లాభిస్తాయి. వివాదాస్పద భూమి ఎటువంటి అధికారపత్రం లేకుండా మీకు స్వాధీనం అవుతుంది. రెండు మూడు చోట్ల వాయిదా పద్ధతిలో స్థిరాస్థులు కొనుగోలు చేస్తారు. నిత్యం అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. సిద్ధగంధం ధరించండి. దైవికంతో ధూపం వేయండి, అన్ని విధాలా మంచిది. చాలా కాలంగా మీ సహోదర, సహోదరీ వర్గానికి పంచాలనుకున్న ఆస్థిని పంపిణీ చేస్తారు. తేనెటీగలాగా ఎంతో కష్టించి ఓర్పుతో, నేర్పుతో ఒక స్థాయిని సంపాదించుకుంటారు. ఎందుకో, ఏమిటో తెలియనివిధంగా ఎదుటివారు విమర్శల వర్షం కురిపిస్తారు. కష్టపడి విద్యను అభ్యసించడం, మరింతగా కష్టపడి స్థాయిని, సంఘంలో ఒక స్థానాన్ని సమకూర్చుకోవడం కూడా ఒక నేరమా? అనే భావన మీ మనస్సుని కలచివేస్తుంది. కాకులవంటి లోకుల మాటలు ఈటలవలె బాధిస్తాయి. ఒక విధమైన నైరాశ్యభావన కలుగుతుంది. ప్రేమ, అనురాగం, ఆప్యాయతలు, నీతి, నిజాయితీలు, ప్రేమాస్పదమైన వాతావరణం సమాజంలో మచ్చుకైనా కానరానట్టుగా మనస్సు బాధపడుతుంది. మితిమీరిన మంచితనం వద్దు. కొన్ని దీర్ఘకాలిక వేధింపులనుండి విముక్తి పొందుతారు. పలుకుబడిని, ధనాన్ని ఉపయోగించి కొన్ని సమస్యలను రూపుమాపుకుంటారు. తృతీయంలో సంచరించు గురు రాహువుల ప్రభావం, షష్ఠమంలో సంచరించు శని ప్రభావం, భాగ్యంలో సంచరించే

కేతు ప్రభావం, రవిచంద్ర గ్రహణాలు, గురు శుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. మొత్తం మీద ఈ సంవత్సరం చాలా బాగుంది. ప్రజాజీవితంలో మీ స్థాయి మరింతగా పెరుగుతుంది.

**స్త్రీలకు ప్రత్యేకం**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు చాలా బాగుంది, విద్యారంగంలో, వైద్యరంగంలో బాగా రాణిస్తారు. పోటీ పరీక్షలలో విజయం సాధించి, మంచి ఉద్యోగాన్ని సాధిస్తారు. కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకుంటారు. తల్లిదండ్రులు పడుతున్న ఆర్థిక కష్టాలలో భాగం పంచుకుంటారు. సహోదర, సహోదరీ వర్గాన్ని మంచిదారిలో పెడతారు, స్వసుఖాన్ని త్యాగం చేస్తారు. మీ పేరుమీద చేసే వ్యాపారాలు బాగుంటాయి. బ్యూటీ పార్లర్లు, ఫ్యాన్సీ షాపులు బాగా సాగుతాయి. అవివాహితులైన వారికి వివాహం జరుగుతుంది. పునర్వివాహ ప్రయత్నాలు చేస్తున్నవారికి కాలం అనుకూలంగా వుంది. మీ సున్నిత మనస్తత్వం వల్ల ఇబ్బందులు పడతారు. విమర్శలను లెక్క చేయకుండా ఉంటే చాలా మంచిది. మహోన్నతమైన ఆశయాల సాధ్యదిశగా పయనిస్తారు. దూరప్రాంత విద్యావిషయాలు కలసివస్తాయి. నిత్యం సర్వదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణం కలిపి స్నానం చేయాలి. చదువుకు సంబంధించిన బ్యాంకు రుణాలు లభిస్తాయి. పెద్దలమీద గౌరవంతో కొన్ని నిర్ణయాలు వెనక్కు తీసుకుంటారు. బంధువులతో భేదాభిప్రాయాలు రాకుండా జాగ్రత్తపడతారు. ఆర్థిక వ్యవహారాలు ఒక దరికి వస్తాయి. చిట్టీలవల్ల, ఫైనాన్స్‌ల వల్ల నష్టపోతారు. పొదుపు పథకాలు అమలుపరుస్తారు. స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. గతంలో కొనుగోలు చేసిన స్థిరాస్థుల విలువ పెరుగుతుంది. మెరిట్ మార్కులు సాధిస్తారు. కొంతమంది విషయంలో ప్రేమ పెళ్ళి వ్యవహారాలు వివాదాస్పదం అవుతాయి. అసూయాగ్రస్తులైన తోటి స్త్రీలవల్ల ఇబ్బంది పడతారు. అత్యున్నత సాంకేతిక విద్యను (ఐ.ఐ.టి) అభ్యసిస్తారు. టీవి, సినిమారంగంలో ఉన్నవారికి కాలం అనుకూలంగా ఉంది. పోలీసు ఉద్యోగాలకు సెలెక్ట్ అవుతారు. తాత్కాలిక ఉద్యోగులకు, ఉద్యోగం పర్మినెంట్ అవుతుంది. సంతానాన్ని గాడిలో పెట్టగలుగుతారు. మధ్య మధ్యలో జీవితభాగస్వామితో విభేదాలు వచ్చే అవకాశం ఉంది. కొందరి విషయంలో జీవితభాగస్వామిలోని దురభ్యాసాలవల్ల ఆందోళనకు గురవుతారు. సొంత ఇంటి కల నిజమవుతుంది. విలువైన ఆభరణాలు కొనుగోలు చేస్తారు. సామాజిక సేవాకార్యక్రమాలలో మీరు చేస్తున్న సేవకు అవార్డులు వస్తాయి. కఠినమైన నిర్ణయాలు తీసుకుంటారు కానీ, అవి ఆచరణలో సాధ్యం కావు. ఉద్యోగపరంగా మార్పులు సంభవిస్తాయి. అవి మీ మంచికే దారితీస్తాయి. మీకు జరిగిన అన్యాయానికిగాను భయపడకుండా సమాజ పోకడను లక్ష్యం చేయకుండా న్యాయస్థానాలకు వెళతారు. కొంతకాలం పిల్లల జీవితమే ఆధారంగా సంసారాన్ని నెట్టుకొస్తారు. నిత్యం శ్రీ లక్ష్మీ గంధంతో మహాలక్ష్మీని పూజించండి. లక్ష్మీ తామర వత్తులతో దీపారాధన చేయండి. జీవితభాగస్వామికి తెలియకుండా మీరు సమాలోచన చేసే కార్యక్రమాలు వ్యతిరేక ఫలితాలను ఇస్తాయి. మీరుచేసే దానాలే మిమ్ములను రక్షిస్తాయని భావిస్తారు. వ్యాపారపరంగా నూతన ఆలోచనలు కలసివస్తాయి. మొత్తం మీద ఈ సంవత్సరం బాగుంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో కర్కాటకరాశి ఫలితములు

| ఆదాయం - 8 | వ్యయం - 11 | రాజ - 3 | అవ - 3 |
|---|---|---|---|

**పునర్వసు 4వ పాదము, పుష్యమి 1, 2, 3, 4 పాదములు, ఆశ్లేష 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "హీ, హూ, హే, హో, డా, డీ, డూ, డే, డో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కర్కాటకరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

కర్కాటక రాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. అయితే అందులో ఎక్కువగా మంచి ఫలితాలు ఉన్నాయి. ఆర్థిక, విద్యావిషయాలు సంతృప్తికరంగా ఉన్నాయి. ఆర్థికంగా గొప్పగా కాకపోయినా అవసరాలకు ఇబ్బందిలేని ఆర్థికస్థితి వుంటుంది. వృత్తి, ఉద్యోగాలపరంగా కొన్ని ఒడిదుడుకులను అధిగమిస్తారు. మీస్థాయిని, స్థానాన్ని నిలబెట్టుకుంటారు. మిమ్ములను కీలక సమయంలో ఆదుకుంటాడని భావించిన వ్యక్తి భీష్మునివలె అస్త్ర సన్యాసం చేస్తాడు. మీరు ఒంటరి పోరాటం చేసి విషయాలను చక్కబెడతారు.

మీ ఆధ్వర్యంలో నడిచే విద్యాసంస్థలు బాగుంటాయి. కొన్ని ఆరోపణలు వచ్చినా అవి అబద్ధం అని తేలిపోతుంది. విద్యాసంస్థలకు మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. మీ నేతృత్వంలో నడిచే సామాజిక సంస్థలకు, అనాధశరణాలయాల వంటి వాటికి, ఆధ్యాత్మిక సంస్థలకు విరాళాలు అందుతాయి. కుటుంబ సమస్యలు కొంత ఇబ్బందికరంగా మారుతాయి. గతించిన వ్యక్తి జ్ఞాపకాలు ప్రతిసందర్భంలోను గుర్తుకువస్తాయి. సౌఖ్యాలు అనుభవించవలసిన వారు శాశ్వతంగా దూరమై ఆ సౌఖ్యాలు మీరు అనుభవించవలసిన స్థితిలో మనస్సు, గుండె మొద్దుబారినట్లు నిస్సహాయస్థితి ఆవరిస్తుంది. కాలం అనే మహాసముద్రాన్ని ఈదగలిగిన శక్తి మానవునికి లేదని గ్రహిస్తారు. సరిపెట్టుకోవడం, మరిచిపోవడం తప్పనిసరి అని తెలుస్తుంది. పరిష్కారంలేని సమస్యల గురించి ఆలోచించడం అనవసరం. యాంత్రికంగా మీ పనులలో నిమగ్నమవుతారు. చంద్రసమిధలతో చెవులను కాల్చినట్టి కొన్ని నిజాలను భరించి తీరవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. బంధువులలో, స్నేహితులలో వైషమ్యాలు పెచ్చరిల్లకుండా, విధ్వంసానికి దారితీయకుండా ముందు జాగ్రత్తలు తీసుకుంటారు. ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్. గ్రూపు సర్వీసులకు ఎంపిక అవుతారు. విద్యారంగంలో ఘనవిజయం సాధిస్తారు. పోటీపరీక్షలలో మీ శక్తి సామర్థ్యాలను ప్రదర్శిస్తారు. అనుకూలమైనటువంటి ఫలితాలను సాధిస్తారు. ఆహారధాన్యాల వ్యాపారాలు, హోటల్ వ్యాపారులు, నీళ్ళ వ్యాపారులు, విద్యాసంస్థల యజమానులు, డాక్టర్లు, గొప్ప ఫలితాలను సాధిస్తారు. ఆర్థికంగా ఆశించిన దానికన్నా ఎక్కువగా సంపాదిస్తారు. నికృష్టమైన వ్యాపారాలు చేసేవారికి

అనుకూలమైన కాలం. పునర్వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రచారంలో ఉన్న నిందలను సమర్థవంతంగా తిప్పి కొడతారు. మీడియా తోడ్పాటు లభిస్తుంది. దిక్కుతోచని స్థితిలో ఉన్న బంధువులను ఆదుకుంటారు. రౌడీలు, అసాంఘిక శక్తులను మీ పేరు బయట పెట్టకుండా చట్టానికి పట్టిస్తారు. మీ కార్యక్రమాలు సంస్థల పరివేక్షణకు సమర్థులైనవారిని నియమిస్తారు. ఆంతరంగికుల సలహాలు పాటించి ప్రయోజనం పొందుతారు. అనుమానాలు నివృత్తి చేసుకుని పాత మిత్రులను తిరిగి దరి చేర్చుకుంటారు. మితిమీరిన ఆత్మవిశ్వాసం నష్టానికి దారితీస్తుందని గ్రహిస్తారు. దీర్ఘకాలిక ఋణాలు తీర్చివేస్తారు. ఇందులో కూడా కొంత రాయితీ లభిస్తుంది. భాగస్వామ్య వ్యాపారాలు విస్తరిస్తాయి. ఆర్థిక మాంద్యాన్ని మీరు అధిగమిస్తారు. అసమర్థులైన రాజకీయ అధికార దురంధరుల వల్ల ఎలాంటి ఉపయోగం లేకపోవడం మీ నిరాశకు, కోపానికి కారణం అవుతుంది. దీర్ఘకాలిక శత్రువర్గాన్ని దెబ్బతీస్తారు. విధిలేని పరిస్థితిలో మీ ఉనికికి ముప్పు వస్తుందని భావించి శత్రువర్గ విషయంలో కఠినంగా వ్యవహరిస్తారు. యాదృచ్ఛికంగా జరిగే సంఘటనలు మీకు లాభిస్తాయి. ద్వితీయార్థంలో సంచరించే గురు రాహువుల ప్రభావం, పంచమంలో సంచరించే శని ప్రభావం, అష్టమంలో సంచరించే కేతుగ్రహ సంచారం, సూర్యచంద్రుల గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. సెల్ఫ్ డ్రైవింగ్ విషయంలో చాలా జాగ్రత్తగా ఉండండి. విదేశాలలో విద్యను అభ్యసించాలనే మీ కోరిక కొంతకాలం వాయిదా పడుతుంది. బంధువుల సహాయ సహకారాలు లభిస్తాయి. సంబంధం కలుపుకోవాలనే మీ బంధువుల కోరికను మీరు వ్యతిరేకిస్తారు. వృత్తి, ఉద్యోగపరంగా కొంత వివక్షతకు గురి అవుతారు. మానసిక, సంతోషం, ప్రొఫెషనల్ సాటిస్ఫాక్షన్ కరువవుతుంది. సామర్థ్యంలేని వారు గంటగంటకూ ఎదుగుతారు. ఇది కలియుగ మహత్యం. దౌర్భాగ్యమే సామర్థ్యం. కులమత వర్గాలే అర్హతలు అవుతాయి. ఇలాంటి వాతావరణాన్ని సహించలేక దూరంగా తప్పుకోవాలని భావిస్తారు. కుటుంబంలో మీ ప్రమేయం లేకుండానే తగాదాలు, శపథాలు, ఆదిత్యపోరు అధికం అవుతాయి. ఎవ్వరికీ ఏమీ చెప్పలేని పరిస్థితి, చెప్పినా వినిపించుకునేవారు లేని పరిస్థితి ఏర్పడుతుంది. కొంతమంది స్త్రీల వల్ల ఇబ్బందులు రావచ్చు. మీ జీవితంలో ప్రవేశించే ప్రయత్నం చేస్తారు. ఇటువంటి ఆపదలను అధిగమించడానికి అన్యమనస్కంగానే వివాహానికి అంగీకరిస్తారు. వ్యక్తిత్వం కాపాడుకోవడానికి. సిద్ధాంతాలను పరిరక్షించుకోవడానికి కొన్ని ముఖ్యమైన ప్రయోజనాలను వదులుకుంటారు. సహోదర, సహోదరీలు చేసిన అప్పులను తీరుస్తారు. పెడమార్గం పడుతున్న హితులను, సోదరులను మంచి దారికి తెస్తారు. వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడే విధంగా సాయపడతారు. తెల్లవారు ఝూమున వచ్చే ఆలోచనలు ఫలిస్తాయి. నిత్యం అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి, సిద్ధగంధాన్ని ధరించండి. సంగీత, సాహిత్యరంగాలలో పురోగతి సాధించాలని నిర్ణయించు కుంటారు. ఈ దిశగా విశేషమైన కృషిచేస్తారు. గృహంలో ప్రశాంత వాతావరణానికిగాను ఎంతో శ్రమిస్తారు. సంతాన పురోగతి అన్నివిధాలా బాగుంటుంది. ఫిక్స్‌డ్ డిపాజిట్స్ వల్ల వచ్చే ఆదాయం ఎంతో ఉపకరిస్తుంది. చౌకగా కొన్న స్థిరాస్తుల విలువ పెరుగుతుంది. ఇదే బంధువుల అసూయకు కారణమవుతుంది. ప్రభుత్వపరంగా రావాల్సిన లీజు, ఆక్షన్స్, రెన్యువల్స్

అనుకూలంగా ఉంటాయి. మీరు నమ్మిన సిద్ధాంతాలకు అనుగుణంగా నడుచుకుంటారు. ప్రయోజనాల కోసం అడ్డదారులు తొక్కరు. సహోదర, సహోదరీ వర్గానికి ఆర్థికసహాయం చేసి జీవిత భాగస్వామికి విరోధం అవుతారు. మీ వ్యక్తిగత అభిప్రాయాలను నెగ్గించుకోవడానికి అధిక ప్రాముఖ్యతను ఇస్తారు. పెద్దవాళ్ళ సలహాలు కాని, సూచనలుగాని మీకు రుచించవు, వినరు. మీ అంతరంగికులు చెప్పిన మాటలు మీకు తోచిన ఆలోచనలు అమలు చేస్తారు. దాదాపు మీవి ఏకపక్ష నిర్ణయాలు అవుతాయి. తప్పులు చేసి వారిని కాపాడే ప్రయత్నంలో మీరు కూడా కొన్ని ఇబ్బందులకు గురి అవుతారు. ఆరోగ్య విషయంలో కొన్ని ఒడిదుడుకులు ఉంటాయి. అలంకార సంబంధమైన వ్యాపారాలు బాగుంటాయి. ఈ రాశికి సంబంధించిన కొద్దిమంది విషయంలో వైవాహిక స్పర్థలు అధికమవుతాయి, విడాకులు వంటివి సంభవించవచ్చు, విడాకుల అనంతరం సంతానం విషయంలో మనోవేదన ఏర్పడుతుంది. అధికారుల మనస్సు నొచ్చుకోకుండా పనులు చక్కదిద్దుకోగలుగుతారు. ధర్మానికి మీరు కట్టుబడి ఉంటారు. ఇతరులు కూడా అలాగే ఉండాలని భావిస్తారు. సంవత్సర ద్వితీయార్థంలో భూమి సంబంధమైన విషయ వ్యవహారాలకు మధ్యవర్తిగా వుండి వాటిని సానుకూలపరచి ఆర్థిక ప్రయోజనం పొందుతారు. అధికారులను మెప్పించి కోరుకున్న చోటుకి బదిలీ చేయించుకుంటారు. పెండింగ్‌లో ఉన్న పనులు సానుకూలపడతాయి. ఇది ఎంతో ఉపశమనం కలిగిస్తుంది. ఆర్థిక ప్రయోజనాలు సున్నితమైన అంశాలతో, వివాదాస్పదమైన వ్యక్తులతో ముడిపడి ఉంటాయి. ఓర్పు, నేర్పులతో కార్య విజయం లభిస్తుంది. మీ సహనానికి పరీక్షలు ఎదురవుతాయి. ధర్మబద్ధంగా మీకు రావాల్సిన ధనం కొద్ది కొద్దిగా మీ చేతికి అందుతుంది. అయినా ఓర్పు వహిస్తారు. శారీరకంగా, మానసికంగా తగిన విశ్రాంతి లభించదు. ఇతరుల మీద అతిగా ఆధారపడుతున్నామన్న భావన ఏర్పడుతుంది. వెన్నుపోటు దారులకు అవకాశం కల్పించవద్దు. జాగ్రత్త వహించండి. నిర్మాణ సంబంధమైన పనులు నిదానంగా సాగుతాయి. అర్థంలేని ఆలోచనలు కొన్ని అనర్థాలు తెచ్చిపెడతాయి. సమాజంలో పలుకుబడి కలిగిన కీలకమైన వ్యక్తులను మీ వైపు మలచుకోవడంలో విజయం సాధిస్తారు. మీ పేరు ప్రఖ్యాతలకు ఎటువంటి మచ్చ రాకుండా అత్యంత జాగ్రత్త వహిస్తారు. వ్యూహ ప్రతివ్యూహాలను రచించడంలో ఎంతో జాగ్రత్తలు తీసుకుంటారు. మీ వైరివర్గాన్ని బోల్తా కొట్టించడానికి మీరు పన్నిన వ్యూహం ఫలిస్తుంది. కొన్ని సందర్భాల్లో స్త్రీల సహాయ సహకారాలు, వృద్ధుల, పెద్దల ఆశీస్సులు మీకు లభిస్తాయి. దూరప్రాంతాలకు వెళ్ళి చదువుకోవాలనుకునే మీ ఆలోచనలు సంవత్సర ద్వితీయార్థంలో ఫలిస్తాయి. కీలకమైన బాధ్యతలను సక్రమంగా నెరవేర్చగలుగుతారు. మీ వర్గానికి సంపూర్ణ న్యాయం చేయగలుగుతారు. ఇతరులకు కొద్దిగానే సహాయం చేస్తారు. పక్షపాత వైఖరితో వ్యవహరించారని మీపై విమర్శలు వస్తాయి. మీ నిర్ణయాలను వ్యతిరేకిస్తూ కొందరు న్యాయస్థానాలను ఆశ్రయించే అవకాశం ఉంది. సంతాన పురోగతిపై శ్రద్ధ వహిస్తారు. వాళ్ళకు సంబంధించిన అన్ని అంశాలను దగ్గర ఉండి చూసుకుంటారు. ఇతరుల దుష్ప్రభావం, మాటల ప్రభావం సంతానం మీద ఉన్నదని గ్రహిస్తారు. సంతానాన్ని సరయిన దారిలోకి తీసుకురావడానికి శ్రమించి అనుకున్న ఫలితాలు సాదిస్తారు. రాజకీయ రంగంలో మీ అంచనాలు

ఫలిస్తాయి. పదవీప్రాప్తి సంభవం. మీ సన్నిహిత వర్గం, స్నేహితులు ఆరంభ సూరత్వంతో కొన్ని వ్యాపారాలు ప్రారంభిస్తారు. అవి పురిటిలోనే సంధి కొడతాయి. వాళ్ళను ఆదుకోవాల్సిన బాధ్యత మీ మీద పడుతుంది. సనాతన విద్యలపట్ల ఆసక్తి చూపుతారు. చిన్నపాటి ప్రయోజనాలను కూడా వదులుకోరు. శుభకార్యాలకు సంబంధించిన ప్రసంగాలు, రాజీలు, రాయబారాలు ఫలిస్తాయి. బరువు బాధ్యతలను తీసుకుంటారు. మధ్యవర్తులు మీ మనుషులుగా మారుతారు. ముఖ్యమైన కోర్టు తీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. మిత్రులనుండి వచ్చే చిన్న పాటి సమస్యలు, సమాజంలో మీ ప్రతిష్టకు ఇబ్బందిగా మారుతాయి. మీ సామాజికవర్గం వారే మిమ్మల్ని దూరంగా ఉంచడం కొంత ఇబ్బంది కలిగించే పరిణామంగా మారుతుంది. మీ ప్రత్యర్థుల రాజకీయ పలుకుబడి మీ విషయంలో పనిచేయదు. అయితే కృత్రిమంగా, ప్రభుత్వపరంగా స్వల్ప ఇబ్బందులు రావచ్చు, వాటిని మీరు తేలికగా అధిగమించ గలుగుతారు. సొంత విషయాలకు, స్వజనులకు సంబంధించి అధికంగా ఖర్చుపెడతారని మీ మీద వచ్చిన ఆరోపణలకు కాలమే సమాధానం చెబుతుంది. పంతాలు, పట్టింపులకు పోకుండా చర్చలతో సమస్యను పరిష్కరించడానికి ప్రాధాన్యతనిస్తారు. మీపై పడిన నిందల బరువును దింపుకుంటారు. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నుల గురించి న్యాయస్థానాన్ని ఆశ్రయించే పరిస్థితి ఏర్పడుతుంది. కోర్టు తీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. మీవాళ్ళు ఇబ్బందిపడడం, సమస్యలలో ఇరుక్కుపోవడం, విడాకులు, భార్యాభర్తలు విడిపోవడం వంటి సమస్యలు మీ మానసిక వేదనకు కారణమవుతాయి. రాబోయే రోజులు చాలా గడ్డు రోజులని వాటిని ఎదుర్కోవడం మీవల్ల కాదని నిరుత్సాహపరిచే శల్య సారథ్యం చేసే వ్యక్తులను దూరంగా ఉంచండి. మీ స్వయంకృతాపరాధాలు, తప్పుడు నిర్ణయాలు పెద్దగా నష్టం కలిగించవు, ప్రభావం చూపవు. మీరు అభిమానించి ఒక స్థాయికి తీసుకునివచ్చిన మనుషులు మీ పట్ల సక్రమంగా ప్రవర్తించరు, కృతజ్ఞతలు చూపించరు, పైగా మీ వైరివర్గానికి సహాయం చేస్తారు. అదృష్టవశాత్తు, ఒకనాటి మీ శత్రువులు మీకు మిత్రులు కావడంవల్ల మీకు మనశ్శాంతి, ఊరట కలిగిస్తుంది. నమ్మకద్రోహాన్ని మీరు భరించలేరు, ఈ సంఘటనలు పదేపదే గుర్తుకువచ్చి మనస్సును బాధిస్తాయి. కొన్ని సమస్యలను ధైర్యంగా, ఒంటరిగా ఎదుర్కోవాలని నిర్ణయించుకుంటారు. భగవదానుగ్రహం వల్ల సమస్యలను దాటుకుని అనుకూలమైన ఫలితాలను సాధిస్తారు. సంతానానికి సంబంధించిన పురోగతి చాలా బాగుంటుంది. కొంత మనశ్శాంతి లభిస్తుంది. మీ కష్టానికి తగిన ఫలితం లభించినందుకు సంతోషం కలుగుతుంది. గ్రీన్ కార్డు లభించే ప్రయత్నాలు దాదాపు చివరిదశకు చేరుకుంటాయి. సంవత్సర ద్వితీయార్థంలో ఉద్యోగంలో ఒడిదుడుకులు ఏర్పడతాయి. స్టేషనరీ వ్యాపారస్థులకు అలంకార సామాగ్రి విక్రేతలకు, నిర్మాణ సంబంధ సామాగ్రి విక్రేతలకు అనుకూల వాతావరణం సూచిస్తున్నాయి. విద్యాసంబంధమైన సంస్థలు నడిపేవారికి కూడా అనుకూలంగా ఉంది. వైద్యులకు ఖ్యాతి, రెండుచేతులా సంపాదన సూచిస్తున్నాయి. వంశపారంపర్యంగా వస్తున్న కొన్ని ఆచారవ్యవహారాలను సక్రమంగా నిర్వహించలేక మాట పడతారు. కాఫీ, టీ, చిరుతిండ్ల మీద అభిరుచి పెరుగుతుంది. క్రీడా సంఘాలలో మీకు ప్రముఖమైన పాత్ర లభిస్తుంది. అధికారంలో ఉన్న మీకు పలుకుబడిని

ఉపయోగించి కొంత మంది వ్యక్తులకు మరచిపోలేని సహాయం చేస్తారు. సుదీర్ఘమైన కాలగమనంలో ఎన్నో మజిలీలు మనస్సుకు నచ్చిన, నచ్చని సంఘటనలు, ఎంతచేసినా నచ్చని పనులు అడుగడుగునా అభద్రతా భావన, ఎవరికి సహాయంచేసినా వ్యతిరేక ఫలితాలే, ఎటూ, తోచనటువంటి స్థితి. అపనమ్మకంతోనే ఎదుటివారిని నమ్మి కాలం గడపవలసిన స్థితి మానసిక అశాంతికి కారణమవుతుంది. అన్నింటికీ అతీతంగా మీ మనస్సును రాయి చేసుకుంటారు. అవసరమైన సమయంలో సహోదర, సహోదరీ వర్గం అండదండగా నిలుస్తారు. అన్నదమ్ముల ఐకమత్యం వల్ల భార్యవైపు బంధువులతో విరోధాలు వస్తాయి. శాడిస్టిక్ నేచర్ గల స్త్రీలవల్ల కొంతకాలం ఇబ్బందిపడతారు. ఆధ్యాత్మిక ప్రసంగాలు, ఆధ్యాత్మిక గ్రంథాలు మిమ్మల్ని ఆకర్షిస్తాయి. పుణ్యనదీ జలాలలో స్నానమాచరించి మనశ్శాంతిని పొందుతారు. దైవధ్యానము, మంత్రానుష్టానం వల్ల మానసిక ప్రశాంతత కలుగుతుంది. దీర్ఘకాలిక అనారోగ్య బాధలు దాదాపుగా సమసిపోతాయి. మీ భాగస్వాముల నిర్ణయాల వల్ల ఎంతో లాభం పొందవలసిన వ్యవహారంలో కొద్దిపాటి ప్రయోజనాలు మాత్రమే దక్కుతాయి. భాగస్వాముల అత్యుత్సాహం వల్ల కొన్ని నష్టాలు సంభవిస్తాయి. రావాల్సిన లాభాలు రాకపోవడం, అధికారులతో వివాదాలు ఏర్పడతాయి. మీరు ఊహాలోకాలకు తెరదించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వాస్తవ విషయాల ఆధారంగా నిర్ణయాలు తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కళా, సాహిత్య రంగాలలో మీరు చేసిన కృషికిగాను ప్రశంసాపత్రాలు అధికార పత్రాలు వంటివి చేతికి అందుతాయి. కీలక సమయంలో మీకు అండగా నిలిచే అధికారి స్థానచలనం పొందడం వలన తాత్కాలికంగా కొన్ని ఇబ్బందులు ఎదుర్కొంటారు. దొంగస్వామీజీల వల్ల నష్టపోతారు. విదేశాలనుండి వచ్చిన ధనంతో ఉమ్మడిగా స్థిరమైనటువంటి ఆస్థులు కొనుగోలుచేస్తారు. ఇందువల్ల బంధువులలో బేధాభిప్రాయాలు వస్తాయి, అసూయా ద్వేషాలు నెలకొంటాయి. ఎవ్వరు చెప్పినా వినని వారు మీ మాట వింటారు. స్వేచ్చా స్వాతంత్ర్యాలు హరించుకుపోతున్నాయన్న భావన మీకు కలుగుతుంది. మీ వ్యాపారానికి సంబంధించిన వ్యవహారాలు, వ్యక్తిగత విషయాలు ఇతరులకు తెలియడం వల్ల వివాదాలు, విమర్శలు పోటీ మొదలైనవి చోటు చేసుకుంటాయి. కుటుంబ విషయాలను నిర్లక్ష్యం చేసినందుకు తగిన మూల్యం చెల్లించవలసిన పరిస్థితి వస్తుంది, పద్ధతులు మార్చుకుంటారు. వృత్తి, ఉద్యోగాలకు సంభందించిన ఒక ముఖ్య విషయం కలిసివస్తుంది, ఆ విషయాన్ని రహస్యంగా ఉంచుతారు. మానసిక ఉల్లాసానికి ప్రాముఖ్యతనిస్తారు, మానసిక వత్తిడి తగ్గించుకునే ప్రయత్నం చేస్తారు. ఆయుర్వేదం చిట్కాలు, ప్రకృతి వైద్య సంబంధించిన విషయాలు అవగాహన చేసుకుంటారు, ఆచరిస్తారు. గతించిన వ్యక్తుల జ్ఞాపకాలు బాధిస్తాయి, వాళ్ళ ఆత్మశాంతికి ఆచరించవలసిన మంచిపనులు కొన్ని చేస్తారు. నూతన గృహం, నూతన వాహనం ఏర్పడుతుంది. ఎంత చేసినా తగిన గుర్తింపు పొందలేదనే భావన కొన్ని సందర్భాలలో కలుగుతుంది. గతంలో వివాదాస్పదమైన డాక్యుమెంట్స్ తిరిగి తెరమీదికి రావడం వలన మీకు లాభం చేకూరుతుంది. సరి అయిన సమయంలో మీ ప్రయోజనాలు మీకు దక్కకపోయినా, కొంత ఆలస్యంగానయినా మీకు మరింత ప్రయోజనాలు చేకూరుస్తాయి. మాటలు నిలకడలేని మనుష్యుల వల్ల కొన్ని ఇబ్బందులు, చేదు అనుభవాలు ఎదురవుతాయి. కార్యాలయంలో మీ

పట్ల వ్యతిరేక భావన లేకపోయినా అభిమానాలు, అప్యాయతలు తగ్గినట్లుగా తోస్తుంది. ఇది కొంతకాలం ప్రభావం చూపుతుంది. ఎవరో చేసిన తప్పిదానికి మీరు కొంతమందికి విరోధి అవుతారు. వృత్తి, వ్యాపారాల పరంగా కొద్దికాలం పోరాటం తప్పదు. మీతో జాగ్రత్తగా మసలుకోవడం ఎందుకైనా మంచిదని చాలామంది గ్రహిస్తారు. సన్నిహిత, సహచర వర్గం చేసే కార్యక్రమాలను మీరు దగ్గర ఉండి పర్యవేక్షిస్తారు. ఎలాంటి తప్పులు దొర్లకుండా గత అనుభవాలను దృష్టిలో ఉంచుకుని జాగ్రత్తగా మెలుగుతారు. సంవత్సర ద్వితీయార్థంలో నష్టం వస్తుందనుకున్న వ్యాపారంలో నష్టం రాదు, దైవం అండగా ఉన్నా డన్న భావన బలపడుతుంది. దొంగస్వామీజీలను నమ్మి మోసపోతారు. వివాహాది శుభకార్యాల విషయంలో మీ అభిప్రాయాలను వాయిదా వేయడానికి వీలులేని పరిస్థితి ఏర్పడుతుంది. ఎదుటివారు మెచ్చుకున్నా, నొచ్చుకున్నా మీ అభిప్రాయాలను నిర్మొహమాటంగా తెలియజేయండి. మీ వల్ల ఇతరులు చెడిపోయారన్న మాట రాకుండా జాగ్రత్త వహించండి. సన్నిహిత సహచర వర్గం బలం పుంజుకుని కొంత నిలబడగలుగుతారు. ఈ రాశి విద్యార్థినీ విద్యార్థులు సరస్వతీ తిలకాన్ని ధరించడం, జ్ఞానచూర్ణాన్ని సేవించడం చెప్పదగిన సూచ. వీసా, పాస్‌పోర్టు లభిస్తాయి. మీ అంతరాత్మకు విరుద్ధంగా ఒకరికి సన్నిహితం అవుతారు. నూతన విద్యను అభ్యసించాలని ఉత్సాహపడే వారికీ విదేశాలలో చదువుకుని ఉద్యోగం చేసి అప్పులు తీర్చి కుటుంబ స్థాయిని పెంచాలని ఆరాటపడే వారికి ఇది అనుకూల కాలం. ఎప్పుడో కొనుగోలు చేసిన స్థిరాస్థికి విలువ పెరుగుతుంది. జీవితంలో నూతన వ్యక్తులు ప్రవేశిస్తారు. నిష్క్రమిస్తారు. మీరు మాత్రం రాగభావ ద్వేషాలకు అతీతంగా ప్రవర్తిస్తారు. విద్యార్థులు విద్యార్థినులు విశేషంగా శ్రమించి అనుకూల ఫలితాలు సాధిస్తారు. కొన్ని సందర్భాలలో అనుకూల ఫలితాలు ఆలస్యమయినా ఉత్తమ ఫలితాలకు ఢోకాలేదు. మీ మిత్రులు రాజకీయ అధికార ప్రయత్నాలకు మీరు ఎంతగానో సహాయపడతారు. ప్రేమవివాహాలు ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని ప్రభావం చూపిస్తాయి. కష్టపడి దాచిన సొమ్ముతో ఒక స్థలాన్ని గాని, కమర్షియల్ కాంప్లెక్స్‌లో ఒక షాపునుగాని కొనుగోలు చేస్తారు. బంధువులతో సంబంధం కలుపుకోవడానికి అవకాశం వస్తుంది. మీరు ఆలోచనలో పడతారు. మీ సన్నిహిత బంధువర్గం ఉద్దేశ్యపూర్వకంగా కీలకమైన డాక్యుమెంట్స్‌లో మీ పేరు లేకుండా చేస్తారు. వాళ్ళు చేసిన ద్రోహం మీ మీద ప్రభావం చూపించదు. సన్నిహితంగా ఉండే వ్యక్తులతో కొంతకాలం దూరం ఏర్పడుతుంది. నూతన వృత్తి, ఉద్యోగాలలో ఆ కుర్చీలో కూర్చుని అవకతవకపనులు చేసినవారి తప్పులను సవరించవలసి వస్తోంది. వేళకు తిండి, నిద్ర కూడా కరువవుతుంది. మహిమాన్వితమైన వస్తువులని కొనాలని కొంతమంది మోసగాళ్ళు మీకు కలుస్తారు. వాళ్ళను చట్టానికి అప్పగించి దేహశుద్ధి చేయిస్తారు. మిమ్ములను మోసం చేసే ప్రయత్నాలు ఎంత చిన్నవయినా సహించరు. స్త్రీ సంతానం పట్ల మీ ప్రేమ వెల్లడవుతుంది. వారికోసం రకరకాల సౌకర్యాలు ఏర్పరుస్తారు. కంటికిరెప్పలా చూసుకుంటారు. అతి గారాబం చేస్తారు. రియల్ ఎస్టేట్ వ్యాపారంలో తిరిగి పుంజుకుంటారు, మారుతున్న సామాజిక పరిస్థితులు మీపై ప్రత్యక్షంగా ప్రభావం చూపిస్తాయి. మీకు రావాల్సిన ధనాన్ని వేరొకరు అడ్డదారులలో ఫోర్జరీ చేసి ప్రభుత్వపరంగా తస్కరిస్తారు. పేరు మీది సొమ్ము మరొకరిది. ఈ విషయమై

న్యాయ నిపుణులతో సంప్రదించి చట్టపరమైన చర్యలు తీసుకుంటారు. మీ స్వంత మనుషులని పొరపాటుగా భావించి కొంతమంది అమాయకులు మీకు అందజేయమని ధనాన్ని అందజేస్తారు. ఇటు డబ్బులు రాకపోగా కళంకరహితమైన మీ వ్యక్తిత్వానికి బురద జల్లు పడుతుంది. ఈ విషయాన్ని స్వయంగా పరిష్కరించాలని నిర్ణయించుకుంటారు. చట్టాలకు, న్యాయాలకు అతీతంగా మోసం చేసిన వారిని అందుకు సహకరించిన వారిని దేహశుద్ధి చేసి వాస్తవాలను సమాజానికి వెల్లడయ్యేలా చేస్తారు. కార్యాలయంలోను, వ్యాపార ప్రదేశంలోను జరిగే పొరపాట్లను సరిదిద్దుకుంటారు. కళంకితులను, దుర్మార్గులను, అవినీతిపరులను నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొడతారు. మీరు పాదం మోపిన ప్రతిచోటా అన్నీ లక్ష్యాల దిశగా నడుస్తాయి. నీతి, నిజాయితీ, శ్రమ, అంకితభావం వాటికి మాత్రమే మీ దగ్గర చోటు ఉంటుంది. సమాజంలో మీరంటే గౌరవ ప్రతిష్టలతో పాటు భయంకూడా ఏర్పడుతుంది. డబ్బు నీళ్ళలాగా ఖర్చు అవుతుంది. పొదుపు పథకాల ఆలోచనలు ఏనాడో అటకెక్కుతాయి. కొన్ని ప్రయోజనాలు ప్రాతిపదికగా మీరు ఇష్టలేని వ్యక్తులతోటి, అవినీతి పనులతోటి డబ్బులు సంపాదించే మార్గానికి కొంతమంది మధ్యవర్తులు రాజీ ప్రయత్నాలు, రాయబార ప్రయత్నాలు చేస్తారు. నిస్వార్థంగా ఈ ప్రతిపాదనలను మీరు తిరస్కరిస్తారు. అవినీతి పరులతో కూర్చుని పంచ భక్షపరమాన్నాలు తినేకన్నా నీతిగా గంజితాగి బ్రతకడమే నయమని భావిస్తారు. నిన్ను ఎవరూ మార్చలేరు, నీ ఖర్మ ఇంతే అని స్నేహితులు నిందిస్తారు. మధ్యవర్తిత్వానికి, మధ్యవర్తి సంతకాలకు దూరంగా ఉండండి. తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతి అన్న సామెతను గుర్తుకు తెచ్చుకోండి. సరి అయిన కారణం లేకుండా రోజుకు ఒకరు విరోధిగా మారతారు. ఇది మీకు అంతుపట్టని విషయంగా పరిణమిస్తుంది. మీ ఆర్థిక మూలాలను పెకలించి మిమ్మల్ని ఆర్థికంగా దెబ్బకొట్టాలని ఒక వర్గం గట్టిగా ప్రయత్నిస్తుంది. వాళ్ళ ప్రయత్నాలు విఫలం అవుతాయి. మీ దగ్గర ఉండే జ్ఞానం, విజ్ఞానం తెలుస్తుంది. మంచి చెడు తెలుస్తుంది, మరొకరి దగ్గరికి వెళితే ధనం లభిస్తుంది. మంచిచెడుకన్నా ధనమే ముఖ్యమని అందరూ దూరం అవుతారు. ఈ రెండిటికి ఉన్న భేదం ఏమిటో మీకు బాగా అర్థం అవుతుంది. కళా, సాంస్కృతిక రంగాలలో రాణిస్తారు. పోటీ పరీక్షలలో సంబంధించిన విషయాలలో ఆత్మవిశ్వాసం సన్నగిల్లుతుంది. అయితే దాని ప్రభావం పరీక్షలు రాసే దానిమీద ఉండదు. ప్రతి విషయాన్ని వ్యతిరేక కోణంలో చూసి ఆలోచించి మంచి చెడులు బేరీజు వేసుకుని నిర్ణయాలు తీసుకుంటారు. మీ నిర్ణయాలలో ఇతరుల ప్రమేయాన్ని అంగీకరించరు. బాల్య స్నేహితులు, చిరకాల పరిచితులతో కలిసి తాత్కాలిక వ్యవధిగల వ్యాపారాలు చేస్తారు. అందులో లాభాలు పొందుతారు. పనిచేయనివాళ్ళకు, సోమరిపోతులకు గతంలో ఇచ్చిన విధంగా వాటా ఇవ్వరు. కాంట్రాక్టులకన్నా, సబ్ కాంట్రాక్టులు ఎక్కువ లాభాలను ఇస్తాయి. ప్రభుత్వపరమైన బిల్లులు పెండింగ్‌లో ఉంటాయి. అవి చాలా కష్టం మీద మంజూరు అవుతాయి. ప్రభుత్వ సంబంధ పనులకన్నా, ప్రైవేట్ సంబంధమైన పనులకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తారు. భవిష్యత్తులో ఉపకరించే విధంగా స్త్రీ సంతానం పేరు మీద ప్రతి నెల కొంత మొత్తాన్ని పొదుపు చేస్తారు. షాపింగ్ కాంప్లెక్స్‌కు సంబంధించిన వ్యవహారాలలో ఇబ్బంది పడతారు, కొంతమంది అద్దె ఇవ్వరు, ఖాళీ చేయరు, వివిధ రకాల

మార్గాలను ఉపయోగించి ఎట్టకేలకు ఖాళీ చేయిస్తారు. మీరు ఉంటున్న ఇల్లు వాస్తు బాగాలేదని మనసులో ఆలోచన తొలుస్తుంది, కానీ అది వాస్తవం కాదు. సంవత్సర ప్రథమార్థంకన్నా, ద్వితీయార్థం బాగుంటుంది. అభివృద్ధి కార్యక్రమాలు వేగంగా జరుగుతాయి. రెండు మూడు రకాల వ్యాపారాలు కలిసివస్తాయి. ఒక పండితునికి ఇచ్చిన మాట నిలబెట్టుకోలేరు. కారు చవకగా కొన్న భూములను అత్యంత విలువైన ధరలకు అమ్మి ఆ డబ్బుతో వేరు వేరు ప్రాంతాలలో స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. శారీరక శ్రమ చేసే వృత్తులలో ఉన్నవారికి చేతినిండా పని, డబ్బుకు లోటు ఉండదు. ప్రభుత్వ సంబంధమైన పథకాలు కీలక సమయంలో ఆదుకుంటాయి. సుగంధద్రవ్యాల వ్యాపారం, మూలికల వ్యాపారం, ఔషధ, మొక్కల వ్యాపారం, సౌందర్య సామాగ్రి, రసాయనాల వ్యాపారం, అల్లోపతి మందులు, వైద్యపరికరాలు అమ్మే వ్యాపారస్థులకు కాలం చాలా అనుకూలంగా ఉంది, పేరు ధనం బాగా సంపాదిస్తారు. అల్యూమినియం, స్టీలు, ఇత్తడి, రాగి, వైట్ మెటల్, వెండి, బంగారం మొదలైన వ్యాపారాలు బాగుంటాయి. చట్టపరమైన అంక్షలు కూడా ఈ వ్యాపారాల మీద ఉండే అవకాశం ఉంది. పై రెండు కోవలకు చెందిన వ్యాపారస్థులు లాభాలు గడించినప్పటికీ ప్రజలలో విశ్వసనీయత కోల్పోతారు. తాళ్ళ పరిశ్రమ, పేపరు మిల్లు, హోమియోపతి, ఆయుర్వేద మందులకు, చెప్పుల వ్యాపారస్థులకు, రెడీమేడ్ వ్యాపారస్థులకు, టైలర్లకు కాలం అనుకూలంగా ఉంది. మంచి గుర్తింపు, ధనం చేతికి అందుతాయి. ఆధ్యాత్మిక కార్యక్రమాలకు మరియు దేవాలయాలకు విరాళాలు ఇస్తారు. మీ వ్యక్తిగత ప్రాముఖ్యత అన్ని చోట్లా పెరుగుతుంది. జీవిత భాగస్వామికి ఆభరణాలు చేయిస్తారు. ఎన్ని వ్యవహారాలు కలిసివచ్చినా రాకపోయినా గృహశాంతి ముఖ్యమని భావిస్తారు. సంతానంలేని వారికి సంతానప్రాప్తి కలుగుతుంది. (సంతాన పాశుపత హోమం చేయాలి). అవివాహితులకు వివాహం జరుగుతుంది (భృగుపాశుపత హోమం చేయించాలి) పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునేవారికి కాలం అనుకూలంగా ఉంది. జాతకం కుదిరితే పిల్ల నచ్చదు, పిల్ల నచ్చితే జాతకం కుదరదు, ఈ రెండు బాగుంటే ఇలకేదో అడ్డం వస్తుంది. మగపిల్లల వివాహం సమస్యగా మారుతుంది. పరిహార శాంతులు చేయిచుకోవాలి. కోర్టుకేసులలో అమాయకంగా ఇరుక్కుపోయిన నిర్దోషులైన మీ బంధువర్గాన్ని రక్షించడానికి మీ పలుకుబడి ఉపయోగిస్తారు. వ్యవసాయ భూములను కొనడంలోను, వాటి పెంపకంలోను మానసిక ఆనందం కలుగుతుంది. అన్యభాషలు నేర్చుకోవాలనే ఆసక్తి పెరుగుతుంది. సంస్కృతం నేర్చుకుంటే మరింత మెరుగ్గా ఉంటుందని భావిస్తారు. వ్యాపారంలో నూతనమైన మార్పులు తెస్తారు. శ్రేయోభిలాషులు మాటలు ఊరట కలిగిస్తాయి, నూతన ఉత్సాహం కలిగిస్తాయి. కొన్ని ముఖ్యమైన నిర్వహణ వ్యవహారాల బాధ్యతలు వారికి అప్పగిస్తారు. ముఖ్యమైన చర్చలు జరిపేటప్పుడు మీ నేర్పరితనం ప్రదర్శించి మీకు అనుకూలమైన ఫలితాలను సాధిస్తారు. అనుకున్న మాటలన్నీ అగ్రిమెంటు రూపంలో సంతకాలు చేయించి మీ దగ్గర పెట్టుకుంటారు. మాటమీద నిలబడతారన్న నమ్మకం లేకనే మీరు ఈ విధంగా చేస్తారు. ఆర్థిక వ్యాపార వ్యవహారాలు మీరు ఊహించిన దానికన్నా సంతృప్తికరంగా ఉంటాయి. స్నేహితులైనటువంటి రాజకీయ నాయకులకు, మీరు కష్టపడి సేవ చేసినవారికి డబ్బులు ఇచ్చి పని చేయించుకోవడం మీ మనోవేదనకు కారణం అవుతుంది.

వృత్తి, ఉద్యోగాలపరంగా మీ నీతి, నిజాయితీ, ఎగతాళి పంచాయితీ అవుతుందని చెప్పడానికి విచారిస్తున్నాను. ఆర్థికపరంగాగాని, మరో విధంగాగానీ ఇబ్బందులు ఉన్నా ఉన్నంతలో సంతృప్తికరంగా ఉంటారు. భాగస్వాములలో వచ్చిన మంచిమార్పు వ్యాపారంలో లాభాలను, అనుకూల ఫలితాలను తెచ్చిపెడుతుంది. మీ బోధనలు పనిచేసినందుకు సంతోషిస్తారు. మొండి బాకీలకు సంబంధించిన వ్యవహారాలు కొర్టులో మీకు అనుకూలిస్తాయి. మధ్య మధ్యలో ఆరోగ్యం కొంత ఇబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో పదేపదే మార్పులు జరుగుతుంటాయి. మీ సహోద్యోగులు చేసిన పొరపాటువలన కార్యాలయంలో ఉన్నతాధికారుల మందలింపులను మీరు చవిచూడవలసి వస్తుంది. తప్పుచేసినవారి పేర్లను బయటికి రానివ్వకుండా మీరే నైతికబాధ్యత వహిస్తారు. యూనియన్ కార్యక్రమ వ్యావహారాలలో మీకు ఇష్టంలేకపోయినా పాల్గొనవలసి వస్తుంది.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. సంవత్సర ప్రథమార్థంలోను, ద్వితీయార్థంలోను కలుసుబాటు ఉంటుంది. శ్రమకు తగిన ఫలితం కాస్త ఆలస్యంగా అందుతుంది. విద్యాసంబంధమైన విషయాలు, పోటీ పరీక్షలకు సంబంధించిన విషయాలు సానుకూలపడతాయి, మంచి ఉద్యోగం లభిస్తుంది. బ్యాంకు ఉద్యోగాలు, టీచరు ఉద్యోగాలు సాధిస్తారు. గతంలో వచ్చిన మంచి సంబంధాలను తిరస్కరించినందుకు ఇప్పుడు బాధపడతారు. కొన్ని సంబంధాలు దగ్గరగా వచ్చి దూరంగా వెళ్ళిపోతాయి, దైవానుగ్రహం వలన ఎట్టకేలకు మంచి సంబంధం కుదురుతుంది. వివాహ జీవితంలో ఆటుపోట్లను సమర్థవంతంగా ఎదుర్కోవాలి జీవిత భాగస్వామితో కొన్ని విషయాలలో అభిప్రాయ బేధాలు చోటు చేసుకుంటాయి. యంత్రంలా పనిచేయవలసి ఉంటుంది. గడియారంతోపాటు జీవనగమనం నడుస్తుంది. ఆర్థిక పురోగతి బాగుంటుంది. మీరు పొదుపు చేసిన ధనాన్ని, మీకు నెలనెలా వచ్చే ఆదాయాన్ని ఏదో విధంగా చేజిక్కించుకోవాలని కొంతమంది కనిపెట్టుకుని కూర్చుంటారు, ఈ విషయంలో జాగ్రత్త వహించాలి. అధ్యాపకుల వైఖరివల్ల నష్టం జరుగుతుంది. ఒకటి రెండు మార్కుల తేడాలతో పరీక్షా ఫలితాలలో మార్పురావచ్చు. రీవాల్యుయేషన్ లాభిస్తుంది. సామాజికపరమైన గొడవలు, మార్పులు మీపై ప్రభావం చూపిస్తాయి. ఆరోగ్య విషయంలో తగిన జాగ్రత్తలు అవసరం, కేశ సంరక్షణకు తగిన ప్రాముఖ్యతనివ్వండి. జుట్టు రాలిపోనివ్వకుండా తగిన జాగ్రత్తలు తీసుకోండి. ఎలర్జీ ప్రాబ్లమ్స్, చెవి, ముక్కు, గొంతు సంబంధ సమస్యలు, మోకాళ్ళ నొప్పులు బాధించవచ్చు. ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్, ఐ.ఐ.టి వంటి వాటికి ఎంపిక అవుతారు. సమాజంలో మంచి పేరు ఉంటుంది. పాత మిత్రులు మళ్ళీ దగ్గరవుతారు. అభిమానులు, మిత్రుల ముసుగులో ఉన్న వ్యక్తుల నిజరూపం కాస్త ఆలస్యమయినా తెలుసుకుంటారు. దూరప్రాంత విద్య, ఉద్యోగ అవకాశాలు శనిగ్రహ అనుకూల ప్రభావం వల్ల విజయవంతం అవుతాయి. మీరు సరి అయిన దారిలో వెళుతూ ఉంటే మీరు నమ్మిన సన్నిహిత వర్గం వక్రమార్గంలో వెళ్ళమని సలహాచెబుతారు. దైవానుగ్రహం వల్ల నష్టపోకుండా సరి అయిన దారిలోనే వెళతారు. ప్రతి విషయానికి ఇతరులపై అధికంగా

ఆధారపడటం మంచిదికాదని గ్రహిస్తారు. సాహిత్య, సాంస్కృతిక కళారంగంలో మరియు క్రీడారంగంలో కొన్ని విజయాలు నమోదు చేసుకుంటారు. నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, ప్రతి ఆదివారం సర్వరక్షా చూర్ణంతో స్నానమాచరించండి, నవగ్రహ బాధలనుండి దూరంగా ఉంటారు. దొంగస్వామీజీల వల్ల నష్టపోతారు, ఆర్థికంగా ఇబ్బంది పడతారు. ప్రేమ వివాహాలు ప్రధాన విషయాలు అవుతాయి, మూడు నెలలు మానసిక అశాంతి ఏర్పడుతుంది. ముఖ్యమైన విషయాలలో పెద్దలతో, తల్లిదండ్రులతో విభేదాలు ఏర్పడతాయి. పొరపాటు నిర్ణయము తీసుకునే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. పెద్దలమాటలు వినటమే మీకు శ్రేయస్కరం. న్యాయపరమైన చిక్కుల నుండి బయటపడటానికి న్యాయ నిపుణులను సంప్రదిస్తారు. అవివాహితులైన స్త్రీలకు వివాహం జరుగుతుంది. నిత్యం ఆరావళి కుంకుమతో శ్రీ లక్ష్మీ చందనంతో మహాలక్ష్మిని పూజించండి. లక్ష్మీ తామర వత్తులతో దీపారాధన చేయండి. సెల్ఫ్ డ్రైవింగ్ విషయంలో జాగ్రత్తలు అవసరం. నూతన ఉద్యోగాలు మంచి అనుభూతినే కలిగిస్తాయి. మితిమీరిన ఆత్మవిశ్వాసం వలన, స్వయంకృతాపరాధన వల్ల నష్టపోయే అవకాశం ఉంది, జాగ్రత్తగా వ్యవహరించండి. మొత్తం మీద ఈ సంవత్సరం మానసిక సంతోషాన్ని కలిగిస్తుంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**
**8466932223/4/5, 9014126121**



## సర్పదోష నివారణా చూర్ణము

సర్పదోష నివారణా చూర్ణముతో స్నానము చేస్తే సర్పదోషాలు నివృత్తి అవుతాయి. జాతకంలో ఉన్న సర్పదోషాలే గాక అనువంశికంగా వస్తున్న సర్పదోషాలు పోతాయి. 1. అనంత కాలసర్పదోషం 2.గుళికా కాల సర్పదోషం 3.వాసుకి కాలసర్పదోషం 4.శంఖపాల కాలసర్పదోషం 5.పద్మకాల సర్పదోషం 6. మహాపద్మ కాలసర్పదోషం 7. తక్షక కాలసర్పదోషం 8.కర్కోటక కాల సర్పదోషం 9. శంఖపాల కాలసర్పదోషం 10. ఘటక కాలసర్పదోషం 11. విషధార కాలసర్పదోషం 12. శేషనాగ కాలసర్పదోషం మొదలగు సర్ప దోషాలు పోతాయి. స్నానం చేసే నీళ్ళలో రెండు స్పూన్ల చూర్ణాన్ని వేసుకుని స్నానం చేయాలి. ఈ చూర్ణముతో స్నానము చేయడం వలన చాలా శుభప్రదం

**గమనిక –** ఈ చూర్ణముతో తల స్నానం చేయరాదు.



# 2016-2017 లో సింహరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 11 | వ్యయం - 5 | రాజ - 6 | అవ - 3 |

**మఘ 1, 2, 3, 4 పాదములు, పుబ్బ 1, 2, 3, 4 పాదములు, ఉత్తర 1వ పాదముల యందు పుట్టినవారు "మా, మీ, మూ, మే, మో, టా, టీ, టూ, టే" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు సింహరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

సింహరాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు దైవానుగ్రహం వల్ల పూర్తిచేస్తారు. ఆర్థికపరమైన విషయాల్లో ఒడిదుడుకులు ఉన్నా సమయానికి ధనం చేతికి అందుతుంది. విద్యా, విదేశీయాన విషయాలు సానుకూలపడతాయి. మంచి ఉద్యోగం లభిస్తుంది. నూతన వ్యాపార వ్యూహాలు బాగుంటాయి. వ్యాపార విస్తరణ కోసం బ్యాంకు ఋణాలు తీసుకుంటారు. నూతన భాగస్వాముల చేరిక ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది.

మీరు ఎన్నుకున్న ప్రదేశాలను బట్టి లాభనష్టాలు ఉంటాయి. మహోన్నతమైన శిఖరాలను అధిరోహించాలని, అందరికీ ఆదర్శంగా ఉండాలని భావిస్తారు. మీరు శ్రమించిన ఒకానొక వ్యవహారంలో లాభిస్తుంది. ఒక తిరుగులేని అరుదైన విజయాన్ని నమోదు చేసుకుంటారు, కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి. శక్తి సామర్థ్యాలకు తగిన గుర్తింపు, చదివిన చదువుకు తగిన ఉద్యోగం లభిస్తుంది. గ్రీన్‌కార్డుకోసం ప్రయత్నించేవారికి ఈ సంవత్సరం సానుకూల ఫలితాలు ఉన్నాయి. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. సామాజిక సేవాకార్యక్రమాలలో పాల్గొంటారు. మీ శక్తి కొలది సహాయపడతారు. వృద్ధాశ్రమాలు, అనాథాశ్రమాలు, వికలాంగులకు సంబంధించిన వాటికి మీ సంపూర్ణ సహకారాలను అందజేస్తారు. విదేశాల నుండి కూడా నిధులు పోగుచేసి వారికి సహాయం చేద్దామనుకున్న మీ ప్రయత్నాలకు ఓ వ్యక్తి సైంధవుడిగా అడ్డుపడతారు. మాటతప్పే మనుషులవల్ల నష్టం కలుగుతుంది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలకు కాలం అనుకూలంగా ఉన్నప్పటికి సామాజిక పరిస్థితులు, వాతావరణ పరిస్థితుల వలన కొంత ఇబ్బంది కలుగుతుంది. లీజులకు సంబంధించిన విషయాలు, ఇసుక వ్యాపారం కొంత వివాదాస్పదం అవుతాయి. మీరు నిలబెట్టిన మీ ఆత్మీయులు, సన్నిహితులు రాజకీయంగా ఉన్నతస్థానంలో ఉన్న కారణంగా ప్రభుత్వసంబంధమైన కాంట్రాక్టులు మీకు లాభిస్తాయి. వ్యాపారానికి ఇబ్బందిలేనటువంటి వాతావరణాన్ని ఏర్పరచుకోగలుగుతారు. రాజకీయాన్ని వ్యాపారం చేస్తున్నామా అని ఒక దశలో ఆలోచిస్తారు. ప్రతి కీలక సమయంలోనూ దైవానుగ్రహం, రాజకీయ పలుకుబడి మిమ్ములను రక్షిస్తాయి. ప్రైవేటు వ్యక్తులనుండి లోనులు

తీసుకోవాల్సిన పరిస్థితి బహుశా రావచ్చు. వృత్తి, ఉద్యోగాల పట్ల అంకితభావంతో దివారాత్రులు శ్రమిస్తారు, అందరి మెప్పులను పొందగలుగుతారు, ప్రమోషన్ లభిస్తుంది. కానీ కొంతమంది కుహనా వ్యక్తులు మీ శ్రమ, అంకితభావం వెనుక స్వార్థ ప్రయోజనాలు ఉన్నాయని ప్రచారం చేస్తారు. మీ వ్యక్తిత్వంలో, దినచర్యలో ఉన్న లోపాలను తెలుసుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తారు. వివాదంలో ఉన్న ఆస్థి తగాదాల పట్ల జోక్యం చేసుకోరు. దాని పట్ల భ్రాంతి కలిగి ఉండరు. రక్తాన్నంలో భాగం పంచుకోవడానికి ఇష్టపడరు. కోర్టు తీర్పుల ప్రకారం ఎవరికి వచ్చిన భాగం వారు తీసుకోండి అని తెగేసి చెబుతారు. ఆరోగ్యసంబంధమైన సమస్యలు కొంతకాలం బాధ పెడతాయి. అరికాలి మంటలు, మోకాళ్ళనొప్పులు ఇ.ఎన్.టి. ప్రాబ్లమ్స్ ఇబ్బంది పెట్టి అవకాశం ఉంది. ప్రధానంగా కీళ్ళు, వెన్నెముక బాధలు ఉండవచ్చు. సహోదర సహోదరీ వర్గానికి రహస్యంగా ఆర్థికసహాయం అందిస్తారు. వాళ్ళలో ఐకమత్యం లేకపోవడం వల్ల మీరు చేసిన సహాయం బయటపెడతారు. ఉద్యోగంలో ఒక వ్యక్తిని రక్షించడానికి అతను చేసిన పొరపాటును మీ మీద వేసుకుంటారు. మీ గుడ్‌విల్ పెద్దది కావడం వల్ల ఎలాంటి ఇబ్బందులు ఏర్పడవు. ఎంత కలిసి వచ్చినా డబ్బులు ఉన్నా సంఘంలో మంచి స్థాయి లభించినా దేనికీలేని లోటు పరిస్థితి ఉన్నా ఏదో ఒక మానసిక, అప్రశాంతత బాధిస్తుంది. గతించిపోయిన వ్యక్తి జ్ఞాపకాలు ఎంతగానో బాధిస్తాయి. మరుపు అంత తెలిక కాదని గ్రహిస్తారు. కాలానికి ఎదురీదడం వల్ల కాదని గ్రహిస్తారు. వ్యవసాయరంగంలో ఉన్న వారికి ఫలితాలు అంతంత మాత్రంగానే ఉన్నాయి. డాక్టర్లకు, లాయర్లకు, విద్యాసంస్థల వారికి ఇబ్బంది లేనటువంటి కాలం అయినప్పటికీ సొంత వ్యక్తుల పొరపాట్లు అపఖ్యాతికి దారితీయవచ్చు. పోటీ పరీక్షలలోగానీ, మామూలు పరీక్షలలోగాని మీరు వ్రాసింది కాపీ కొట్టిన వారికి ఎక్కువ మార్కులు, మీకు తక్కువ మార్కులు వస్తాయి. కాపీయింగును ప్రోత్సాహించడమే తప్పని తెలుసుకుంటారు. వివిధ ప్రాంతాలను సందర్శించాలన్న కోరిక ఈ సంవత్సరం నెర వేరుతుంది. రాజకీయ మార్పులు చేర్పులు మీకు లాభిస్తాయి. విదేశాలలో ఉన్న మీ ఆత్మీయవర్గం ప్రశాంతంగా ఉన్నారని తెలుస్తుంది. అక్కడినుండి వచ్చే ఫోన్‌కాల్సు మానసిక ప్రశాంతతను కలిగిస్తుంది. నిష్కారణ వేధింపులకు గురి అవుతున్న మీ సంతానానికి ఏదో ఒక పరిష్కారమార్గం చూపించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. చిల్లరమల్లర తగాదాలు, మధ్యవర్తిత్వాలు రాజీయత్నాలు విసుగుపుట్టిస్తాయి. ఏ పని చేయాలనుకున్నా సమాజాన్ని, ఆత్మగౌరవాన్ని దృష్టిలో ఉంచుకోవాల్సి వస్తుంది. ఇందువలన చేతిలో ఉన్న పనులను కూడా చేయలేకపోతారు. అందరూ అన్ని పనులు చేయలేరని సరిపెట్టుకుంటారు. జ్యోతిష్కుల సలహాలు ఉపకరిస్తాయి. ఆధ్యాత్మిక భావనవల్ల కొంత మానసిక ప్రశాంతత చేకూరుతుంది. పరిష్కరించలేని సమస్యలను కాలానికి, దైవానికి వదిలివేస్తారు. ఇది ఒక రకంగా బాధ్యతారాహిత్యమైనా చేయగలిగింది ఏమీ లేదు, పొరపాటు నిర్ణయం జరిగింది. ఇది పూర్తిగా మీ స్వయంకృతాపరాధం అని బాధితులైన వారికి గుర్తుచేస్తారు. ఒకనాడు ఆత్మీయతా భావంతో, మితిమీరిన సంతోషంతో మీరు కొంతమందికి చేసిన ఉపకారానికి గాను ప్రస్తుతం బాధపడవలసి పరిస్థితి ఏర్పడుతుంది. ట్రాన్స్ పోర్టు, ట్రావెలింగ్ బిజినెస్‌లోని వాళ్ళకి బాగుంది. ప్రజా సంబంధాలు తగ్గించుకుంటారు. న్యాయస్థానాల పరంగా న్యాయం జరుగుతుంది. మీకు పోటీగా వస్తున్నటువంటి శత్రువుని లేక పోటీదారుని నిలువరించడంలో మీరు విజయం సాధిస్తారు. కళా, సాహిత్య సాంస్కృతిక రంగాలలో మంచి

ప్రఖ్యాతి లభిస్తుంది. అవార్డులు బిరుదులూ లభిస్తాయి. రాజకీయం చేసి అవార్డులు సాధించారని మీపై నిందారోపణ రావడం మానసిక వేదనకు కారణమవుతుంది. కంటి సైటు పెరిగే అవకాశం ఉంది. మనస్సులో ఉన్న భావాలు ఇతరులకు తెలియకుండా జాగ్రత్తపడతారు. నిత్య సంతోషిగా అందరికీ కనిపిస్తారు. స్వగృహ యోగం ఏర్పడుతుంది. మీమీద ఉన్న బాధ్యతలను తీర్చుకోవాలని తీవ్రంగా ఆలోచన చేస్తారు. ప్రతిపనిలోనూ కష్టపడితేగానీ ఫలితాలు రావు. అనూహ్యంగా ప్రతి విషయంలోనూ అదృష్టం కలిసివస్తుందని భావించవద్దు. అదృష్టం, మన ఆశ, కృషి, వాస్తవం. ఈ విషయాన్ని గ్రహించి తగినవిధంగా ప్రవర్తించండి కుటుంబసభ్యుల దృష్టిలో అది కొనుగోలు, మీ దృష్టిలో అది పెట్టుబడి. ప్రభుత్వ సంబంధమైన కొన్ని ఉత్తర్వులు మీకు మేలు చేస్తాయి. మీ పలుకుబడిని ఉపయోగించి తక్కువ కొటేషన్‌తో ఎక్కువ లాభాలు ఉన్న కాంట్రాక్టులను మీ స్వంతం చేసుకుంటారు. దూరప్రాంతాలకు పిల్లలని పంపించి మంచి చదువులు చదివిస్తారు. ఈ రాశివారు ఈ సంవత్సరం మహాపాశుపత హోమం చేయించాలి. మీరు పెట్టుబడి పెట్టిన ధనం చిక్కుల్లో పడుతుంది. ఇది కొంతకాలం ఇబ్బంది పెడుతుంది. బ్లాక్ మార్కెట్, చట్టవ్యతిరేక వ్యాపారాలు చేసేవారికి ప్రతికూల కాలం. పద్ధతులు మార్చుకోక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది. మీరు అవగాహన లేని అంశాలలో, విషయాలలో తలదూర్చి పెట్టుబడి నష్టపోవడమే కాకుండా మీ గుడ్‌విల్ దెబ్బతినే పరిస్థితి రావచ్చు. మంచివాళ్ళు అని భావించి సహధర్మాన్ని అనుసరించి మీ శక్తియుక్తులను, పలుకుబడిని ఉపయోగించి ఏ వ్యక్తిని రాజకీయ అధికార పీఠం ఎక్కడానికి కృషిచేశారో అదే వ్యక్తి గతం మరిచి మిమ్ములను ఎదగనీయకుండా చేస్తారు. అపాత్రదానం చేసినందుకు బాధపడతారు. ఆనాడు ఎంతో ఉత్సాహంగా చేసిన పనికి ఈ రోజు విచారిస్తారు. ఏది ఏమయినా గట్టి పట్టుదలతో మంచివాళ్ళ సాంగత్యంతో ఓ కూటమిని ఏర్పరుస్తారు, మీకు ద్రోహం చేసిన వ్యక్తిని రాజకీయంగా అడుగడుగునా ఇబ్బందుల పాలు జేసి మీరంటే ఎమిటో తెలిసి వచ్చేలా చేస్తారు. ఎక్కడా పొరపాటు చేయకుండా పొగడ్తలను లెక్కచేయకుండా ఆచితూచి నిర్ణయాలు తీసుకంటారు. అన్ని విషయాల పట్ల స్పష్టమైన అవగాహన కోసం కృషి చేస్తారు. మీకు తెలిసిన విషయాలు తెలియజేసి నిర్మొహమాటంగా మాట్లాడతారు. భేషజాలకు పోరు. అన్ని తెలిసినట్టు నటించే మీ సన్నిహిత వర్గానికి హితబోధ చేస్తారు. కాలచక్ర గమనంలో మానవుడు నిమిత్తమాత్రుడని భగవంతుని సంకల్పానికి ఎదురులేదని గ్రహించి నడుచుకుంటారు. ఇష్టదేవతా ప్రార్థనలో ఏకాగ్రత కుదురుతుంది. విలాసవంతమైన జీవితం గడుపుతున్న కుటుంబ సభ్యులకు ఖర్చులు తగ్గించుకొవాలని బోధనలు చేస్తారు. సమాజంలో ఒదిగి ఉంటేనే విలువ పెరుగుతుందని, ఆధునిక పోకడలు మంచికి దారితీస్తాయని మీవాళ్లకు బ్రతిమాలి చెబుతారు. వివాదంలో ఉన్న భూమి అమ్మకం వలన వచ్చిన ధనం చాలా వ్యవహారాలకు ఉపయోగపడుతుంది. ముఖ్యమైన అవసరాలు తీరతాయి. నమ్మకమైన వ్యాపారాలలో పెట్టుబడి పెడతారు. వృద్ధులను, పెద్దలను, తల్లిదండ్రులను ప్రేమగా చూస్తారు. ఎన్నో విషయాలు మరచి పోతారేమో గాని మీ మీద ఉన్న బాధ్యతలను మరచిపోరు. మీ వ్యక్తిత్వం, మంచితనం, హోదా, సహాయం చేసే గుణం ఇవన్నీ సమాజంలో బంధువులతో కీర్తిప్రతిష్టలకు కారణమవుతాయి. ఒకే ఒక బలహీనతవల్ల కొందరి దృష్టిలో మీ వ్యక్తిత్వం విమర్శలకు దారితీస్తుంది. ఈ విషయంలో జాగ్రత్త వహించండి, మీకు తిరుగుండదు. ప్రతిష్టాత్మకమైన సంస్థలు, యూనియన్లు, క్లబ్బులు

మొదలైనవాటిల్లో సభ్యత్వం తీసుకుంటారు. సేవా కార్యక్రమాలు చేయడానికి అందరికంటే ముందుంటారు. మీరంటే అసూయపడే సహోదర, సహోదరీ వర్గం ఇంట్లో తల్లిదండ్రులకు ఏమీ చేయరు, బయటివాళ్ళని ఉద్ధరిస్తారట. ఇలాంటి వ్యాఖ్యానాలు చేసి పరనింద, ఆత్మస్తుతితో కాలం గడుపుతారు. ఆ దౌర్భాగ్యుల గురించి పట్టించుకోకూడదని నిర్ణయించుకుంటారు. మీ ఆధ్వర్యంలో పనిచేసే సేవాసంస్థలకు ప్రఖ్యాతి, విరాళాలు లభిస్తాయి. వాతావరణ సంబంధమైన విషయాల గురించి మీరు చేసిన కృషికి అవార్డులు, పేరు లభిస్తాయి. ఇద్దరు స్త్రీల మధ్య ఏర్పడిన వివాదాలను పరిష్కరించడానికి ఎంతగానో శ్రమిస్తారు. కానీ ఫలితం ఉండదు. వీళ్ళ తగాదాల వల్ల గృహశాంతికి ఇబ్బంది రాకుండా జాగ్రత్తపడతారు. ఒరిగిపోయిన (గతించిన) ఓ జీవి జ్ఞాపకాలు అదేపనిగా గుర్తుకురావడం వలన మానసిక వేదన, హృదయ భారము, వైరాగ్యం, నిర్వేదం, నిరుత్సాహం కలిగిస్తాయి. కొన్ని సందర్భాలలో ఏమి సాధించాలని జీవిస్తున్నామో అనే భావన మనస్సును తొలచివేస్తుంది. గతించిపోయిన మృత్యు విషాద ఘోష ఇంకా చెవులలో మారు మ్రోగుతున్నట్లు అనిపిస్తుంది. భగవంతుని సంకల్పం ముందు మానవుని శక్తిసామర్థ్యాలు, అభ్యర్థన, విన్నపములు, విజ్ఞాపనలు, ప్రార్థనలు పనిచేయవన్న కఠోర సత్యాన్ని తెలుసుకుంటారు. ఇదే విషయాన్ని మీ స్నేహితులకు కూడా చెప్పి బాధపడతారు. ప్రభుత్వపరంగా కొన్ని మినహాయింపులు ఎవరికీ లభించనివి మీకు లభిస్తాయి. రాజకీయపదవి లభిస్తే చాలా ప్రయోజనాలను పొందగలుగుతామని భావిస్తారు. ఈ భావన మీలో బలపడుతుంది. రాజకీయ పదవీప్రాప్తి కోసం మీరు చేసే ప్రయత్నం ఫలిస్తుంది. గనులు, బొగ్గు, వనమూలికలు, ఆయుర్వేద ఔషధాలు మొదలైన వ్యాపారాలు, వ్యాపారప్రదమైన చర్చలు ఫలప్రదం అవుతాయి. సంతాన సంబంధమైన విషయాలలో పురోగతిని గమనిస్తారు. చిన్నచిన్న విషయాలలో సంతానం మీ మాటను ధిక్కరించడం జరుగుతుంది. స్త్రీ సంతానాన్ని అపరిమితమైన ప్రేమతో చూస్తారు. ఆత్మీయవర్గం, సన్నిహిత, సహచర వర్గం ఆంతరంగికులు చేసే పొరపాట్లు, నష్టం మీ కంటికి కనిపించవు, కనిపించినా అవి మీకు తప్పుగా అనిపించవు. ఈ రకమైన ఆశ్రిత పక్షపాతం వలన కొన్ని చేదు అనుభవాలు ఎదురవుతాయి. శుభకార్య చర్చలు ఫలప్రదం అవుతాయి. సంవత్సర ద్వితీయార్థంలో మీ బరువుబాధ్యతలను దించుకుంటారు. శుభకార్యాలు పూర్తిచేస్తారు. మారని మనుషులను మార్చడానికి విఫల ప్రయత్నం చేస్తారు. మీకు ఏమాత్రం సంబంధంలేని విషయాలలో మీ పేరు వినపడుతుంది. అనవసర అపనిందలు మనోవేదనకు కారణం అవుతాయి. సన్నిహితులు, నిపుణులతో సంప్రదించకుండా ఏ ముఖ్య కార్యక్రమాన్నీ అమలు చేయవద్దు. కొన్ని సున్నితమైన వ్యవహారాలలో మీ అభిప్రాయాలను మీ సన్నిహితులు సమర్థించరు. కుటుంబంలో స్వల్పమైన భేదాభిప్రాయాలు వస్తాయి. సంగీత, సాహిత్య, కళారంగాలలో మీ పాత్ర ప్రశంసనీయంగా ఉంటుంది. చిన్ననాటి మిత్రులు దగ్గరవుతారు, పాత జ్ఞాపకాలు సంతోషం కలిగిస్తాయి. వ్యాపారంలో మీ స్థాయి పెరుగుతుంది. కనుమరుగైన కొన్ని సెంటిమెంటు వస్తువులు, డాక్యుమెంట్లు, తిరిగి మీకు దొరుకుతాయి. ఎవ్వరినీ తక్కువగా అంచనా వేయవద్దు. మితిమీరిన ఆత్మవిశ్వాసం వల్ల ఇబ్బందులు ఎదుర్కొంటారు. మారుతున్న రాజకీయ సమీకరణకు అనుగుణంగా మీ వ్యూహాలలో మార్పులు చేస్తారు. నూతన పథకాలు రచిస్తారు. ఫైనాన్స్ వ్యాపారాలకు దూరంగా ఉండండి. మీ భాగస్వాముల అసమర్థత వల్ల, ప్రభుత్వ అధికారుల వల్ల ఇబ్బందులు వస్తాయి. ప్రజాసంబంధాలు వృద్ధి చేసుకోవడానికి

విశేషంగా శ్రమిస్తారు. గత అనుభవాలు నేర్పిన గుణపాఠాలనుండి క్రొత్త పాఠాలు నేర్చుకుంటారు. యోగా, ప్రకృతి వైద్యం వంటివి బాగా ఆకర్షిస్తాయి. కానీ వాటిని పూర్తిగా ఆచరణలో పెట్టలేరు. కొన్ని ముఖ్యమైన విషయాలలో ఒంటరిపోరాటం చేయవలసి వస్తుంది, అయినా వెనుకడుగు వేయరు. కారణాలు ఏమైనా ఓ సామాజిక వర్గానికి మీరు దూరం అవుతారు. శత్రువర్గం ఈ విధంగా బురద జల్లుతుందని మీరు ఊహించలేరు. సమయం కోసం ఎదురుచూసి అదనుచూసి దెబ్బ తీయాలని అనుకుంటారు. సంవత్సర ద్వితీయార్ధంలో పునర్వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. నిత్యం నాగసింధూరం ధరించాలి, సర్వరక్షాచూర్ణంతో స్నానం చేయాలి. కొన్ని సందర్భాలలో దైవానుగ్రహం మీకు అండగా ఉందని రుజువుచేసే సంఘటనలు ఎదురువుతాయి. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. దూరప్రాంత ప్రయాణాలకు తేదీలను నిర్ణయించుకుంటారు. వాయిదా పడుతూవస్తున్న వ్యక్తిగత పనులను ముఖ్య అధికారి ద్వారా పరిష్కరించుకుంటారు. గతంలో మీరు పడిన శ్రమకు ఫలితం ఇప్పుడు దొరుకుతుంది. అయినదానికీ, కానిదానికీ వాస్తవాలను మీకు తెలియకుండా మభ్యపెట్టి పొగడ్తలతో ముంచేసే భజనబృందాల వల్ల నష్టపోతారు. ఫిక్సడ్ డిపాజిట్స్ వల్ల వచ్చే వడ్డీలు అనుకున్న కార్యక్రమాలకు సరిపోవు, ప్రత్యామ్నాయ మార్గాలను అన్వేషిస్తారు, అభివృద్ధి, కోసం కొన్ని ఋణాలను తెస్తారు. మొండిబాకీల విషయమై క్రిమినల్ చర్యలు చేపట్టవలసి వస్తుంది. ఆహారనియమాలు తప్పనిసరిగా పాటించండి. అరుగుదలపై జీర్ణకోశంపై ప్రతికూల ఫలితాలు చూపించే అవకాశం ఉంది. విద్యారంగంలో మెరిట్ మార్కులు, స్కాలర్‌షిప్పులు లభిస్తాయి. గణితం వంటి విభాగాలలో ఏకాగ్రత లోపించవచ్చు, జాగ్రత్త వహించండి. సంవత్సరం ద్వితీయార్థంలో పోటీ పరీక్షలు కఠినమైన సవాళ్ళుగా మారతాయి. పట్టుదలతో మంచి ఫలితాలను సాధిస్తారు. విదేశాలలో ఉండేవారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. జాతకం ఎంత గొప్పగా నడుస్తున్నా ప్రతివారికీ ఏదో సందర్భంలో ఇబ్బందులు, అనూహ్యమైన సంఘటనలు జరుగుతాయి. కొంతకాలం మీకు ఇష్టంలేని వ్యక్తి పర్యవేక్షణలో పనిచేయవలసి వస్తుంది. సత్యహరిశ్చంద్ర చక్రవర్తి అంతటివాడు కాటికాపరి వంటి పనిచేశాడు. మహోన్నతమైన నవరత్న ఖచ్చితమైన ఖడ్గాన్ని ధరించి, మహోన్నత సింహాసనాన్ని అధిరోహించిన చక్రవర్తి శ్మశానంలో ఒంటరి అయి చితిమంటలలో కాలుతున్న కట్టెను పట్టుకుని శ్మశానికి కావలి కాశాడు. భగవత్ సంకల్పం ముందు అన్నీ దిగదుడుపే అని గ్రహిస్తారు. వైవాహిక జీవితంలో వచ్చిన ఒడిదుడుకులను కష్టపడి సరిదిద్దుకుంటారు. రెండు మూడు సమస్యలు ఒకేసారి వస్తాయి, యుక్తిగా పరిష్కరించు కుంటారు లేదా సమస్యలను వాయిదా వేస్తారు. అతీంద్రియ శక్తులు ఆవహించాయని భూతాలూ, దెయ్యాలు బాధ పెడుతున్నాయని కొంతమంది మిత్రులు భయపడి మిమ్ములను కూడా భయ పెడతారు. మీరు వాళ్ళ అజ్ఞానానికి ఆశ్చర్యపోతారు, అలాంటి వాటిని పట్టించుకోరు. దెయ్యాలు, భూతాలు సమాజంలో ఉన్నాయి, కానీ శ్మశానంలో లేవని మీ భావన. “గతించి పోయినవారు శాశ్వతంగా నిద్రిస్తున్న ప్రదేశమే శ్మశానము. అక్కడ గాఢమైన నిశ్శబ్దమే తప్ప మరేమీ” లేదు ఇలాంటి భావజాలం కలిగిన మీరు ఇతరుల మాటలను ఈ విషయంలో నమ్మరు. వినోద సాధనాలు మీపై చెప్పుకోదగిన ప్రభావాన్ని చూపుతాయి. బంధువులలోనే కొత్త బంధుత్వాలు ఏర్పడతాయి. కుదరని ఓ సంబంధం గురించి ఎక్కువగా ఊహించుకుంటారు, తప్పిపోయింది మంచి అవకాశం అని భావిస్తారు. కొంతకాలం తరువాత మీ ఉద్దేశం తప్పని తెలుస్తుంది. నిత్యం

సర్పదోష చూర్ణంతో స్నానం చేయండి. దైవికంతో ధూపం వేయండి. ఇతరులతో పోల్చుకుని వాళ్ళ వ్యక్తిత్వానికి ప్రభావితం అవుతారు. చమత్కారాలు, హాస్యోక్తులు మితిమీరడం వలన కొంతమంది దూరం అవుతారు. సమాజంలో అసాంఘిక శక్తులు కొన్ని మిమ్ములను బెదిరిస్తాయి. వాళ్ళు కలలో కూడా ఊహించని ట్రీట్‌మెంట్ ఇస్తారు. మీ జోలికి వస్తే ఏం జరుగుతుందో అందరికీ తెలిసేలా చేస్తారు. పెంపుడు జంతువుల విషయంలో మనస్తాపం కలుగుతుంది. కేశ సంరక్షణకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. దురాశకు నష్టపోయిన మీ సహచర వర్గానికి కొంతవరకు న్యాయం జరిగేలా చేస్తారు. దిక్కుమాలిన కార్యక్రమాలకు దూరంగా ఉండమని హెచ్చరిస్తారు. ఎవరిని దూరంగా ఉంచాలో, ఎవరిని ఆదరించాలో స్పష్టమైన అవగాహన కలిగి ఉంటారు. బద్ధకం, అతినిద్ర వల్ల కొన్ని ప్రయోజనాలకు ఇబ్బంది కలుగుతుంది. నేరం చేసి తెలివిగా తప్పించుకున్న వారికి మీ వ్యూహంతో కాస్త ఆలస్యంగా చట్టం ముందు నిలబెడతారు. అధికారుల అభినందనలను అందుకుంటారు. కొన్ని సందర్భాలలో శ్రమ పడకుండానే కార్యానుకూలత చేకూరుతుంది. భాగస్వాములు తయారుచేసే గణితాలలో లోపాలు ఉంటాయి. మీకు రావాల్సిన లాభాలు అంకెలగారడీ వల్ల తక్కువగా చూపించబడతాయి. అన్నీ తెలిసికూడా కొంతకాలం వేచి చూడాలని భావిస్తారు. నిత్యం అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. టీవి రంగంలో మంచి ప్రఖ్యాతి సినిమాలలో అవకాశాలు వస్తాయి. మీ శత్రువర్గంలో ఒకరు మితిమీరి మాట్లాడడంవల్ల పరువునష్టం దావా వేస్తారు. రహస్య వ్యూహరచనల అమలుకోసం, రహస్య ప్రయాణాలు చేస్తారు. పెద్ద మొత్తంలో ధనాన్ని భద్రపరుస్తారు. ఇన్‌కంటాక్స్ అధికారుల వల్ల, ఇతరుల వల్ల ఇబ్బందులు రాకుండా అన్ని జాగ్రత్తలు తీసుకుంటారు. మీ అనుమానాలు నిజం అవుతాయి. నమ్మకద్రోహులను గుర్తించగలుగుతారు. అన్ని విషయాలను ప్రక్షాళన చేసి స్వచ్ఛమైన మీ అభిమానులను ప్రక్కన ఉంచుకుంటారు. లగ్నంలో సంచరించు గురు రాహువుల ప్రభావం, చతుర్థంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, సప్తమంలో సంచరించు కేతుగ్రహ, రవిచంద్ర గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. మొత్తం మీద గడిచిన సంవత్సరం కంటే బాగుంటుంది.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. అవివాహితులైన వారికి వివాహం జరుగుతుంది. వృత్తి, వ్యాపారాలు బాగున్నాయి. ప్రభుత్వ పథకాల వల్ల మేలు పొందుతారు. విద్యాసంబంధమైన విషయాలు, విదేశీయాన సంబంధమైన విషయాలు అనుకూలిస్తాయి. అంతర్గతమైన పట్టుదల మంచి ఫలితాలకు దారితీస్తుంది. పోటీపరీక్షలో విజయం సాధించి మంచి ఉద్యోగాన్ని సాధిస్తారు. శ్రీలక్ష్మీ చందనంతో మహాలక్ష్మీదేవిని అర్చించండి, లక్ష్మీ తామర వత్తులతో దీపారాధన చేయండి. ప్రతి విషయం మీకు తెలుసు అన్న మీ ఆత్మవిశ్వాసం సరిఅయిన ఫలితాలను ఇవ్వదు. విద్యా, సాంస్కృతిక రంగాలలో మంచి పేరు ప్రఖ్యాతలు లభిస్తాయి. క్రీడారంగంలో ఉన్నవారికి అవార్డులు లభిస్తాయి. ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది. అధికారుల వేధింపుల వల్ల బదిలీలకు సిద్ధం అవుతారు. విలువైన వస్తువుల కొనుగోలులో మోసపోయే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. చిట్టీలు వేయకండి, ఫైనాన్స్ వ్యాపారానికి దూరంగా ఉండండి. మీకిష్టం లేకపోయినా రాజకీయరంగ

ప్రవేశం చేస్తారు. మీ భావాలను స్పష్టంగా ప్రకటించడం వల్ల ఎన్నో వివాహ సంబంధాలను దూరం చేసుకుంటారు. మీరు కలలుగన్న స్వగృహాన్ని ఏర్పరచుకోగలుగుతారు. ఈ పాటికే గృహం ఉన్నవారికి స్థిరాస్థి ఏర్పడుతుంది. సంతాన సంబంధ విషయంలో అసంతృప్తి ఉంటుంది. సంసార జీవితంలో బేధాభిప్రాయాలు ఉన్నా అవి పెద్దగాప్రభావం చూపవు. మీకు ఇష్టంలేని పనులు చేయించడమే కొంతమంది పనిగా పెట్టుకుంటారు. మీ సహనానికి, ఓర్పుకి పరీక్ష పెడతారు. ఆత్మీయులతో కొంతకాలం దూరంగా ఉండవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కుటుంబ విషయాలలో ఇతరుల జోక్యం ఎక్కువ అవుతుంది. పదిమందికి సహాయం చేసే స్థితిలో ఉన్నా సొంతవారికి సహాయం చేయలేని పరిస్థితి ఏర్పడుతుంది. చేతులకు కనిపించనటువంటి, కంటికి కనిపించనటువంటి కర్కశమైన సంకెళ్ళు పడతాయి.పోటీ పరీక్షలలో విజయం సాధించడానికి దివారాత్రులు శ్రమిస్తారు. మీరు కలలుగన్న సామ్రాజ్యాన్ని మీరు మీరుగానే ఏర్పరచుకోవాలని శ్రమిస్తారు. ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్., ఐ.ఐ.టి వంటి వాటికోసం మీరు శ్రమిస్తారు. వివాదాలకు, విభేదాలకు కోర్టు అంతిమ పరిష్కారం చూపిస్తుంది. భూములు, స్థిరాస్థులు ఏర్పరచుకోవాలని ఆశపడతారు. శ్రమతో శ్రమిస్తే సాధ్యం కానిది లేదని గ్రహిస్తారు. సంతానంలేని వారికి సంతానం కలుగుతుంది. (సంతాన పాశుపత హోమం చేయండి). సంతాన సాఫల్య కేంద్రాలను మాత్రం నమ్మవద్దు. పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునేవారికి కాస్త అటూ ఇటుగా అనుకూలమైన సంబంధమే కుదురుతుంది. జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమవుతుంది, దీనినైనా సుఖమయం చేసుకోవాలని భావిస్తారు. బ్యూటీపార్లర్స్ నడిపేవారికి అనుకూల కాలం. వైద్యవృత్తిలో బాగా రాణిస్తారు. మెడిసిన్ సీటు లభిస్తుంది. బంధువులలో అసూయాద్వేషాలు ఎక్కువ అవుతాయి. నమ్ముకున్న వ్యక్తి మోసం చేస్తాడు. పెద్దల అభిప్రాయాలను ధిక్కరించినందుకు తగిన మూల్యం చెల్లిస్తారు. ప్రతి విషయంలోనూ పెద్దవాళ్ళను గౌరవించడమే మీకు మేలు. అన్యభాషలు నేర్చుకోవడానికి, డ్రైవింగ్ నేర్చుకోవడానికి కష్టపడతారు. మీరు వద్దనుకున్న పోలీసు ఆఫీసరు ఉద్యోగానికి ఎంపిక అవుతారు. నిత్యం ఓం నమో నారాయాణాయ వత్తులు వెలిగించండి. సంతానం ఒక దారిన పడతారు, మెరిట్ మార్కులు సాధిస్తారు, మీ ఆశయాలకు మేర చదువుకుంటారు. ఇంట్లో ఒకరికి విదేశాలలో ఉద్యోగం వస్తుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటారు. దొంగస్వామీజీలను నమ్మి మోసపోతారు. వివాహం కాని మగపిల్లల విషయం పెద్ద సమస్యగా మారుతుంది. ఎన్నో సంబంధాలు దగ్గరగా వచ్చి దూరం వెళ్ళిపోతాయి. (భృగుపాశుపత హోమం చేయించండి). మీ పేరు మీద చేసే వ్యాపారాలు బాగుంటాయి. సమాజంలో కుటుంబ కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. ఆరోగ్యపరమైన జాగ్రత్తలు అవసరం, మోకాళ్ళ నొప్పులు బాధించే అవకాశం ఉంది. అన్ని విషయాలకు భగవంతుని మీద భారం వేయకుండా మానవ కృషి కూడా ఉండాలని భావిస్తారు. ఇతరులు చెప్పకుండానే మీకు మీరే అనేక మార్పులు తెచ్చుకుంటారు. పాస్‌పోర్టు, గ్రీన్ కార్డు వంటివి లభిస్తాయి. నిత్యం సర్వరక్షా చూర్ణంతో స్నానం చేయండి. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు, వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో కన్యారాశి ఫలితములు

| ఆదాయం - 14 | వ్యయం - 11 | రాజ - 2 | అవ - 6 |
|---|---|---|---|

**ఉత్తర 2, 3, 4 పాదములు, హస్త 1, 2, 3, 4 పాదములు, చిత్త 1, 2 పాదముల యందు పుట్టినవారు "టో, పా, పి, పూ, షం, ణా, ఠా, పే, పో" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కన్యరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

కన్యారాశివారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. అందులో ఎక్కువగా అనుకూల ఫలితాలు ఉన్నాయి. ప్రతి పని ఎంతో కష్టంతో పూర్తవుతుంది. ముఖ్యమైన పనులు దైవానుగ్రహం వలన పూర్తవుతాయి. నిష్కారణమైన విభేదాలు, సామర్థ్యానికి తగిన గుర్తింపు లభించకపోవడం జరుగుతుంది. మీ కన్నా స్థాయి తక్కువవాళ్ళు, సామర్థ్యం లేనివాళ్ళు, మీ కంటే ఉన్నత స్థానంలో ఉంటారు. ఇటువంటి సంఘటనలు మానసిక వేదనకు దారి తీస్తాయి. పోటీ పరీక్షలలో విజయం సాధించగలుగుతారు. ఇంటర్వ్యూలలో కూడా మీ సామర్థ్యాన్ని నిరూపించుకుంటారు. ఉద్యోగం వస్తుంది. కాని సంతృప్తి ఉండదు. కోర్టు పరంగా రావాల్సిన తీర్పుల కోసం ఎక్కువకాలం వేచి ఉండవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. స్థిరాస్థులకు సంబంధించిన వ్యవహారాలు ఎక్కువ ఇబ్బంది పెడతాయి. విద్యాసంబంధమైన విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపించి ఉన్నత విద్యలు అభ్యసించగలుగుతారు. టీచర్స్ వల్ల, ప్రొఫెసర్స్ వల్ల ఇబ్బందులు కలుగుతాయి. కుల, మత, వర్గ ప్రాంతీయ విద్వేషాలు మీ మీద ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గాని ప్రభావం చూపుతాయి. మిమ్ములను మీరు నిరూపించుకోవడానికి ఎంతో కష్టపడవలసి వస్తుంది. లిఖితపూర్వకంగా ఉన్న ప్రభుత్వ ఉత్తర్వులకు వక్రభాష్యం చెప్పి మీ ప్రయోజనాలను కొంతమంది అధికారులు అడ్డుకుంటారు. న్యాయస్థానాలను ఆశ్రయించాల్సిన పరిస్థితి వస్తుంది. వారసత్వంగా రావాల్సిన ఆస్తుల విషయంలో మీకు అన్యాయం జరుగుతుంది. కొంతమంది విషయంలో కొత్త ఆలోచనలు వేధిస్తాయి. ఎన్నాళ్ళీ జీవన గమనం అని ప్రశ్నించుకుంటారు. నైరాశ్యం, వైరాగ్యం ఎక్కువ అవుతాయి. ఎక్కువగా ఆలోచించి డిప్రెషన్‌కు లోనుకావద్దు. సంవత్సర ప్రథమార్థం కన్నా ద్వితీయార్థం బాగుంది. కురుక్షేత్ర సంగ్రామానికి ముందు భీష్ముడు అంతటివాడు కర్ణుణ్ణి అర్థరహితుడని నిర్ణయించి కృంగదీసినట్లుగా కొందరు పెద్దలు మీ మీద పక్షపాతంతో వ్యవహరిస్తారు. న్యాయం చెప్పవలసినవాళ్ళే అన్యాయం చేస్తారు. బంధువర్గం ఆస్థులపరంగా మీకు జరిగిన అన్యాయానికి సంబంధించి మౌనం వహిస్తారు. మీ ద్వారా ఎన్నో ప్రయోజనాలు పొందిన బంధువర్గం కూడా ఇలాగే ప్రవర్తిస్తారు. లోకం తీరు మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది, ఆవేదన కలిగిస్తుంది. ఆరోగ్యం విషయంలో, శారీరక సౌందర్య పోషణకు సంబంధించిన విషయంలో అధిక ప్రాధాన్యతనిస్తారు. స్త్రీలవల్ల కొన్ని ప్రయోజనాలను పొందుతారు. ఆరోగ్యకరమైన వాతావరణంలో, మానవీయ కోణంలో సహాయం చేస్తున్న ఓ స్త్రీ విషయంలో అసభ్యకరమైన అసత్య ప్రచారం మీమీద కొనసాగుతుంది. స్నేహానికి అర్థం

తెలుసుకోలేని మూర్ఖులు ఇలాంటి ప్రచారం చేస్తున్నారని భావిస్తారు. స్త్రీ, పురుషుల మధ్య ఉన్న స్నేహాన్ని వక్రీకరించే ఈ సమాజం పట్ల విరక్తి కలుగుతుంది. సామాజిక కార్యక్రమాల్లో, ఆధ్యాత్మిక కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొంటారు. ప్రింటింగ్, స్టేషనరీ, హోటల్, లోహపు వ్యాపారాలు, రియల్ ఎస్టేట్ లాభసాటిగానే నడుస్తాయి. డబ్బులు వస్తాయి. వ్యాపారంలో లాభాలు వచ్చినా, మరెందులోనైనా లాభాలు వచ్చినా ధనం ఏదో ఒక రూపేణా జారిపోతుంది. పొదుపు చేయడానికి గట్టి ప్రయత్నం చేస్తారు. అందులో కొంత విజయం సాధిస్తారు. కార్యాలయంలో గ్రూపు తగాదాలు పరాకాష్టకు చేరుకుంటాయి. పని చేయకుండా మొండికేస్తున్న వారి పని కూడా మీరే చేయవలసి వస్తుంది. మోకాళ్ళ, కీళ్ళనొప్పులు, ఎలర్జీ వ్యాధులు ఇబ్బంది పెడతాయి. ఈ రాశిలో జన్మించిన ఆయుర్వేదం, హోమియో వైద్యులకు కాలం అనుకూలంగా ఉంది, అంతేకాక ఈ రాశిలో జన్మించినవారు ఆయుర్వేదం, హోమియో వైద్యాన్ని ఆశ్రయించడం వలన ప్రయోజనాలు ఉంటాయి. లాయర్లకు, స్టాండింగ్ కౌన్సిల్ లీగల్ అడ్వైజరీ పోస్టులు లభిస్తాయి. పెద్దలు, వృద్ధులు, అయినవాళ్ళ సంతోషానికి మీ శక్తికి మించి ఖర్చుపెట్టి వాళ్ళను సంతృప్తిపరుస్తారు. పెద్దలు మీ ద్వారా అన్ని సహాయాలను, సంరక్షణను పొందుతారు. అయితే ప్రేమ మాత్రం వేరేవాళ్ళమీద ఉంటుంది. మీ సంపాదన మంచిది కాదు, నా చేయి మంచిది కాదు, నా జాతకం మంచిది కాదు అని మనోవేదన చెందుతారు. సర్వోన్నత న్యాయపీఠాన్ని అధిరోహించినా ఆ పరమేశ్వరుడే మేలు చేశాడని, మేలు చేయాలని ప్రార్థిస్తారు. నరదృష్టికి విరుగుడుగా నాగసింధూరాన్ని ధరించండి, సిద్ధగంధంతో పూజించండి. క్రీడాసంబంధమైన విషయాలలో కొంత మానసిక సంతృప్తి కలుగుతుంది. సంతానం క్రీడాసంబంధమైన విషయాల్లో రాణిస్తారు. ఇది మానసిక సంతోషానికి కారణం అవుతుంది. ఉద్యోగానికి స్పోర్ట్స్ సర్టిఫికేట్స్ బాగా ఉపకరిస్తాయి. జలసంబంధమైన వ్యాపారాలు బాగుంటాయి. మీరు కోరుకున్న ఆస్తులకు విలువ పెరుగుతుంది. స్త్రీ సంతానం మంచి అభివృద్ధిలోకి వస్తారు. సంవత్సర ద్వితీయార్థంలో విదేశీయాన వ్యవహారాలు లాభిస్తాయి. గ్రీన్‌కార్డు లభిస్తుంది. పి.హెచ్.డి. కోర్సులు పూర్తవుతాయి. మంచి జరిగినప్పుడు పొంగిపోవడం, లేనప్పుడు కృంగిపోకుండా ధైర్యంగా కష్టసుఖాలను రెండిటినీ ఆహ్వానిస్తారు. కొంతమంది విషయంలో పిల్లల భవిష్యత్తు విషయమై వాలెంటరీ రిటైర్మెంట్ ఆలోచనలు వస్తాయి. కార్యాలయంలో సహోద్యోగ్యుల మధ్య వివాదాలు తారాస్థాయికి చేరి, కార్యాలయం పరువు పోతుంది. కార్యాలయ ఉనికికే ముప్పు కలుగుతుంది. మీరు ఎంతో కష్టపడి సమస్యలను పరిష్కరించి కార్యాలయాన్ని ఓ దారిలో పెడతారు. ఉన్నత అధికారులు మీ శ్రమకు, సామర్థ్యాన్ని ఎట్టకేలకు గుర్తిస్తారు. స్వయంగా పరిశీలించి వాస్తవ విషయాలు పరపతిని ఉపయోగించి కొంతమందికి పార్ట్ టైం ఉద్యోగాలు ఇప్పిస్తారు. సుగంధ ద్రవ్య వ్యాపారాలు, హోల్‌సేల్ వ్యాపారాలు, రిటైల్ మార్కెటింగ్, తక్కువ సమయంలో సాగే వ్యాపారాలు, నీళ్ళకు సంబంధించిన వ్యాపారాలు, ఆటోమొబైల్స్, ట్రావెల్స్ వ్యాపారాలు లాభిస్తాయి. తాత్కాలికంగా చేస్తున్న ఉద్యోగం పర్మనెంట్ అవుతుంది. రైల్వే, బ్యాంకు ఉద్యోగాలు లభిస్తాయి. ప్రేమ వివాహాలు నిరుత్సాహపరుస్తాయి. ఎవరి అండదండలు లభించవు. కార్యాలయానికి సంబంధించి కొత్త కొత్త బ్రాంచీలు ప్రారంభిస్తారు. ఒంట్లో శక్తి ఉన్నప్పుడే, గుడ్ విల్ ఉన్నప్పుడే సంపాదించుకోవాలని నిర్ణయించుకుంటారు. వృత్తి, ఉద్యోగాలలో అనారోగ్య పోటీ ఏర్పడుతుంది. జాయింట్ వ్యవహారాలలో, వివాహ సంబంధాలలో ఒక అపరిచిత వ్యక్తి సహకరిస్తారు. పిల్లల స్వతంత్ర నిర్ణయాలు ఇబ్బంది కలిగిస్తాయి. గత స్మృతులను గుర్తుకు తెప్పించే సంఘటనలు మీ మనోవేదనకు కారణం అవుతాయి. మీకు అందిన రహస్య సమాచారం ఉపయోగపడుతుంది. మీ పరిధిలోలేని పనిని చేసిపెట్టమని ఒత్తిడి పెరుగుతుంది.

విధినిర్వహణలో ఇది మీకు జటిల సమస్యగా మారుతుంది. ఎ.సి.బి కోర్టుల నుండి నిర్దోషులుగా బయటపడతారు. పాతస్నేహితుల కూటమితో కొంతమంది కొత్త వ్యక్తులను చేరుస్తారు. సమిష్టిగా వ్యవహరించే నూతన వ్యవహారాలు నిర్వహించే విషయంలో స్పష్టమైన అవగాహనకు వస్తారు. ఏది ఏమైనా మీరు చేసే కృషి, శ్రమ మీకన్నా ఇతరులకు ఎక్కువ మేలు చేస్తుంది. గతంలో సహాయం చేసిన వ్యక్తులను విస్మరించి మీ వ్యక్తిత్వానికి మచ్చ తెచ్చుకోకూడదు. మిమ్ములను ఇబ్బంది పెట్టే ఉత్తర్వులు సాంకేతిక కారణాలవల్ల అమలు కావు. అనవసరపు ఖర్చుచేసే మీవాళ్ళను అదుపులో పెట్టడంలో మీరు విఫలమవుతాయి. మంచి చెప్పే ఆత్మీయవర్గంతో సహా చాలామందికి మీరు విరోధులు అవుతారు. ఉన్నత స్థాయిలో ఉన్న వ్యక్తులతో ఉన్న సాన్నిహిత్యాన్ని పెంచుకునే ప్రయత్నం చేస్తారు. ప్రతి విషయానికి భయపడడం, ఆందోళనపడడం మానుకుంటారు, మహోన్నతమైన వ్యక్తులు కలిసి సాధించుకున్న విషయాలను మీరు సామాన్యులతో సాధిస్తారు. వివాహ విషయాలకు సంబంధించి వ్యక్తిగత జాతకం పరిశీలించి ఫలితం చెప్పాలి, కనుక వ్యక్తిగతంగా సంప్రదించండి. మీ ద్వారా సహాయం పొందినవారు నమ్మకద్రోహం చేస్తారు. మీరు పట్టించుకోనట్లు వ్యవహరిస్తారు. ఎప్పుడూ మిమ్ములను వ్యతిరేకించే వర్గం మీకు సన్నిహితం అవుతుంది. వృత్తి, ఉద్యోగాలపరంగా సంవత్సర ద్వితీయార్థంలో కొన్ని సంజాయిషీలు ఇచ్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అపనిందలకు దగ్గరగా గ్రహస్థితి నడుస్తుంది. చిత్రవిచిత్రమైన వ్యూహాలతో మీ ప్రతిష్ఠ దెబ్బతినకుండా జీవనశైలిని నడిపిస్తారు. ఉద్యోగసంబంధమైన అవకాశాలు, విదేశీసంబంధమైన అవకాశాలు మీ రక్త సంబంధీకులకు వస్తాయి. ఇది మీ కుటుంబ ప్రతిష్ఠను పెంచుతుంది. కృషి వ్యర్థం కాదన్న సంగతి చాలా సందర్భాలలో రుజువు అవుతుంది. మీరు ప్రస్తుతం అధిష్టించిన స్థానాన్ని ఎలాగైనా దక్కించుకోవాలని ఆశించే వ్యక్తులు భంగపడతారు, మీకు ఆశ్చర్యం కలిగించదు. డాక్యుమెంట్స్, అప్లికేషన్లు, ఇంటర్వ్యూ కార్డ్స్ మొదలైన విషయాలలో పొరపాటుపడే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. మీమీద అతిగా ఆధారపడిన వ్యక్తులను ఓ దారిలో పెడతారు. స్త్రీలకు సంబంధించిన వివాదాలలో మీ పేరు లాగబడే అవకాశం ఉంది. సంవత్సర ద్వితీయార్థంలో మీకు రావాల్సిన ప్రయోజనాలకు ఆటంకాలు ఏర్పడతాయి. పంతాలు, పట్టింపులకు పోకుండా చర్చలతో సమస్యలని పరిష్కరించుకుని మీ ప్రయోజనాలు కాపాడుకుంటారు. మీ ప్రత్యర్థుల రాజకీయ పలుకుబడి మీ విషయంలో అంతగా పనిచేయదు. అయితే కక్కుర్తిపడే అధికారులవల్ల చిక్కులు వస్తాయి. వాతావరణంలో వచ్చిన మార్పులు, ఆరోగ్యం మీద, వృత్తి, ఉద్యోగాల మీద ప్రభావం చూపుతాయి. సొంత విషయాలకు విచ్చలవిడిగా ఖర్చుపెడతారని మీమీద ఆరోపణలు వస్తాయి. ప్రభుత్వపరంగా రావాల్సిన రాయితీలు, మినహాయింపులు వస్తాయి. లీజులు, లైసెన్సులు అనుకూలిస్తాయి. బంధువుల అనారోగ్యం పట్ల మీరు శ్రద్ధ వహించాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. మీ సహచరులలో నిజమైన ప్రతిభా పాటవాలు ఉన్నవాళ్ళను గుర్తించలేకపోయాం అన్న బాధ కలుగుతుంది. ఈ విషయమై మానసికంగా ఎంతో వ్యధ చెందుతారు. నిబంధనలకు, నైతిక ధర్మాలకు తిలోదకాలిచ్చి మీ సాటివాళ్ళు అధికంగా దరిదాపుగా మీతో సమానంగా ప్రయోజనాలు పొందుతారు. ఆలోచనలు పరిపరి విధాలుగా పోతాయి. నైతికధర్మం తగలబడిందా? లేక నైతికధర్మాన్ని నమ్ముకుని నేను నష్టపోయానా? అన్న వైరాగ్యం కలుగుతుంది. కుటుంబ విషయాలపై శ్రద్ధ తగ్గుతుంది. ఏది ఏమైనా కుటుంబ విషయాలు పురోగతిలో ఉండటం మీకు ఊరట కలిగిస్తుంది, కొన్ని బాధ్యతలు విస్మరించి వృత్తి, ఉద్యోగాలకు తాళి కట్టినందుకు బాధపడతారు. మీ వైపు జరిగిన లోపాలను మీ కుటుంబసభ్యులు అర్థం చేసుకుని మిమ్ములను సమర్థిస్తారు, మీ ఆశయాల సాధనకు

కుటుంబ సభ్యులు పరోక్షంగా సహకరిస్తారు. ఈ రాశిలో జన్మించిన వారికి సంతానం కలుగుతుంది. అయితే గర్భస్థ శిశువు రక్షణకు జాగ్రత్తలు వహించాలి. మధ్యవర్తి పంచనామాలు చేసి నష్టపోయినవారికి తగిన న్యాయం చేస్తారు. ష్యూరిటీ సంతకాలు చేయవలసిన పరిస్థితులు అనివార్యంగా గోచరిస్తున్నాయి. కొంతమందికి ఆత్మీయులతో సంబంధ బాంధవ్యాలు చట్టపరంగా శాశ్వతంగా విడిపోవాల్సిన పరిస్థితి గోచరిస్తుంది. పిల్లలు ఎంత మొండిపట్టు పట్టినా ద్విచక్రవాహనం కొనిపెట్టవద్దు, ఈతలకు, పిక్నిక్‌లకు పంపించవద్దు. జ్యేష్ఠ సంతాన విషయాలలో కొన్ని స్పష్టమైన నిర్ణయాలు తీసుకుంటారు. అష్టమూలికా తైలంతో ఓం నమశ్శివాయ వత్తులతో దీపారాధన చేయండి, సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. మీరు చెల్లించాల్సిన రుణాలకు గాను స్థిరాస్థులలో కొంతభాగం అమ్మాలని ప్రయత్నిస్తారు, స్థిరాస్థులు అమ్ముడుపోక ఇబ్బందులు పడతారు. ఆప్యాయతతో, ఆదరణతో వచ్చినవాళ్ళే మిమ్ములను దూరంగా ఉంచుతారు. మీరు ఎక్కడ సహాయం అడుగుతారో అని సన్నిహితులు మోహం చాటువేస్తారు. సమస్యల పరిష్కారానికి విదేశాలకు వెళ్ళి ఎదో ఒకటి చేద్దామని ఆలోచిస్తారు. ఈ ప్రయత్నాలు కూడా పెద్దగా ఫలించవు. ఆరోగ్యపరమైన అంశాలలో జాగ్రత్త వహించాలి. కీళ్ళనొప్పులు, మోకాళ్ళ నొప్పులు ఇబ్బంది పెట్టవచ్చు. సంవత్సర ద్వితీయార్థంలో ఎటుచూసినా పరిస్థితులు ప్రోత్సాహకరంగా ఉండవు. రాజకీయంగా నమ్మక ద్రోహానికి గురౌతారు. మంచీ, చెడు ఒకే నాణెంపై ఇరువైపులా ఉంటాయని గ్రహిస్తారు. అరణ్యవాసం చేస్తున్నామా, అజ్ఞాతవాసం చేస్తున్నామా అనే సందేహం కలుగుతుంది. కోర్టు సంబంధమైన వ్యవహారాలు ఒక కోర్టు తీర్పు అనుకూలంగానూ, మరొక కోర్టు తీర్పు ప్రతికూలంగానూ వస్తాయి. స్థిరాస్థులను రక్షించుకోవడానికి మధ్యవర్తి పరిష్కారాలు ఫలిస్తాయి. అధిక వడ్డీలు చెల్లించాల్సిన ఇబ్బందుల నుండి తప్పుకోగలుగుతారు. సన్నిహిత మిత్ర, మిత్రుల, ఆత్మీయుల సహకారంతో అధిక వడ్డీల ఋణాలను చెల్లించివేస్తారు. కొన్ని ఇబ్బందులను ఎదుర్కొని విద్యాసంబంధమైన విషయాలు పూర్తిచేస్తారు. నూతన కోర్సులను పూర్తిచేస్తారు. విద్యా సంబంధమైన లోనులు లభిస్తాయి. రాజకీయ స్నేహితులు కీలక సమయంలో పెద్దగా మేలు చేయకపోయినా, జరగబోవు కీడును ఆపగలుగుతాయి. మీరు మాట్లాడిన ప్రతి మాటకు దుష్ప్రచారం వక్రమైన అర్థాలతో పుకార్లు సంభవిస్తాయి, ఓర్పు వహించండి. గతంలో ఇతరులకు చేసిన సహాయానికిగాను ఇప్పుడు విచారించాల్సి వస్తుంది. ఒకనాడు మహదానంద కార్యక్రమానికి సహకరించినందుకు ఇప్పుడు బాధపడాల్సి వస్తుంది. పెంపుడు జంతువుల విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపిస్తారు. సేవక సిబ్బంది నమ్మకంగా పనిచేస్తారు. రివాల్వర్ లైసెన్స్ కోసం ప్రయత్నిస్తారు. కొండంత అండగా ఉన్న సేవక సిబ్బంది వల్ల మానసిక సంతోషం కలిగి ఉంటారు. మితిమీరిన మంచితనంవల్ల ఆత్మవిశ్వాసంవల్ల కొంతమందికి దగ్గరవుతారు. కొంత మందికి దూరమవుతారు. ఉద్యోగపరంగా ఉన్నటువంటి దీర్ఘకాలిక వేధింపుల నుండి బయటపడతారు. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యాసంస్థలు, వృద్ధాశ్రమాలు వాటి నిర్వహణ పురోగమనంలో ఉంటాయి, మంచి పేరు వస్తుంది. కేశసంరక్షణకు, వస్త్రధారణకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. కొన్ని సందర్భాలలో జీవితం మళ్ళీ ప్రారంభిస్తున్నామా అని అనిపిస్తుంది. గృహనిర్మాణ సంబంధమైన లోనులు మంజూరు అవుతాయి. హోల్‌సేల్, వ్యాపారానికన్నా, రిటైల్ మార్కెటింగ్‌లో ఎక్కువ లాభాలు పొందుతారు. సినిమా రంగంలోనివారికి, టివి రంగంలోని వారికి మంచి సూచనలు కనిపిస్తున్నాయి. వ్యాపారం సంస్థ విస్తరించడంకోసం దూరప్రాంత ప్రయణాలు చేస్తారు. రహస్య చర్చలు పూర్తిచేస్తారు. సమాలోచనలు, సమీకరణలు, సభలు, సమావేశాలు, వ్యూహ ప్రతివ్యూహాలు ఒకటేమిటి మీరు సర్వశక్తులు వినియోగిస్తారు,

లాభపడతారు సమాజంలో మీ స్థాయి పెరుగుతుంది. మీరు సాధించిన విజయాలను చూసి సంతోషించే ఇష్టుడు, సన్నిహితుడు మీ శ్రేయోభిలాషి శాశ్వతంగా దూరమవడం మీ మానసిక వేదనకు కారణం అవుతుంది. స్నేహితుడే లేనప్పుడు ఎందుకు కష్టపడాలి, ఎవరికోసం కష్టపడాలి ఈ విజయాలను చూసి మనస్ఫూర్తిగా సంతోషించేవాడే లేనపుడు, ఎందుకు శ్రమించాలి, ఈ విజయాలు నాకు మనఃసంతోషాన్ని కలిగించనప్పుడు నేను దేనికోసం పోరాటం చేయాలి, నా పోరాటానికి, ఆరాటానికి అర్థం ఏమిటి? అని పరిపరి విధాల మనస్సు వ్యాకులపడుతుంది. ప్రేమ పెళ్ళిళ్ళు వికటిస్తాయి. కొంతమంది విషయంలో కోర్టులు, విడాకులు తప్పనిసరి అవుతాయి. వృత్తి, ఉద్యోగాల కారణంగా భార్యాభర్తలు, పిల్లలకు దూరంగా ఉండవలసిన పరిస్థితి గోచరిస్తుంది. మీ సన్నిహితవర్గానికి, ఆత్మీయవర్గానికి విదేశాలలో ఊహించనటువంటి అపశ్రుతులు సంభవిస్తాయి. వాళ్ళను అడ్డుకోవడానికి కొన్ని ప్రయత్నాలు చేస్తారు. నూతన భాషలను అభ్యసించడానికి ఉత్సాహం చూపుతారు. అయితే ఏకాగ్రత లోపిస్తుంది. ఈ రాశిలో జన్మించిన విద్యార్థీ విద్యార్థినులకు మెరిట్ మార్కులు వస్తాయి. నిత్యం సరస్వతి తిలకాన్ని ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి, ఐ.ఎ.ఎస్, ఐ.పి.ఎస్, సి.ఏ. వంటి వాటికి ఎంపిక అవుతారు. మంచి ఉద్యోగం సాధించి జీవితంలో స్థిరపడతారు. వివాహాది శుభకార్యాలు దైవానుగ్రహం వలన ఆకస్మికంగా కుదురుతాయి. ప్రేమపెళ్ళిళ్ళు విఫలం అవుతాయి. పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునేవారికి కాలం అనుకూలంగా ఉంది. రొటేషన్ మనీ ముఖ్యమైన సందర్భాలలో లభించదు. అందువలన ముఖ్యమైన కొనుగోలు చేజారిపోతాయి. అనుకూలంగా వచ్చిన కోర్టు తీర్పులు అమలుకావడంలో జాప్యం జరుగుతుంది. ఎందుకంటే కోర్టులో ఓడిపోయినవారు బలవంతులు గనుక. మీరు చేసే నూతన వ్యాపారాలలో అనుకూలమైన ఫలితాలు లభిస్తాయి. టీలు, కాఫీలు ఎక్కువ అవుతాయి. సమయానికి నిద్ర, ఆహారం లేకుండా శ్రమిస్తారు. నిద్రలేని రాత్రులలో భవిష్యత్తు దీపాన్ని పరిరక్షించుకోవాలని పరిపరి విధాలుగా ఆలోచిస్తారు. సమస్యలు ఏర్పడినపుడు, ఆరోగ్యం సరిగ్గాలేనపుడు కార్యక్రమాలను వాయిదా వేసుకుంటారు. విద్యాపరమైన ముఖ్యవిషయాలలో స్నేహితుల సలహాలు తీసుకుంటారు. ప్రతి విషయంలో సందర్భోచితంగా వ్యవహరిస్తారు. గాలి వాటాన్ని బట్టి నిర్ణయాలు తీసుకుంటారు. దరఖాస్తులు పంపేటప్పుడు రెండు మూడు సార్లు పరిశీలించి పంపించండి. దొంగస్వామీజీలవల్ల నష్టపోతారు. కొంత మంది విషయంలో కోరి తెచ్చుకున్న కోడలు నానా విధాలా బాధపెట్టడం. కోర్టుచుట్టూ, పోలీసుల చుట్టూ తిరగవలసి రావడం మీ మానసిక వేదనకు కారణమవుతుంది. ఈ సమస్యలను పరిష్కరించుకోవడానికి చాలా శ్రమపడవలసి వస్తుంది. విడాకులు ఇవ్వరు, కాపురానికి రాదు, ఈ రకమైనటువంటి ఇబ్బంది కారణమైనటువంటి సమస్యలు కొందరికి సంప్రాప్తిస్తాయి. ప్రస్తుతం వాడుతున్న కళ్ళద్దాలు మార్చవలసి వస్తుంది. నూతన బ్యాంకులో డిపాజిట్స్ వేస్తారు. నిర్మాణసంబంధమైన వ్యవహారాలలో ప్రత్యక్ష నాణ్యతను పరిశీలించుకోవడం చాలా ముఖ్యమని గ్రహిస్తారు. ఇద్దరు స్త్రీలమధ్య వివాదాన్ని సరిదిద్దడానికి ప్రయత్నం చేసి సఫలం అవుతారు. నాన్ వెజిటేరియన్ తినేవాళ్ళు కొంత కాలం మానేస్తారు. పిల్లల చదువులు, ఫీజులు మీ అంచనాలు దాటిపోతాయి. మిల్క్ డైరీ ప్రారంభించాలని ఆలోచన చేస్తారు. ఆహార సంబంధమైన వ్యాపారాలు ప్రారంభించాలనే ఆలోచన వస్తుంది. సువర్ణ ఆభరణాల విషయంలో భద్రత తీసుకుంటారు. కళా, సాహిత్యరంగంలోని వారికి మంచి గుర్తింపు. అవార్డులు లభిస్తాయి. మీ పిల్లలకు మీ బంధువుల పిల్లలకు చదువులో ఆరోగ్యకరమైన పోటీ ఏర్పడుతుంది. ఒకరిని మించి మరొకరు ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలని పోటీ పడతారు, ఇది విద్వేషాలకు దారితీస్తుంది. భార్య అనారోగ్యం

గురించి జాగ్రత్తలు తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. మిమ్ములను నమ్మి అప్పగించిన పనులను సక్రమంగా పూర్తిచేస్తారు. ప్రతి విషయాన్ని గోప్యంగా రహస్యంగా ఉంచాలని ప్రయత్నిస్తారు, ఈ నిర్ణయం అన్ని వేళలా మంచి చేయదు, కొన్ని సమయాలలో వికటిస్తుంది. ప్రతి విషయంలో ఆర్థిక కోణంలోనే చేస్తారు. నైతిక విలువలు ముఖ్యమా? ఆస్తులు, అంతస్తులు ముఖ్యమా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. చిన్న విషయాలు పట్టించుకోకుండా పెద్దపెద్ద విషయాలను సెటిల్ చేసుకోవాలనే ఆలోచనలో ఉంటారు. ఈ నేపథ్యంలో చిన్న చిన్న విషయాలను కూడా వదిలిపెట్టరు. ముఖ్యమైనటువంటి డాక్యుమెంట్స్‌లలో ప్రభుత్వ ఉత్తర్వులలో రాసినటువంటి విషయాలు మీకు ఉపయుక్తంగా ఉంటాయి. ఈ సమాజంలో జీవించాలని అనుకుంటూ అంతరాత్మ సాక్షికి విరుద్ధంగా ప్రవర్తించాల్సిందే అన్న నిర్ణయానికి వస్తారు. బంధువర్గంలో ఉన్న రెండు వైరివర్గాలను కలిపి ఒక శుభకార్యాన్ని బాధ్యతగా తీసుకుని పూర్తిచేస్తారు. ఇది మహత్తరమైన పుణ్యకార్యంగా భావిస్తారు. వ్యయంలో సంచరించు గురు రాహువుల ప్రభావం, తృతీయంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, ఆరింట సంచరించు కేతుగ్రహ ప్రభావం, రవి చంద్ర గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. మొత్తం మీద ఈ సంవత్సరం గడిచిన రెండు సంవత్సరాల కంటే బాగుంది. ఈ రాశివారు మహాపాశుపత హోమం చేయించాలి.

**స్త్రీలకు ప్రత్యేకం**

కన్యారాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరం బాగుంది. అవివాహితులైన వారికి వివాహం కుదురుతుంది, మంచి సంబంధం వస్తుంది. ఇతర దేశాల్లో సంబంధాలకు అవకాశాలున్నాయి. మెడిసిన్, ఐ.ఐ.టి లలో సీటు వస్తుంది. జీవితాశయం సాధిస్తారు. పెద్ద, పెద్ద విషయాలు సానుకూలబడతాయి. పరిష్కారం అవుతాయి. ఎటొచ్చీ చిన్న సమస్యలు ఇబ్బంది పెడతాయి. నమ్మక ద్రోహానికి గురి అవుతారు. మాట తప్పే మనుష్యుల వల్ల ఇబ్బంది కలుగుతుంది. ఆత్మీయులతో చట్టపరంగా విడిపోవాల్సిన పరిస్థితి రావచ్చు (కొందరికి). విలాస వంతమైన వస్తువులను, సువర్ణ ఆభరణాలను కొనుగోలు చేస్తారు. కుటుంబ విషయాలు, సంతాన సంబంధమైన విషయాలు అనుకూలంగా ఉన్నాయి. విద్యా, సాంస్కృతిక వ్యవహారంలో గట్టిపోటీ ఎదుర్కొని మంచి ఫలితాలు సాధిస్తారు. పోటీ ఉంటేనే మీ శక్తి సామర్థ్యాలు బయటికి వస్తాయి. పోటీలేని చోట మీరు అతిసామాన్య మార్కులను మాత్రమే సాధించగలుగుతారు. పోటీ పరీక్షలకు గాను దివారాత్రులు శ్రమించి అద్భుతమైన ఫలితాలను సాధిస్తారు. ఈ సంవత్సరం ప్రభుత్వ ఉద్యోగం వస్తుంది. ఉద్యోగంలో బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగ పరంగా కొన్ని అదనపు బాధ్యతలను నిర్వహించవలసి వస్తుంది. మీకు అనుభవం లేనటువంటి కొన్ని పదవులను నిర్వహించవలసి వస్తుంది. గైనిక్ ప్రాబ్లమ్స్ పట్ల జాగ్రత్త వహించండి. కీళ్ళకు సంబంధించిన సమస్యలు, అరికాలి మంటలు, మోకాళ్ళ నొప్పులు ఇబ్బంది పెట్టె అవకాశం ఉంది. మీ పరపతిని ఉపయోగించి మీ బంధువులకు, ఫ్యామిలీ ఫ్రెండ్స్‌కు ఉద్యోగాలు ఇప్పించి మరపురాని మేలు చేస్తారు. సంతానం పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటారు. అన్ని విషయాలు బాగానే ఉన్నాయి, పిల్లల మొండితనం అది మార్చలేని మీ ఆశక్తత, రెండూ కలిసి కోపం, విసుగు తెప్పిస్తాయి. పిల్లల విద్యా సంబంధ విషయాలు బాగుంటాయి. ఇవి మీకు ఊరట కలిగించే అంశంగా మారుతుంది. భార్యాభర్తల మధ్య విభేదాలు బయటకు రాకుండా జాగ్రత్త వహిస్తారు. సంతానం లేనివారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. గృహనిర్మాణం అనే కోరిక కూడా నెరవేరుతుంది. శుభకార్యాలు ఆకస్మికంగా అనుకూలిస్తాయి. చిన్నప్పుడే నేర్చుకున్న విద్యావిజ్ఞాన సంబంధ విషయాలు ఇప్పుడు మీకు ఉపయోగపడతాయి. చట్టపరమైన తీర్పులు మీకు అనుకూలంగా ఉంటాయి. స్వయం సంపాదనతో కొన్ని స్థిరాస్థులు కొనుగోలు

చేస్తారు. మీ పేరు మీద చేసే వ్యాపారాలు బాగుంటాయి. కుటుంబానికి అండగా ఉంటాయి. కోపతాపాలకు దూరంగా ఉంటారు. కాని గతంలో బంధువులు, ఆత్మీయులు చేసిన అవమానాలు చేదు జ్ఞాపకాలుగానే మిగిలిపోతాయి. విదేశాలలో చదువు కోవడానికి అవకాశం వస్తుంది. క్రీడారంగంలో మీ శక్తిసామర్థ్యాలు గుర్తింపుకు నోచుకుంటాయి. సంగీత పరంగా మంచి ప్రఖ్యాతి, అవార్డులు లభిస్తాయి. టీవి, సినిమారంగంలో ఉన్నవారికి అనుకూల కాలం. కొన్ని పాటలు మీరే పాడాలని, మీరు పాడితేనే ఆకర్షణీయంగా ఉంటాయని ప్రజలలో ఒక అభిప్రాయం ఏర్పడుతుంది. సనాతన సాంప్రదాయాల పట్ల ఆచార వ్యవహారాల పట్ల గౌరవం కలిగి ఉంటారు. ఓ వ్యక్తి మీ జీవితంలో ప్రవేశించే ప్రయత్నం చేస్తాడు, తెలివిగా ఆ చిక్కుల నుండి బయటపడతారు. ప్రేమ వివాహాలు వైఫల్యం చెందుతాయి. ఈ విషయాన్ని గమనించి నిర్ణయాలు తీసుకోండి. పునర్వివాహ ప్రయత్నాలు చేసుకునేవారికి ప్రయత్నాలు ఫలిస్తాయి. వివాదాస్పద అంశాలకు దూరంగా ఉంటారు. సుఖవంతమైన జీవితాన్ని గడపడానికి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు. ఇబ్బందులతో కూడిన సంభాషణలు, బాధలు, కష్టాలు వినడానికి కూడా ఇష్టపడరు. మీ ఆధ్వర్యంలో నడిచే బ్యూటీ పార్లర్స్ బాగా నడుస్తాయి. వివిధరకాల ఎలక్ట్రానిక్ సామానులు కొనుగోలు చేస్తారు. గృహాల అలంకరణకు, సౌందర్య పరిరక్షణకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. ఈ రాశిలో జన్మించిన స్త్రీలు ప్రతినిత్యం శ్రీలక్ష్మీ చందనంతో మహాలక్ష్మికి పూజచేయాలి, నిత్యం కనకదుర్గాంబ అష్టోత్తరం పఠించాలి. నిత్యం పసుపు వత్తులతో దీపారాధన చేయాలి, గడిచిన రెండు సంవత్సరాలకన్నా ఈ సంవత్సరం చాలా బాగుంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

## అష్టమూలికా తైలం

లక్ష్మీతామర గింజలు, కస్తూరిబెండ, శివమారేడు, విష్ణుమారేడు, లక్ష్మీమారేడు మొదలగు సుగంధ వృక్షముల గింజల నుండి తైలము తీసి, దీర్ఘాయువు మూలికలతో సమ్మేళనము చేయుటద్వారా ఈ అష్టమూలికాతైలము తయారు చేస్తారు. ఈ తైలముతో దీపారాధన చేసి అష్టైశ్వర్యములతో, ఆయురారోగ్యములతో వర్ధిల్లుదురు గాక.

**అష్టమూలికా తైలముతో – దీపారాధన భగవంతుని అనుగ్రహమునకు చక్కని సాధన**

## సరస్వతీ తిలకము

జ్ఞాన వృద్ధికి, విద్యారంగములో విజయప్రాప్తికి, జ్ఞాపకశక్తివృద్ధికి, సరస్వతీ కటాక్షమునకు ధరించే కుంకుమ. ఈ సరస్వతీ తిలకము. విద్యార్థినీ, విద్యార్థులే కాక పెద్దవారు కూడా ధరించదగినది. అష్టద్రవ్యములు, సరస్వతీతైలము, ఆవునెయ్యి మొదలైన వాటితో మూలా నక్షత్రము శుక్రవారము నాడు సరస్వతీ హోమము 7 రోజులు చేసి ఆ హోమ భస్మమును కుంకుమ రాళ్ళతో, సరస్వతీ ఆకుపొతి , పసరు, దిష్టిచెట్టు చూర్ణముతో మిశ్రమము చేయుట జరుగుతుంది.

## సర్వరక్షా చూర్ణం

నవగ్రహముల మూలికలు సమిధలను చూర్ణం చేసి తయారుచేసినది సర్వరక్షా చూర్ణం. అన్ని గ్రహముల బాధలు (కుజగ్రహ సంబంధిత బాధలు కూడా) తొలగిపోయి మంచి జరుగుతుంది.



# 2016-2017 లో తులారాశి ఫలితములు

| ఆదాయం - 11 | వ్యయం -14 | రాజ - 5 | అవ - 6 |
|---|---|---|---|

**చిత్త 3, 4 పాదములు, స్వాతి 1, 2, 3, 4 పాదములు, విశాఖ 1, 2, 3 పాదముల యందు పుట్టినవారు "రా, రి, రూ, రే, రో, త, తీ, తూ, తే" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు తులారాశికి చెందినవారు.**

# 2016-2017 సంవత్సర ఫలితములు

తులారాశివారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు గోచరిస్తున్నాయి. అనుకున్న పనులు నిదానంగా పూర్తి అవుతాయి. సంవత్సర ప్రథమార్థం కన్నా ద్వితీయార్థం బాగుంది. మీ శ్రమకు తగినటువంటి ఫలితాలు కొంతమేరకు మాత్రమే మీ చేతికి అందుతాయి. స్థిరచరాస్తులకు సంబంధించినటువంటి వివాదాలు సమసిపోతాయి. వృత్తి, ఉద్యోగంలో ఒడిదుడుకులు, బంధువులతో విభేదాలు సంభవిస్తాయి. ప్రేమపెళ్ళికి సంబంధించిన వ్యవహారాలు వివాదాస్పదమవుతాయి. మహోన్నతమైన వ్యక్తులతో మీకు ఏర్పడిన సాన్నిహిత్యం, స్నేహం మీకు ఊరటను కలిగిస్తాయి. ఎలాంటి వర్గవిచక్షణలు లేక అందరినీ కలుపుకుని ఐకమత్యంతో కొన్ని విజయాలు సాధిస్తారు. అందులో రాజకీయపరమైన విషయాలు కూడా ఉంటాయి. స్త్రీల సహాయ, సహకారాలు మీకు ఎంతగానో లాభిస్తాయి. క్రమశిక్షణాయుతమైన పద్ధతిలో పరిస్థితులను సక్రమంగా అంచనా వేసి ఆచితూచి నిర్ణయాలు తీసుకుంటారు. నిదానంగా అనుకున్న ఫలితాలు వస్తాయి. మితిమీరిన ఆత్మవిశ్వాసాన్ని ప్రక్కనబెట్టి వాస్తవ విషయాలు బేరీజు వేసుకుని దాని కనుగుణంగా నిర్ణయాలు తీసుకుంటారు. సంవత్సర ప్రథమార్థంలో కాలం కొంత కఠినంగా ఉన్నా నిర్భయంగా మీ కార్యక్రమాలను ఫలితాలు ఆశించకుండా చేసుకుని పోవడమే చెప్పదగిన సూచన. విద్యాసంబంధమైన వ్యవహారాలు, సాంకేతిక విద్యకు సంబంధించిన అంశాలు ఉన్నత విద్యాభ్యాసము, ప్రతిష్టాత్మకమైన సంస్థలలో సీటు సంపాదించడం, ఐ.ఐ.టి., ఎం.బి.బి.ఎస్ మొదలైనవి లాభిస్తాయి. జనరల్ నాలెడ్జ్‌ని మరింత అభివృద్ధి చేసుకునే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగం కోసం రాసే పరీక్షలు, విదేశాలలో చదువుకోవడానికి రాసే పరీక్షలు ఫలిస్తాయి. విదేశీయాన ప్రయాణాలు కూడా అనుకూలంగా ఉంటాయి. విదేశాలలో ఉద్యోగ ప్రయత్నాలు చేసుకునేవారికి ప్రయత్నాలు ఫలిస్తాయి. స్వగృహ యోగ్యత ఏర్పడుతుంది, నూతన వాహనాన్ని కొనుగోలు చేస్తారు. వృత్తి, ఉద్యోగాల పరంగా అదనపు బాధ్యతలు రెండు నెలలు అధికంగా ఇబ్బంది పెడతాయి, సమాజంలో పేరు ప్రఖ్యాతులు లభిస్తాయి. నరఘోష కూడా అధికంగా ఉంటుంది. కార్యాలయంలో మీపై నిష్కారణంగా దుష్ప్రచారం చేసే వారికి బదిలీ అవుతుంది. ఇందువల్ల మీకు ఊరట లభిస్తుంది. కళా, సాహిత్య వైద్యరంగాలలోని వారికి కాలం అనుకూలంగా ఉంది. సాంకేతిక రంగంలోని వారికి

ఒడిదుడుకులు సూచిస్తున్నాయి. నమ్మి కొంత మందికి పనులు అప్పగించటం వలన చేదు అనుభవాలు ఎదురవుతాయి. ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో అయోమయ పరిస్థితి ఏర్పడుతుంది. మీరు పెంచి పోషించిన వ్యక్తులే కీలక సమయంలో మీ అభివృద్ధికి ఆటంకం అవుతారు. స్వంత మనుషుల సేవలను కూడా డబ్బులు ఇచ్చి కొనుక్కోవలసిన దుస్థితి ఏర్పడుతుంది. మానవ సంబంధాలలో ఎక్కడా అపేక్షలు, ఆప్యాయతలు కనిపించవు. అన్నీ ఆర్థిక సంబంధాలే, అన్నీ వాణిజ్య సంబంధాలే అన్న భావన ఏర్పడుతుంది. వివాహాది శుభకార్యాలు ముడిపడతాయి, శుభకార్యాలు, ఘనంగా నిర్వహించడం కోసం ఋణాలు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అయితే ముఖ్యమైన బాధ్యతలు తీర్చగలిగామనే సంతృప్తి ఎక్కువ సంతోషాన్ని కలిగిస్తుంది. ప్రభుత్వ అధికారుల వల్ల చిక్కులు రావచ్చు. జాగ్రత్త వహించండి. జమా ఖర్చుల వివరాలు అందుకు సంబంధించిన పుస్తకాలు భద్రపరచండి. సంతాన పురోగతి బాగుంటుంది. అయితే వాళ్ళు మొండిగా వ్యవహరిస్తూ స్వంత నిర్ణయాలు తీసుకోవడం బాధ కలిగిస్తుంది. ఆధ్యాత్మిక గ్రంథ పఠనం అలవాటు చేసుకుంటారు, మానసిక ప్రశాంతతను ఏర్పరచుకుంటారు. ఇక ఆర్థిక పనుల విషయాలలో వంద రూపాయలు ఖర్చుపెట్టవలసిన చోట వెయ్యి రూపాయలు ఖర్చు పెట్టవలసివస్తుంది. దుబారా ఖర్చులు అధికం అవుతాయి. మీరు ఖర్చు పెట్టె ధనంలో సగం మాత్రమే సద్వినియోగం అవుతుంది. వృత్తి, ఉద్యోగాల పరంగా దూరప్రాంతాలలో అవకాశాలు కలసివస్తాయి. అయితే కొత్త కొత్త ప్రయోగాలు చేయడం ఇష్టంలేక ఉన్నచోట ఉండడం మేలని నిశ్చయించుకుంటారు. ఏనాడో సమసి పోయినటువంటి ఒక వివాదం మళ్ళీ తెరమీదకు వస్తుంది. న్యాయస్థానాన్ని ఆశ్రయించవలసిన పరిస్థితి మళ్ళీ ఏర్పడుతుంది. సంవత్సర ద్వితీయార్థం నుండి ఆర్థిక స్థితి కొంతమేర చక్కబడుతుంది. విలువ పెరిగిన స్థిరాస్థులను అమ్మకూడదని నిర్ణయించుకుంటారు. కొంతమందికి వంశపారంపర్య ఆస్తులు కలసి వస్తాయి. లక్కీ డ్రాలు, చిట్టీలు, ఫైనాన్స్ స్కీమ్స్‌ల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. మధ్య వర్తి సంతకాలు చేయవద్దు, మధ్యవర్తిగా ఉండవద్దు. రాయబారాలు, రాజీయత్నాలు, మధ్యవర్తిత్వాలు, పంచాయితీలు వాటికి దూరంగా ఉండడం చెప్పదగిన సూచన. మీ ప్రమేయం లేకుండా కొన్ని పనులు, ప్రకటనలు చేసి అవి మీ మీదకు వచ్చే విధంగా ప్రచారం చేయడం జరుగుతుంది. ఇలాంటి వ్యక్తుల కూటమికి దూరంగా ఉండడం మంచిది. ఆదర్శవంతమైన మనస్సుతో ఎంతో శ్రమించి ఒక పునర్వివాహం జరగడానికి కారణం అవుతారు. మీరు చేసే శ్రమ ఎండమావిగా ఊరిస్తూ ఉంటుంది. స్వాతి చినుకూ కోసం వేచి ఉన్నట్లు బంగారు భవిత కోసం నిరీక్షించవలసి వస్తుంది. అయితే ఈ నిరీక్షణ ఎంత కాలం అనేది మీ మేధస్సుకు అందని శేషప్రశ్నగా మిగులుతుంది. దైవం మీద భారం వేసి మచ్చలేని మనిషిగా మనుగడ సాగించాలని నిశ్చయించుకుంటారు. ఇతరులకు సంబంధించిన కొన్ని డాక్యుమెంట్స్‌ను మీరు భద్ర పరచవలసి ఉంటుంది. నూతన బాధ్యతలు స్వీకరిస్తారు, వాటిని సక్రమంగా నిర్వర్తించడానికి పాత సమస్యలను పరిష్కరించవలసిన అనవసర శ్రమ మీపై పడుతుంది. వ్యాపారంలో లాభాలు మెరుగ్గా ఉంటాయి. రాజకీయంగా, సామాజికంగా, సామూహికంగా జరిగే కొన్ని మార్పులు మీపై పరోక్ష ప్రభావాన్ని చూపిస్తాయి. మీ సన్నిహితవర్గం చేసిన పొరపాట్లకు మీరు బాధ్యులు కావాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. మీడియా, ప్రచార సాధనాల వల్ల ఇబ్బందులు వస్తాయి. మీకు కొండంత ధైర్యం ఉందని రుజువు అవుతుంది. మీ మాటలకు, ప్రకటనలకు తప్పుడు భాష్యాలు చెప్పి ప్రయోజనాలు పొందడానికి మీ వైరివర్గం కుట్ర చేస్తుంది.

మీపై అపార్థాలు, ఆరోపణలు కొంత కాలం నడుస్తాయి. దాని వల్ల చెప్పుకోదగిన నష్టం జరగక ముందే జాగ్రత్త పడతారు. మిత్రభేదం వలన ప్రయోజనం పొందుతారు. మీ వైరివర్గంలో ఐకమత్యం లేకపోవడం మీకు ఎంతగానో లాభిస్తుంది. అందువల్ల చాలా పనులు సునాయాసంగా చేసుకుపోగలుగుతారు. ఇతరులు తమ నిర్ణయాలు ప్రకటించక ముందే వాతావరణాన్ని పరిశీలించుకుని సందర్భాను సారంగా మీరే ఒక ప్రకటన చేయండి మేలు జరుగుతుంది. రహస్య సమాచార వ్యవస్థ ఎంత పటిష్టంగా ఉంటే మీరు అంత ప్రయోజనాలు పొందగలుగుతారు. రహస్య సమాచారాన్ని ఇతరులకు చేరవలసిన వ్యక్తులని గుర్తించగలుగుతారు, వాళ్ళని చాలా దూరంగా ఉంచుతారు. మీరు ఇతరులపై అతిగా ఆధారపడుతున్నారనే భావన ఎవరికి రానీయవద్దు. ఊహాజనితమైన విషయాలకు ప్రాముఖ్యతనివ్వవద్దు. శక్తిసామర్థ్యాలు లేని సోమరిపోతులైన స్నేహితుల కొరకు ఏమాత్రం ధైర్యం చేయలేని వాళ్ళకు, కొన్ని నిర్ణయాలు చేయలేనివాళ్ళకు మీరు ఒక పెద్దదిక్కు అవుతారు. ఉత్తరప్రత్యుత్తరాలు, ఖండనలు, ప్రకటనలు ఏ సమయంలో పడితే ఆ సమయంలో ప్రయాణాలు, విందులు, వినోదాలు మీ విలువైనటువంటి కాలాన్ని హరిస్తాయి, మీ వ్యక్తిగత ప్రతిష్ఠ మీద ప్రభావం చూపిస్తాయి. సమయం వచ్చినప్పుడు మీకు ద్రోహం చేయడానికి ఒక వర్గం ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటుంది. వాళ్ళ చర్యలను గమనించడం, తగిన జాగ్రత్తలు తీసుకోవడం కష్టతరమవుతుంది. ప్రభుత్వపరంగా రావాల్సిన బిల్లులు ఆలస్యంగా చేతికి అందుతాయి. భాగస్వామ్య వ్యాపారంలో జరుగుతున్న దుబారా, ఇతర భాగస్వాములు వ్యక్తిగత ఖర్చులు ఇవన్నీ మీ దృష్టికి వస్తాయి. ఇన్ని రోజులు నేను నమ్మినది వీళ్ళనా అని బాధపడతారు. మీ తెలివి తక్కువతనానికి చింతిస్తారు. సందర్భోచితమైన నిర్ణయాలు తీసుకుంటారు. ఇతరులను వెళ్ళగొట్టడం కంటే మనమే వాళ్ళను వదిలి వెళ్ళటం మంచిదని నిర్ణయించుకుంటారు. మీ గుడ్‌విల్‌తో నూతన వ్యాపారాన్ని ప్రారంభిస్తారు. జ్యేష్ఠ సంతానానికి సంబంధించిన సమస్యలు తీరిపోతాయి, రాజకీయ పదవి లభిస్తుంది. ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు బాగుంటాయి. వృత్తి, ఉద్యోగాలపరంగా మీ నిపుణతకు సంబంధించి ప్రభుత్వ ప్రశంసలు అందుకుంటారు. పెద్దలు, వృద్ధులు, తల్లిదండ్రులు వాళ్ళ మనస్తత్వాలను, అభిప్రాయాలను గమనించి మసలుకుంటారు, అవసరాలు తీరాక పెద్దలను నిర్లక్ష్యం చేయలేదన్న మంచి పేరును నిలబెట్టుకుంటారు. సంతాన పురోగాభివృద్ధికిగాను మీ ఆత్మసాక్షికి విరుద్ధంగా మీ పరపతిని, ధనాన్ని వినియోగిస్తారు. సభలు, సమావేశాలు నిర్వహించడంలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. ఓ అపూర్వమైన ఫంక్షన్‌కు మీకు ప్రత్యేక ఆహ్వానం అందుతుంది. ఆధ్యాత్మిక ఆచారాలను శ్రద్ధగా చేస్తారు. పొదుపుపైన దృష్టి సారిస్తారు, అయితే ఎంతగా ప్రయత్నించినప్పటికీ పొదుపు పథకాలకు గండి పడుతూనే ఉంటుంది. తోటల పెంపకం వలన లాభపడతారు. ప్రభుత్వపరమైన నూతన స్కీమ్స్‌ను అమలుచేస్తారు, అందుకు సంబంధించి రావాల్సిన ప్రభుత్వపరమైన సబ్సిడీలను పెద్దమొత్తంలో అందుకుంటారు. మీపై ఆధారపడినవారి ప్రయోజనాలను కాపాడటానికి మీ సిద్ధాంతాలకు విరుద్ధంగా అభిప్రాయాలను మార్చుకుంటారు. ఒకటికి మించి వ్యాపారాలు చేయాలనుకునే మీ ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. ఫర్నీచర్స్, ఫాస్ట్‌ఫుడ్స్, హాస్టల్స్, బేకరీల వ్యాపారాలు బాగుంటాయి. సినిమా, టీవి రంగంలోని వారికి నూతన అవకాశాలు కలిసివస్తాయి. వివాదాలు ముదిరి పాకాన పడటానికి ముందే ఆదిలోనే పరిష్కరించుకుంటారు. తాత్కాలిక ప్రయోజనాలే తప్ప దీర్ఘకాలిక ప్రయోజనాలను పట్టించుకొనక ఇంట్లో వాళ్ళు పెట్టే

పోరు తీవ్రమైన కోపానికి కారణం అవుతుంది. మోకాళ్ళనొప్పులు, కీళ్ళనొప్పులు, పాదాలు వెన్నెముక నొప్పులు బాధిస్తాయి. జీర్ణకోశ సంబంధమైన సమస్యలు తలెత్తుతాయి. ఆహార, ఆరోగ్య నియమాలను పాటించండి. అరుగుదల తక్కువగా ఉంటుంది. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. ఇష్టదైవాన్ని దర్శించుకున్నామన్న సంతృప్తి కలుగుతుంది. సాఫ్ట్‌వేర్ రంగంలోని వారికి బాగుంది. ఈ తులారాశివారు ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయాలి, అఘోర పాశుపత హోమం చేయాలి. ఈ రాశి విద్యార్థినీ విద్యార్థులు మెరిట్ మార్కులను సాధిస్తారు. నిత్యం సరస్వతి తిలకాన్ని ధరించడం, జ్ఞానచూర్ణాన్ని సేవించడం చెప్పదగిన సూచన. మంచి పనులకు, మంచి కార్యక్రమాలకు పురోగమనానికి సంబంధించిన విషయాలలో కుటుంబంలో ఆత్మీయుల సహకారం అంతగా లభించదు. ముఖ్యమైన కార్యక్రమాలకి పెద్ద ఎత్తున ఋణాలు చేస్తారు. బ్యాంకు ఋణాలు కూడా లభిస్తాయి. పెట్టుబడి పెట్టి భాగస్వాములుగా చేరుతామన్న వారు మాట నిలబెట్టుకోలేరు. దాంతో భారం అంతా మీపై పడుతుంది. ధైర్యం చేసి కార్యక్రమాలను ఒంటరిగా ముందుకు తీసుకువెళ్ళే ప్రయత్నాలు చేసి ఘనవిజయం సాధిస్తారు. ఉద్యోగ అవకాశాలకన్నా వ్యాపారాల వైపే మొగ్గ చూపిస్తారు. తోడబుట్టిన వాళ్ళు, రక్తసంబంధీకులు కొంతమేర సహాయపడతారు. మొండి మనుషులలో మార్పు తీసుకురావాలని మీరు చేసే ప్రయత్నాలు వ్యర్థం అవుతాయి. మగపిల్లల పెళ్ళి విషయం పెనుసమస్యగా మారుతుంది. కొంతమంది వ్యక్తులతో దీర్ఘకాలికంగా ఉన్న విద్వేషాన్ని రూపుమాపుకుంటారు. పోరాటం చేసినా ఫలితం దక్కనప్పుడు ఇదే ఉత్తమమైన మార్గం అని భావిస్తారు. తగాదాలకు, వివాదాలకు దూరంగా ఉండాలని మీరు ప్రయత్నించినా ప్రయోజనం ఉండదు. ఉపయోగంలేని విషయాలను పట్టుకుని సాగదీయవద్దు, దానివల్ల ప్రయోజనం లేదు. ఇతరులకు సలహాలు ఇవ్వడం వలన విరోధులు అవుతారు, వాళ్ళకి లేని శ్రద్ధ మీకు అనవసరం, ప్రతి వాళ్ళకి అడగకుండా సలహాలు చెప్పి విసిగిపోతారు. ఇలాంటి విషయాలలో మీ పద్ధతులు మార్చుకోరు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటారు, యోగా, మెడిటెషన్ వైపు దృష్టిసారిస్తారు. ఇదే మీకు మేలు చేస్తుంది. విలాసవంతమైన జీవితానికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. ఊహలు, అపోహలు వీడి నిజ జీవితంలో వాస్తవాలు తెలుసుకోవడమే చెప్పదగిన సూచన. వాయిదా పద్ధతులలో కొన్ని కొనుగోలు చేస్తారు. మొండి బకాయిలు వసూలు అవుతాయి. మీరు ఇచ్చిన చెక్కులు బౌన్స్ అవడం వివాదాస్పదం అవుతుంది. సంతానం వలన ధన నష్టం కలుగుతుంది. విలువైన వస్తువుల భద్రతా విషయంలో జాగ్రత్త వహించండి. దొంగలు ఇంట్లోనే పొంచి ఉన్నారని గ్రహించండి. దొంగస్వామీజీల మాటలు విని నష్టపోతారు. ఇన్‌కం ట్యాక్స్ అధికారుల వల్ల, కమర్షియల్ ట్యాక్స్ అధికారుల వల్ల, అవినీతి నిరోధక శాఖ అధికారుల వల్ల కొన్ని ఇబ్బందులు వస్తాయి, వాటిని తేలికగా అధిగమించగలుగుతారు. లీజులు పొడిగించబడతాయి, కొత్త అగ్రిమెంట్లు లాభదాయకంగా ఉంటాయి. ఫిక్స్‌డ్ డిపాజిట్స్‌ను ఉపసంహరించి స్థిరాస్థులను కొనుగోలు చేస్తారు. చెల్లించిన బిల్లులను తిరిగి చెల్లించాలని ఒత్తిడి వస్తుంది, మీరు సొమ్ము కట్టినట్లు ఋజువులు చూపించి నష్టపోకుండా బయటపడతారు. స్నేహితుల అసమర్థతవల్ల తొందరపాటుతనం వల్ల మీకు రావాల్సిన ప్రయోజనాలు దెబ్బతింటాయి, ఇతరులను నమ్మి ఏ పనీ అప్పజెప్పకూడదని, అన్నీ స్వయంగా పరిశీలించుకోవాలని నిర్ణయించుకుంటారు. పిల్లల భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని కొన్ని మంచి నిర్ణయాలు తీసుకుంటారు. కొంత మంది విషయంలో వాలెంటరీ రిటైర్మెంట్ తీసుకోవాలనే

ఆలోచనలు కొనసాగుతాయి. దుష్ప్రచారాలు, వైరివర్గాన్ని ఏమాత్రం పట్టించుకోకుండా మీ పని మీరు చేసుకుపోవడం వలన మంచి ఫలితాలను అందుకుంటారు. సభలు, సమావేశాలకు, బుక్స్ ఎగ్జిబిషన్‌లకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు. యాంకరింగ్ రంగంలో రాణిస్తారు. బహిరంగ సభలలో మీ ఉపన్యాసాలకు మంచి పేరు, గుర్తింపు వస్తుంది. చెప్పుడు మాటలు వినడం వలన నష్టపోవడం తప్ప ఏమాత్రం లాభం ఉండదు. ఈ విషయాన్ని గ్రహించండి. దురుసుగా మాట్లాడి అయిన వాళ్ళను దూరం చేసుకోకండి. ఆటోమొబైల్స్ వ్యాపారంలో అదృష్టం కలసి వస్తుంది. శాశ్వతంగా విడిపోదామని భావించిన కొందరు దంపతులకు చట్టపరంగా విడిపోయే అవకాశం లభిస్తుంది. ప్రేమపెళ్ళిళ్ళు, పునర్వివాహాలు చికాకు కలిగిస్తాయి, అశాంతికి కారణాలు అవుతాయి. విదేశాలలో స్థిరచరాస్తులు కొనుగోలు చేస్తారు. చరిత్ర గురించి, పురావస్తు విషయాల గురించి తెలుసుకోవాలని ఎంతగానో తాపత్రయపడతారు. నిరుద్యోగులైన విద్యావంతులకు ఈ సంవత్సరం ఉద్యోగం వస్తుంది. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. కాల్ లెటర్స్ వల్ల ఉద్యోగాలు వస్తాయిగాని ఉద్యోగపరంగా తృప్తి ఉండదు. కొంత కాలం ఉద్యోగం మానివేసి వ్యాపారం చేస్తారు. ఆ వ్యాపారం మానేసి తిరిగి ఉద్యోగం చేయాలని నిర్ణయించుకుంటారు. సంవత్సర ద్వితీయార్థంలో ఆదాయం పెరుగుతుంది. వెనుదిరిగిన కెరటం ఉవ్వెత్తున ఎగిసిపడినట్లు మీరు వెనకడుగు వేస్తారని భావించిన మీ శత్రువర్గంపై విరుచుకుపడతారు. కాలం కలిసివస్తే ఏదైనా చేయవచ్చు అనేది వారికి ఎత్తి చూపిస్తారు. తుపాను ముందు ప్రశాంతతను చూసి మురిసిపోయిన వైరివర్గానికి తగిన గుణపాఠం చెప్పడంలో మీరు కృతకృత్యులవుతారు. కొన్ని విషయాలలో ఏకాగ్రత లోపిస్తుంది. ఫ్యాషన్ డిజైనింగ్‌లో రాణిస్తారు. గ్రంథ రచన చేయాలని సంకల్పిస్తారు. లిటిగేషన్ వ్యవహారాలు ఓ కొలిక్కివస్తాయి. భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని ఇప్పటినుండే లొంగిపోవడం, ఇతరులు చేసిన ప్రతిదానికి తల ఊపడం మీకు చేతగాదని తేల్చిపారేస్తారు. దైవానుగ్రహం ఉంటే ధైర్యం నా వైపే ఉంటే నాకే విచారంలేదు నేను ధర్మాన్ని, న్యాయాన్ని నమ్ముకున్నాను, పనికిరానివాళ్ళ సహాయం అక్కరలేదని తెగతెంపులు చేసుకుంటారు. కొన్ని ప్రయోజనాలను వదులుకుంటారు, బెదిరింపులకు లొంగరు, భగవంతుడిని కోరికలు అడిగే పద్ధతికి స్వస్తి చెబుతారు. ఆధ్యాత్మిక కార్యక్రమాల సారాంశం కోరికలను చంపుకోవడమే అన్న కొత్త సూత్రాన్ని అవలంభిస్తారు. మీరు అడిగే ప్రశ్నలకు మీ భాగస్వాముల దగ్గర సమాధానం ఉండదు. మోసానికి సాక్ష్యం మౌనమే అని అర్థం అవుతుంది. అవసరమైన జాగ్రత్తలు తీసుకుంటారు. కొంతమందికి ఉద్వాసన చెబుతారు. ఆఖరి క్షణంలో ఉద్యోగ బదిలీ వేటు తప్పుతుంది. గతంలో కొనుగోలు చేసిన పొలాలను అమ్మాలని మీపై ఒత్తిడి పెరుగుతుంది. ఉన్న ఆస్తులను అమ్మకూడదని నిశ్చయించు కుంటారు, మీ నిర్ణయాలను కుటుంబ సభ్యులను స్పష్టంగా తెలియజేస్తారు. చెప్పుడు మాటలు మీ కుటుంబసభ్యులపై తీవ్ర ప్రభావం చూపడం మీకు సమస్యగా మారుతుంది. గతంలోకంటే భిన్నంగా ఉన్న మీ ప్రవర్తన, ఆలోచనా విధానం మంచి ఫలితాలకు దారితీస్తుంది. ప్రతినిత్యం అష్టమూలికాతైలంతో దీపారాధన చేయండి, సిద్ధ గ్రంథాన్ని ధరించండి. 'దైవికం' అనే ధూపం వలన, పొగవేయటం వలన దుష్ట శక్తులకు దూరంగా ఉంటారు. కార్యాలయంలో ఆధిపత్య పోరు అధికం అవుతుంది, కొంతమంది ప్రవర్తన అభ్యంతరకరంగా ఉన్నా, ఇష్టం లేకపోయినా భరించాల్సి వస్తుంది. సమయం కోసం నిరీక్షిస్తారు ఒక గ్రూపును విడదీసి కొంతమంది వ్యక్తులను మీవైపు తిప్పుకుంటారు. చిన్ననాటి స్నేహితుల కలయిక ఆనందాన్ని

కలిగిస్తుంది. మీరు అభిమానించిన వ్యక్తులు ఇబ్బందులలో పడటం బాధిస్తుంది, వారికీ రహస్యంగా, పరోక్షంగా సహాయపడతారు. మాటమీద నిలబడే వ్యక్తిగా మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. అయితే మీకు మాట ఇచ్చినవారు మాత్రం వాయిదాలతో కాలక్షేపం చేస్తారు. స్వయంకృతాపరాధనలు, పొరపాటు నిర్ణయాలు తీసుకోకుండా జాగ్రత్త వహించండి. గ్రహణ జాగ్రత్తలు తప్పక పాటించండి. నిత్యం సర్పదోష నివారణ చూర్ణంతో, సర్వరక్షా చూర్ణంతో కలిపి స్నానమాచరించండి. గతించిన ఆత్మీయుల జ్ఞాపకాలు ఎంతగానో బాధిస్తాయి. అంతరంగవర్గంలో విభేదాలు, వృత్తి, ఉద్యోగాలలో ఇబ్బందికరమైన పరిస్థితి కొంతకాలం ఇబ్బంది పెడుతుంది. ఏదో ఒక వర్గానికి కాపు కాయాల్సిన స్థితి నుండి తప్పుకుంటారు. రెండు పడవలలో ప్రయాణం చేయడం శ్రేయస్కరం. కాదని తెలిసినా ఇరువర్గాలతో సఖ్యతగా ఉంటారు. కోర్టు వెలుపల మధ్యవర్తి ద్వారా పరిష్కారానికి ఓ వర్గం మిమ్ములను ఆశ్రయిస్తుంది, చట్టమా? లేక నైతిక ధర్మమా? వీటిలో ఏ నిర్ణయం తీసుకోవాలి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. చివరికి నైతిక ధర్మానికి, స్నేహానికి ప్రాధాన్యతనివ్వాలని నిర్ణయించు కుంటారు. క్లిష్టమైన సమయంలో సంతానం ఆర్థికంగా కుటుంబానికి అండగా నిలుస్తారు. మీ సామర్థ్యం, మీ శ్రమ, శక్తియుక్తులు మాత్రమే ఈ సమాజానికి, సహచరులకు అవసరం. మీ బాగోగులు మాత్రం ఎవరికీ అక్కరలేదు, పట్టించుకోరు. జీవిత భాగస్వామితో వీలైనంతగా సర్దుకు పోవడం మంచిది. నిదానంగా విషయాలను అర్థమయ్యేలా విడమరిచి చెప్పి మార్పుకోసం ప్రయత్నించండి. ఏ విషయంలోనైనా తప్పులు పోకుండా, కృషిలో లోపం లేకుండా చూసుకోండి, ఫలితాల కోసం, ప్రశంసల కోసం ఎదురు చూడవద్దు. ఇతర భాషలను నేర్చుకోవాలనుకునే మీ కోరిక కార్యరూపం దాలుస్తుంది. స్వంత వాళ్ళకు బరువు కాకూడదన్న భావన కలుగుతుంది, కొంతమందికి అవకాశాలు చేతిదాకా వచ్చి చేజారిపోతాయి. ముఖ్యంగా ఉద్యోగ, వివాహాల విషయంలో ఇలా జరుగుతుంది. ఆధునిక పోకడలపైన ఆకర్షితులైనా, సాంప్రదాయ కార్య క్రమాలను విస్మరించరు. బయట మీకు ఎదురవుతున్న అనుభవాలను ఇంట్లో వాళ్ళకి సంపూర్ణంగా చెప్పరు. ఆశించిన లాభాలు మీ చేతికి అందుతున్న వేళ దుష్ట పన్నాగంతో కొంత మంది మీకు సన్నిహితంగా మెలుగుతారు, జాగ్రత్త వహించండి. సాహసోపేతమైన నిర్ణయాలు అన్నివేళలా లాభించవు. సమాజంలో బాగా వ్యాపించిన అవినీతి వల్ల మీరు వ్యక్తిగతంగా ఇబ్బంది పడతారు. మీ పోటీవర్గం అవినీతిపరులను సంతృప్తిపరిచి మీకు రావాల్సిన, చెంద వలసిన ప్రయోజనాలకు గండి కొడతారు. విలువైన వస్తువులు అని భావించి మీరు కొన్న ఆధ్యాత్మిక వస్తువులు అంతగా విలువ చేయవని గ్రహిస్తారు. మోసపోయామని ఆలస్యంగా తెలుసుకుంటారు, ఎప్పటికైనా ఉపయోగపడుతుందని భావించి కొనుగోలు చేసిన స్థలం అమ్ముడుపోక ఇబ్బంది పడతారు. ఉద్యోగంలో అదనపు బాధ్యతలు అప్పగించబడతాయి. ఆ బాధ్యతలు సక్రమంగా నిర్వహించి కార్యాలయానికి మేలు చేకూరుస్తారు. అయితే అందుకు సంబంధించి ఏ మాత్రం ఆర్థిక ప్రయోజనం ఉండదు, ఆదరణ కూడా లభించదు. చదువులు, క్రీడలు, కళాసాహిత్య రంగాలకు సంబంధించి మీరు చేసే దూరప్రయాణాలు ఫలిస్తాయి. నిత్యం ఓం నమో నారాయణాయ వత్తులతో దీపారాధన చేయండి. మీమీద ఉన్న నమ్మకాన్ని, గుడ్‌విల్‌ను రుజువు చేసుకుంటారు. శ్రమ విభజన సక్రమంగా చేస్తారు. ఇతరుల శక్తిసామర్థ్యాలను మీకు అనుకూలంగా మార్చుకోగలుగుతారు. సహచరులు, మిత్రులు వారికి ఇబ్బంది లేనప్పటివరకు మీకు సహకరిస్తారు. మీ స్థాయివారితో బంధుత్వం కలుస్తుంది. పెద్దగా

కృషి చేయకపోయినా ఓ వ్యక్తికి మీ లాభాలలో, గౌరవాలలో భాగం ఇస్తారు. దానికి కారణం గతంలో తీసుకున్న తొందరపాటు నిర్ణయాలే. మీరు చెప్పే మంచి మాటలు స్త్రీలకు నచ్చవు, స్వయంగా వాహనం నడుపుట వీలైనంతగా తగ్గించండి. కాలం కలిసి రానప్పుడు చక్రవర్తులే అరణ్యవాసం చేశారు, యాచించారు. మీ పట్ల దుర్మార్గంగా ప్రవర్తించిన వారిలో వచ్చిన ఆకస్మిక మార్పులు మిమ్ములను ఆశ్చర్యానికి గురిచేస్తాయి. మీ సహాయం కొరకు లేని అభిమానాన్ని ఒలకబోస్తున్నారని గ్రహించండి. ఈ సారి అర్హత గలిగిన వారికి సహాయం చేయండి, పొగడ్తలకు, కట్టుకథలకు ప్రాధాన్యతనిచ్చే పద్ధతులు మార్చుకోండి. దూరప్రాంతంలో ఉన్న ఆత్మీయులకు ఆర్థిక సహాయం చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. శుక్ర మౌఢ్యమి ఏర్పడినప్పుడు తగిన జాగ్రత్తలు తీసుకోండి. గనులు, ఇసుక, ఇటుకలు, గృహనిర్మాణ వస్తువులు వ్యాపారాలు బాగుంటాయి. రియల్ ఎస్టేట్ వ్యాపార పరంగా గతంలో తీసుకున్న నిర్ణయాల వల్ల కొన్ని చిక్కులు వస్తాయి. చట్టవిరుద్ధమైన పనులు చేసిన సన్నిహితులకు, స్నేహితులకు అండగా నిలువవద్దు, మీరు బాధ్యత వహించ వద్దు. స్నేహధర్మం నిరూపించుకోవడానికి ఇది సక్రమమైన మార్గం కాదు. స్నేహాల వల్ల పిల్లలు వక్రమార్గం పట్టకుండా జాగ్రత్త వహించండి. విదేశాలలో ఉన్న వారికి ఆదేశంలో శాశ్వతంగా నివశించడానికి అనుమతులు వస్తాయి. ఎంతోకాలంగా పెండింగ్‌లో ఉన్న పనిని పూర్తి చేసుకోవడానికి అధికారులను, రాజకీయ నాయకులను ఆశ్రయిస్తారు. అయినా పనేమీ జరగదు. అధికార పత్రాలు చేతికి అందవు, చిట్టచివరికి లంచాలు ఇవ్వడం వలన ఆ పని సానుకూల పడుతుంది. ఏకాదశంలో సంచరించు గురురాహువుల ప్రభావం, ద్వితీయార్థంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, పంచమంలో సంచరించు కేతుగ్రహ ప్రభావం, రవిచంద్ర గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. అర్ధరాత్రిపూట చేసే ఆలోచనలు కలిసివస్తాయి. గుర్రాన్ని తొట్టెదాకా తీసుకువెళ్ళడం కుదురుతుంది, కాని దానితో నీళ్ళను తాగించడం మనవల్ల కాదని గ్రహిస్తారు. పెట్టుబడి పెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు, ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

**స్త్రీలకు ప్రత్యేకం**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు సాధారణ ఫలితాలు గోచరిస్తున్నాయి. ఆరోగ్యపరమైన విషయాలలో ప్రత్యేకమైన శ్రద్ధ అవసరం, దీర్ఘకాలిక వ్యాధులు కలిగినవారు జాగ్రత్త వహించాల్సిన కాలం. కీళ్ళ నొప్పులు బాధిస్తాయి. సంతానానికి సంబంధించిన కొన్ని విషయాలు ఇబ్బందులు కలిగిస్తాయి. వాళ్ళను సరైన దారిలో పెట్టడానికి యావత్తు శక్తి ఉపయోగించవలసి వస్తుంది, అయినప్పటికి ఆశించిన ఫలితాలు రావు. పిల్లల మొండి వైఖరి చెప్పుకోదగిన స్థాయిలో ఇబ్బంది పెడుతుంది. సమిష్టిగా చేసే వ్యాపారంలో లాభం వస్తుంది. అలంకార సంబంధమైన వ్యాపార విషయాలలో మీ నూతన ప్రయోగాలు సత్ఫలితాలను ఇస్తాయి. జీవితంలో ఆర్థిక పరిపుష్టి సాధించడానికి, సొంతకాళ్ళ మీద నిలబడటానికి విశేషంగా శ్రమిస్తారు, అనుకూల ఫలితాలు సాధిస్తారు. ప్రతికూల వాతావరణంలో కూడా సామాజిక పరిస్థితులు సాధిస్తారు. ప్రతికూల వాతావరణంలో కూడా సామాజిక పరిస్థితులు వ్యతిరేకంగా ఉన్నా మంచి ఉద్యోగాన్ని సాధిస్తారు. ఇప్పటివరకు మిమ్ములను చులకన భావంతో చూసినవారు ఉద్యోగం రాగానే భజనపరులుగా మారతారు. వాళ్ళ స్వార్థ ప్రయోజనాలను పరిరక్షించుకోవడానికి ఆర్థికపరమైన ప్రయోజనాలు పొందడానికి శతవిధాలా ప్రయత్నిస్తారు. స్వప్రయోజనాల కోసం ఇంత నిర్లజ్జగా,

నిస్సిగ్గుగా ప్రవర్తించేవాళ్ళు ఉంటారని ఒక విధమైన దిగ్భ్రాంతికి లోనవుతారు. ఆశ్చర్యం, కాలం కఠినంగా నడుస్తున్నప్పుడు ఒక అదృష్ట కెరటంవల్ల అన్నీ సమిసిపోతాయి. పూలమొక్కల వ్యాపారాలు, పాలవ్యాపారం, చేతివృత్తి పనులు, గ్రూపుగా చేసే వ్యాపారాలు కలసివస్తాయి. ప్రభుత్వపరంగా ఎలాంటి ప్రోత్సాహం లభించదు. విద్యారంగంలో ఉన్నవారి శక్తిసామర్థ్యాలకు తగిన గుర్తింపు లభిస్తుంది. మీ సామర్థ్యంతో కొన్ని విద్యాసంస్థలు పురోగతిన నడుస్తాయి. మీ ఒక్కళ్ళ మీద సంస్థ పురోగతి ఆధారపడి ఉంటుంది. కంప్యూటర్ పరిజ్ఞానంతో నిపుణత సాధిస్తారు. ఎన్ని ఇబ్బందులు ఎదురైనప్పటికీ మొక్కవోని ధైర్యంతో మీ ప్రతిష్టను, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకో గలుగుతారు. మనస్సు మార్చుకొని సహోదర సహోదరీ వర్గానికి చేయూతనిస్తారు, దగ్గర ఉండి ప్రతి విషయంలో శ్రద్ధ చూపిస్తారు, మార్గదర్శకులు అవుతారు. మీ వ్యక్తిగత సౌఖ్యాలు మానుకుని నమ్ముకున్న వాళ్ళకు ఆర్థిక సాయం చేస్తారు. అనూహ్యమైన కొన్ని సంఘటనల వల్ల ఒక వ్యక్తి మీ జీవితంలో ప్రవేశించడం జరుగుతుంది. ఆ వ్యక్తిని ఆహ్వానించాలో, తిరస్కరించాలో తెలియనటు వంటి డోలాయమాన పరిస్థితులలో ఉండిపోతారు. వ్యక్తిగతమైన యిష్టాఇష్టాలకన్నా జీవితంలో మచ్చలేని మనిషిగా జీవించాలని నిర్ణయించుకుంటారు. అందుకు అనుగుణంగానే మీ జీవితంలో ఎవరికీ చోటు ఇవ్వరు. కారణాలు ఏమైనా ఓ వ్యక్తి మీ జీవితంలో విడిపోవడం జరుగుతుంది. కాలానికి, దైవానికి కొన్ని విషయాలు వదిలేసి చూస్తూ ఉంటారు. మీ హితవుకోరి పెద్దలు తీసుకున్న నిర్ణయాలు మీకు మేలు చేస్తాయి. వ్యాపారసంబంధమైన, విద్యాసంబంధమైన, బ్యాంకులోనులు, లభిస్తాయి. కొన్ని మొండిబాకీలు వసూలు అవుతాయి. అధిక వడ్డీల పీడను వదిలించుకోగలుగుతారు. ఫైనాన్స్ స్కీములు, చిట్టీలు, లక్కీడ్రాల వల్ల మోసపోతారు. ప్రతిరోజు, ప్రతి నిత్యం అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి, ఆరావళి కుంకుమతో శ్రీలక్ష్మీచందనంతో మహాలక్ష్మీదేవిని పూజించండి. స్పెక్యులేషన్స్‌కు షేర్ మార్కెట్లకు దూరంగా ఉండండి. విలువైన ఆభరణాలు ఏర్పడతాయి. వాయిదా పద్ధతులలో విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. సంతానంలేని వారికి సంతానప్రాప్తి, అవివాహితులకు వివాహప్రాప్తిగా చెప్పవచ్చు. పునర్వివాహాల గురించి ప్రయత్నించే వారికి ఇది అనుకూల కాలం. సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. ఆహార నియమాలు పాటించడం అవసరం, అరుగుదల ఇబ్బందిగా మారుతుంది. ఈ సంవత్సరం గ్రీన్ కార్డు లభిస్తుంది. విదేశీ వివాహం నిశ్చయం అయ్యే అవకాశం ఉంది. కనుక ఆ ప్రయత్నాలు చేసేవారికి ఇది విజయవంతమైన సంవత్సరం. ప్రతిరోజు, ప్రతినిత్యం 'దైవికం' అనే పొడితో ధూపం వేయండి, దుష్టశక్తులకు దూరంగా ఉండండి. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**
**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో వృశ్చికరాశి ఫలితములు

| ఆదాయం - 2 | వ్యయం - 8 | రాజ - 1 | అవ - 2 |
|---|---|---|---|

**విశాఖ 4వ పాదము, అనూరాధ, 1, 2, 3, 4 పాదములు, జ్యేష్ఠ 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "తో, నా, నీ, నూ, నే, నో, య, యా, యూ" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు వృశ్చికరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

వృశ్చికరాశి వారికి ఈ సంవత్సరం మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. అయినప్పటికీ ప్రధానమైన విషయాలు ముడిపడతాయి. దీర్ఘకాలిక సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. వ్యక్తిగత స్థాయిని పెంచుకోగలుగుతారు. కఠినమైన సవాళ్ళను, సమస్యలను ఒంటరిగా ఎదుర్కోవలసి వస్తుంది. అందరూ తోడుగా ఉన్నా ఒంటరిగా ఉన్నట్లుగానే అనిపిస్తుంది. ఆర్థిక, విద్యాపరమైన అంశాలు అనుకూలిస్తాయి. ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది. మీ సామర్థ్యానికి తగిన గుర్తింపు లభిస్తుంది. అయితే ఆశించిన జీతం రాదు. కుటుంబ పరమైన విషయాలలో దీర్ఘకాలిక సమస్యలు తొలగిపోతాయి, కొత్త సమస్యలు పుట్టుకు వస్తాయి. విదేశీయాన సంబంధ విషయాలు, విదేశాలలో చదువుకోవడానికి చేసే ప్రయత్నాలు, విదేశాలలో ఉద్యోగం కోసం చేసే ప్రయత్నాలు సంవత్సర ద్వితీయార్థంలో ఫలిస్తాయి. నూతన వ్యాపార ప్రారంభానికి బ్యాంకు ఋణాలు చేస్తారు, రాజకీయ పలుకుబడి ఉపయోగపడుతుంది, రాజకీయాలలో రాణిస్తారు. కఠినమైన లక్ష్యసాధనకు విశేషమైన కృషి చేస్తారు. అనువంశిక ఆస్థులు కలిసివస్తాయి. దీర్ఘకాలిక ప్రాణ మిత్రులతో విభేదాలు వస్తాయి. మీ సహోదర సహోదరీ వర్గం మీకు వ్యతిరేకంగా మీ తల్లిదండ్రుల వద్ద, పెద్దల వద్ద వ్యతిరేక ప్రచారం చేస్తారు. విదేశాలలో ఉన్నవారికి గ్రీన్‌కార్డు లభిస్తుంది. కోర్టు జోక్యం వల్ల ఉద్యోగానికి న్యాయం జరుగుతుంది. డబ్బులకు అమ్ముడుపోయే అధికారుల వద్ద పనిచేయడం మానుకూంటారు. కొంత మంది విషయంలో వాలెంటరీ రిటైర్మెంట్ వాయిదా పడుతుంది. కుటుంబ ఖర్చులు అధికం అవుతాయి. అసమర్థులైన అంతరంగిక స్నేహితవర్గాన్ని దూరంగా ఉంచుతారు. మీరు ఒక కీలక బాధ్యతలు నిర్వహిస్తున్న పదవిలో ఉన్నప్పుడు మీపై తప్పుడు ప్రచారాలు, అపనిందలు చోటు చేసుకుంటాయి. మీమీద పడిన బురదను వదుల్చుకునే యత్నం చేయరు, కాలానికి, దైవానికి వదిలేసి మిన్నకుంటారు. భాగస్వామ్య వ్యాపారాలు సంవత్సర ప్రథమార్థంలో లాభిస్తాయి. రాజకీయ పైరవీలకు దూరంగా ఉండటం వల్ల ఓ వర్గానికి దూరం అవుతారు. కొంత మంది విషయంలో కలకాలం కలిసి ఉండాల్సిన వారితో విభేదాలు వచ్చి చట్టపరంగా శాశ్వతంగా విడిపోతారు. కలియుగ ధర్మం, సనాతన సంప్రదాయ విలువలకు గోయ్యితీసి పాతేస్తుంది. చాలా విషయాలలో మానవుడు బలహీనుడు అని భావిస్తారు. కానీ అన్ని విషయాలలో

మానవుడు భగవత్‌సంకల్పము ముందు బలహీనుడేనని గుర్తించలేరు. కఠోరమైన ఈ సత్యాన్ని మీరు గమనించలేరు. సంతాన పురోగతిపై ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు, వాళ్ళ పురోగతికి బంధువులలో కొంత మంది సహాయపడతారు. ప్రభుత్వ పరంగా ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు మీరు ఇచ్చిన ఉత్తర్వులు వివాదాస్పదమవుతాయి. మీ వ్యక్తిత్వాన్ని, గుడ్‌విల్‌ను నిలబెట్టుకోవడానికి శ్రమించాల్సి వస్తుంది. సహచరవర్గంలోని ఓ వ్యక్తి ఉన్నతస్థాయిని పొందుతారు. గృహశాంతిని ఏర్పరచుకోవడానికి తగిన వ్యూహాన్ని అనుసరిస్తారు. ఎట్టి పరిస్థితులలోనూ ఆత్మసాక్షికి విరుద్దంగా, సిద్ధాంతాలకు విరుద్ధంగా ప్రవర్తించరు. సంవత్సర ప్రథమార్థంలో కొన్ని కీలకమైన విషయాలు విజయవంతం కాకపోవడానికి సాంకేతిక అంశాలు అడ్డువస్తాయి. శక్తికి మించి శ్రమిస్తారు, అందరూ కూడివచ్చి సహాయం చేస్తామని మాట ఇస్తారు. సమస్యలు మొదలుకాగానే మొహం చాటువేస్తారు. కష్టాలు ఎప్పుడూ వంటరిగా రావు, రెండో మూడో కలిసే వస్తాయి. ఆర్థిక ఇబ్బందుల నుండి కుటుంబ వ్యవహారాలలో పరిష్కరించాల్సిన పరిస్థితులలో, వృత్తి, ఉద్యోగాలకు సంబంధించి వైరివర్గం చిరాకు పెడుతున్న తరుణంలో అండదండగా ఉంటాడని భావించిన ఓ జీవి శాశ్వతంగా దూరం కావడం జరుగుతుంది. ఈ సమస్యల వలయం నుండి బయటకు రావాల్సిన స్థితిలో ఆర్థిక ఒత్తిళ్ళు, అనారోగ్యం, న్యాయపరమైన ఒత్తిళ్ళు వస్తాయి, మనోవేదనకు గురవుతారు. స్త్రీల సహకారం లభిస్తుంది, వృద్ధుల సహకారం వల్ల కొంత ఊరట చెందుతారు. కోర్టుకేసుల నుండి క్షేమంగా బయటపడతారు. మీకు ఈ రకమైన ఇబ్బందులు రావడానికి మూడు వంతులు మీ ఆత్మీయవర్గమే కారణం. మానవాతీత శక్తులు బాధిస్తున్నాయని కొందరు సలహాలు చెబుతారు, వాటిని పట్టించుకోవద్దు. యాంకరింగ్, మార్కెటింగ్, సంగీత సాహిత్యాది విషయాలలో మంచి పురోగతి ఉంటుంది. మీరు సూచించి ఏర్పాటుచేసిన ఓ చిన్న వ్యాపారం వృద్ధి చెందుతుంది. మీ వాళ్ళకు కొంత మేర ఊరట కలుగుతుంది. రియల్ ఎస్టేట్ వ్యాపారాలు కొనుగోలు అమ్మకాలు లాభిస్తాయి. విద్యాసంస్థల విషయంలో లాభాలు ఉంటాయి. కానీ గుడ్‌విల్ దెబ్బతింటుంది. హోమియోపతి, ఆయుర్వేద వైద్యులకు మంచి కాలం పురోగతి బాగుంటుంది. విమర్శకులకు మంచి ఫలితాల ద్వారా చక్కటి సమాధానం చెబుతారు. పాల వ్యాపారాలకు, నీళ్ళ వ్యాపారాలకు, శీతల పానీయాల వ్యాపారాలకు చాలా బాగుంది. అయితే అధికారుల వేధింపులు ఉంటాయి. అనేక రకాల బాధలను ఇతరులను చెప్పకుండా దిగమింగుతారు. ఒంటరిగా ఆలోచనలు పనికిరావని గ్రహిస్తారు. మానసిక, శారీరక ఒత్తిడులను అధిగమించడానికి కృషి చేస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాల పట్ల కొంతకాలం విరక్తిగా ఉంటారు. మీ ఆస్థులు కాజేయాలని పన్నాగాలు పన్నే వారుంటారు, వాళ్ళతో ఇబ్బందులు హోరాహోరి పోరాటాలు తప్పవు. సభ్యసమాజంలో చట్టాలు, కోర్టులు, పోలీసు వ్యవస్థ ఉన్నాయన్న విషయాలు మరచి మీపై దౌర్జన్యానికి పాల్పడే శత్రువర్గం ఆగడాలు మితిమీరి పోతాయి. ఏం చేసినా మీరేం చేయలేరనే ధీమా, మీకున్న అండదండలు పోయాయన్న భావన శత్రువర్గం రెచ్చిపోయేలా చేస్తాయి. సౌమ్యమైన మీ ప్రవర్తన మీ చేతగానితనంగా భావించబడుతుంది. సమయం అనే ఆయుధం కోసం వేచి ఉంటాయి. ప్రాంతీయ, కులమత విద్వేషాల కారణంగా ఉద్యోగులు చేస్తున్న కృషికి అధికారుల ప్రశంసలు లభించవు. వీలైనప్పుడల్లా మీ పనిలో తప్పులు వెదకడానికి చూస్తారు. పనికిమాలిన వ్యక్తులకు వివరణ ఇవ్వవలసిన దుస్థితి ఏర్పడుతుంది. ఎంతో ఔన్నత్యం, స్థాయి కలిగిన మీకు ఇటువంటివి ఎదురుకావడం ఆశ్చర్యంగా ఉంటుంది. అంచనాలు వేరు, నిజ జీవితంలో జరిగేవి వేరు.

కురుక్షేత్ర సంగ్రామానికి ముందు ధృతరాష్ట్రుడు, భీష్మునిపై ఎంతో ఆశపెట్టుకున్నాడు. పాండవ పరాక్రమమనే మహా సముద్రం ఉప్పొంగితే నా బిడ్డలైన కౌరవులు, భీష్ముని పరాక్రమమనే మహాపర్వతం మీద క్షేమంగా ఉంటారని భావించాడు. హిమాలయపర్వతం చిరుచేపల చెరువులో మునిగినట్లు భీష్ముడు శిఖండి చేతిలో నిహత్తరుడయ్యాడు. దీన్ని ఎవరైనా ఊహించారా? లేదు! ఈశ్వరేచ్ఛ ఎవరికీ తెలియదు, శుభకార్యాల విషయమై కార్యానుకూలత కోసం గట్టిగా ప్రయత్నిస్తారు, మంచి ఫలితాలు వస్తాయి. శుభకార్యాలు నిశ్చయం అవుతాయి. వృద్ధులైన తల్లిదండ్రులను మీపై ఆధారపడిన వృద్ధులను ప్రేమగా చూడడం ధర్మమే అవుతుంది. కానీ మీ విషయంలో ఇది పెద్ద అపరాధంలా పరిగణింప బడుతుంది, ఆశ్చర్యం! కలియుగ ధర్మానికి ఇది పరాకాష్ట. వివాహం చేసుకోవడం తోనే అన్ని రకాల బంధాలు తెగిపోతాయా ? స్వేచ్ఛ నశించిపోతుందా? మొదలైన ప్రశ్నలకు అంతరాత్మకు మనస్సు సమాధానం చెప్పలేదు. కుటుంబ విషయాలలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. సంతాన పురోగతి బాగున్నప్పటికీ వాళ్ళలో ఒకరి ప్రవర్తన ఇబ్బందిగా మారుతుంది, క్రమశిక్షణ లోపిస్తుంది. సక్రమమైన మార్గంలో నడిపించడానికి మీరు చేసే ప్రయత్నాలు అంతగా ఫలించవు. అతి గారాభం చెడు తెచ్చిందని భావిస్తారు. ఈ సందర్భంగా జీవితభాగస్వామితో వాగ్వివాదాలు ఏర్పడతాయి. కుటుంబ ప్రతిష్ట దెబ్బతినకుండా లౌక్యంగా వ్యవహరిస్తారు. మంచి సెంటర్‌లో ఉన్న స్థిరాస్థిని కొనుగోలు చేస్తారు. వాహన మార్పు చేస్తారు. పాతమిత్రులు మళ్ళీ సన్నిహిత అవుతారు. శుభకార్యాల విషయంలో కఠినంగా, దృఢంగా వ్యవహరిస్తారు. బంధువులలో వచ్చిన ఓ సంబంధాన్ని తిరస్కరిస్తారు, మీ అంచనాలకు తగిన సంబంధం చేయాలని నిశ్చయించు కుంటారు. మీ హితవు కోరే బంధువులు ఎవరో తెలుస్తుంది. సంవత్సర ద్వితీయార్థం అన్ని విధాలా బాగుంది. గతం గుర్తుకు వస్తే ఇప్పుడు ఎంత బాగున్నామో అర్థం అవుతుంది. కానీ గతం గుర్తుకు తెచ్చుకునే సమయం, తీరిక ఉండదు. అకాల భోజనాలు, కాఫీ, టీలు అధికం అవుతాయి. భగవద్గీత మీరు చదివినా, చదవకపోయినా కృష్ణపరమాత్మ చెప్పినట్టు మీ కర్తవ్యం, కృషి శక్తి వంచన లేకుండా చేస్తారు. ఫలితం కొరకు ఎదురుచూడరు. అన్ని విషయాలు దైవానికి వదిలివేస్తారు. హేళన, మితిమీరిన చతురతల వల్ల సున్నిత మనస్కులకు దూరమయ్యే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. ఎన్నో సమస్యలకు ఎదురొడ్డి విజయవంతమైన ఫలితాలు సాధిస్తారు. జీవిత భాగస్వామి విషయంలో మాత్రం మీ చాతుర్యం పనిచేయదు. స్నేహితులకు డబ్బులు ఇచ్చి, వాళ్ళకు సహాయంచేసి వాళ్ళ కోసం కొంతమందికి దూరం అవుతారు. మీ ద్వారా ప్రయోజనం పొందిన స్నేహితులు కూడా మిమ్ములను శత్రువులుగానే చూస్తారు. వాస్తవాలను గ్రహించి స్నేహితులకు స్వస్తి చెబుతారు. స్నేహము అనే మూడు అక్షరముల తీయని మాట ఆచరణలో కాలకూట విషమని గ్రహిస్తారు. భాగస్వామ్య వ్యాపారాలలో నిర్మొహమాటంగా వ్యవహరిస్తారు. విందులు, వినోదాలకు గతంలోలా ఖర్చుచేయరు, చర్చలను ప్రక్కవాళ్ళ మీదకు తోయడానికే ప్రయత్నిస్తారు. మీ పనిలో ఎదుటివాళ్ళ జోక్యం అధిగమవుతుంది. ఇష్టంలేని వ్యక్తులతో కలిసి పనిచేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వాళ్ళు మీరు అవునన్న దానికి కాదని, కాదన్నదానికి అవునని అంటారు, పని జాప్యం జరగుతుంది. ఏ పనీ కదలదు, స్తంభన ఏర్పడుతుంది. గుర్రమే పోయింది ఇక నాడా పోయిందని బాధపడడం ఎందుకు అని సరి పెట్టుకుంటారు. కష్టపడి సంపాదించుకున్న ఆస్తులను రక్షించుకునే ప్రయత్నం చేస్తారు. ఒరిగిపోయిన ఓజీవి (గతించిపోయిన) జ్ఞాపకాలు వెంటాడి వేధిస్తాయి. సమాజంలో ఎదురయ్యే సంఘటనలు మానసిక వేదనకు, వైరాగ్యానికి

దారితీస్తాయి. మీ మనస్సుకు సన్నిహితమయిన వారి ప్రవర్తన మీకు ఆందోళన కలిగిస్తుంది. మీ స్నేహితులు చేయవలసిన పని తాలూకు పనులు మీమీద పడతాయి. కార్యాలయంలో మీరు చేస్తున్న అదనపు కృషికి గాను తగిన ఫలితం ఇవ్వాలని కోరుతారు. అడ్డమైన వాళ్ళకి చేతికి ఎముక లేకుండా విచ్చలవిడిగా సహాయం చేసినా అధికారులు మీదాకా వచ్చేటప్పటికి చదివిన న్యాయశాస్త్రం,ధర్మశాస్త్రంల సారాంశం గుర్తుకుతేవడం విచిత్రంగా ఉంటుంది. ఇతరులకు వర్తించని ధర్మసూత్రాలు మీకు వర్తంపచేస్తారు. అధికారులకు బదిలీ చేయటమే సామర్థ్యం, కాలమే సమర్థతకు కొలమానం అవుతుంది. విలాసంవతమైన జీవితం గడపాలని భావిస్తారు. ఈ మేరకు గృహంలో మార్పులు తెస్తారు, మీరు పెట్టుబడి పెట్టిన ఓ పెద్ద ఆర్థిక సంస్థ దివాలా తీస్తుంది. చోరభయం పొంచివుంది. గృహం, ఆఫీసులలో భద్రతకు అధిక ప్రాముఖ్యతనివ్వాలి. ముఖ్యమైన టెండర్లు పనులు చేతికి అందుతాయి. ప్రభుత్వరంగ సంస్థలకు సంబంధించిన వర్క్ ఆర్డర్లు లభిస్తాయి. ఒక స్త్రీ సహాయ సహకారాలు లభిస్తాయి. మీకు వచ్చిన చెక్కులు కొన్ని బౌన్స్ అవుతాయి, మొండిబాకీలు వసూలుకావు. వీధి తగాదాలు, పోలీస్ స్టేషన్ పరిష్కార తగాదాలకు దూరంగా ఉంటాయి, ఇందుకోసం కొన్ని ప్రయోజనాలు వదులుకుంటారు. స్థాయి తగ్గించుకోవడానికి ఇష్టపడరు. పుస్తక పఠనంవల్ల మంచి మంచి విషయాలు తెలుసుకుంటారు. పునర్వివాహ ప్రయత్నాలు చేయువారికి సంవత్సర ద్వితీయార్థం బాగుంది. అనుకూల ఫలితాలు వస్తాయి. డిటెక్టివ్ ఏజెన్సీల వల్ల, పోలీసుల ద్వారా మీరు ఇతరులకు చేసిన నష్టాన్ని తెలుసుకోగలుగుతారు. సాంప్రదాయ సంబంధ విషయాల వల్ల కొన్ని శుభకార్యాలు వాయిదా పడతాయి. సంతానం లేని వారికి ఈ సంవత్సరం సంతానం కలుగుతుంది. విలువైనటువంటి బంగారు ఆభరణాలతో సహోదర సహోదరీ వర్గాన్ని ఆదరిస్తారు, గతంలోని విషయాలను మనస్సులో ఉంచుకోరు. క్రీడా జీవితంలో అనుకోని మలుపులు వస్తాయి. కళాసాహిత్య రంగాలలో దీర్ఘకాలికంగా పాతుకుపోయిన అధికారుల రాజకీయాలకు మీరు బలిపశువు అవుతారు. కుళ్ళు రాజకీయాలు మీపై ప్రయోగిస్తారు. బహుమతులు రావాల్సిన చోట, అందరూ మీరే గెలిచారని భావించు ఉద్వేగ క్షణాలలో రాజకీయాలు చోటు చేసుకుంటాయి. మీడియా పరంగా న్యాయం జరగదు. వ్యక్తిగత రక్షణకు గాను రివాల్వర్ లైసెన్సులకు సంబంధించి అర్జీలు దాఖలు పరుస్తారు. అధికారుల అనుమతులు లేని మారణాయుధాలు కలిగి ఉంటారు. పరిష్కారం లేని సమస్యల గురించి అనవసరంగా ఎక్కువగా ఆలోచిస్తారు. ఇది మీ ఆరోగ్యం మీద ప్రతికూల ప్రభావం చూపిస్తుంది. ఫాస్ట్‌ఫుడ్స్ పట్ల అయిష్టత ఏర్పడుతుంది. సాంప్రదాయక వంటకాలపై మొగ్గుచూపిస్తారు. చెవి, ముక్కు, గొంతు, సంబంధమైన ఇబ్బందులు, అరికాలి మంటలు, ఎడమ మోకాలి నొప్పులు బాధించే సూచనలు ఉన్నాయి. రుచికరమైన ఆహారాన్ని తినగలగటం కూడా ఒక అదృష్టం అని భావిస్తారు. నమ్మకస్తులతో ఒక టీం ఏర్పాటు చేసి శత్రువుల కార్యకలాపాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటారు. ప్రకృతి వైద్యం, మెడిటేషన్, యోగాసనాల వల్ల ఎలాంటి ఉపయోగాలు ఉండవు. సంవత్సర ద్వితీయార్థంలో ఉద్యోగంలో ఆకస్మికంగా ఉన్నతస్థితి లభిస్తుంది, ప్రేమపెళ్ళిళ్ళ పట్ల ఏవగింపు కలుగుతుంది. ఇలాంటి విషయాలలో మీరు సహించరు, వర్ణాంతర వివాహాలని తీవ్రంగా వ్యతిరేకిస్తారు, ఇటువంటివి జరగకుండా మీ సర్వశక్తులు ధారపోస్తారు. మీకు సహోదరీ వర్గానికి చెందిన ఆస్తులను వారి పేరుమీద రిజిస్ట్రేషన్ చేస్తారు. కొన్ని గిఫ్ట్ డీడ్‌లు మీ పేరుమీద రిజిస్ట్రేషన్ అవుతాయి. విదేశాలలో ఉన్న మీ ఆత్మీయవర్గం స్వదేశానికి రాబోతున్నామన్న సమాచారం అందుతుంది. వాళ్ళకు మీరు ఇవ్వవలసిన ధనాన్ని సిద్ధం చేయాల్సిన పరిస్థితి

పరోక్షంగా కనిపిస్తుంది. సంవత్సరం ద్వితీయార్థంలో మీరు ఆశలు పెట్టుకున్న వంశాంకురాలు, సంతానం పోటీ పరీక్షలలో ఆశించిన ఫలితాలను, పదవులను అందుకుంటారు. సంవత్సర చివరి భాగంలో జీవిత భాగస్వామి తోడ్పాటు లభిస్తుంది. ఆరోగ్యకరమైన, ఐకమత్యపూరితమైన వాతావరణం ఏర్పడుతుంది. మీరు నడుపుతున్న విద్యాసంస్థలకు, సేవాసంస్థలకు, ఆశ్రమాలకు మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. అవార్డులు కూడా లభిస్తాయి. అత్యున్నత స్థానంలో ఉన్న వారి చేతులమీదుగా మీ సేవలకుగాను రివార్డులు లేదా మెడల్స్‌గాని అందుకుంటారు. దైవం మీద నమ్మకం కలుగుతుంది. ఇన్నాళ్ళు దైవాన్ని నమ్మనందుకు బాధపడతారు. ఆర్థిక, ఆరోగ్యస్థితులు మెరుగుపడతాయి. దాయాదుల మధ్య ఏర్పడిన వివాదాలు పరిష్కారమవుతాయి. దేశకాలమానానికి అనుగుణంగా మీ అభిప్రాయాలను, సిద్ధాంతాలను మార్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఏదిఏమైనా కొన్ని ముఖ్యమైన విషయాలను, వ్యవహారాలను ఈ సంవత్సరం నెరవేర్చగలిగామన్న సంతృప్తి మిగులుతుంది. నిత్యం లక్ష్మీతామర వత్తులతో, అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. సర్వరక్షా చూర్ణంతో స్నానం చేయండి, మంచి జరుగుతుంది. ఈ రాశిలో జన్మించిన విద్యార్థినీ విద్యార్థులు జ్ఞానసరస్వతి తిలకాన్ని ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. జన్మరాశిలో సంచరించు శని ప్రభావం, చతుర్థస్థానంలో సంచరించు కేతువు ప్రభావం, దశమంలో సంచరించు గురు రాహువుల ప్రభావం, రవిచంద్రుల గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. పెట్టుబడిపెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు. ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

## స్త్రీలకు ప్రత్యేకం

ఆసక్తికరమైన కలుసుబాటు ఉంటుంది. చేసిన కృషికి, శ్రమకు తగిన ఫలితం కాస్త ఆలస్యంగా వస్తుంది. విద్యార్థి, విద్యార్థినిలకు మెరిట్ మార్కులు, స్కాలర్ షిప్పులు వస్తాయి. సాహిత్యకళారంగంలో, సాంస్కృతికరంగంలో అభివృద్ధి బాగుంటుంది. పేరుప్రతిష్టలు వస్తాయి. ఫిక్స్‌డ్ డిపాజిట్స్ వృద్ధి చెందుతాయి. ఫైనాన్సియల్ స్కీమ్స్ నష్టపరుస్తాయి. గతం అనుభవాలను గుర్తుంచుకోండి. అందరూ అభిమానంతో, ప్రేమతో చూస్తారు. మీరు వేసే ప్రతి అడుగు అభివృద్ధికి సోపానం కావాలని చాలా మంది కోరుకుంటారు. అనారోగ్యపరమైన సమస్యలు తగ్గుముఖం పడతాయి. రీవాల్యుయేషన్, రీకౌంటింగ్ లాభిస్తాయి. అధ్యాపకుల వల్ల లాభం పొందుతారు. కోపం, మాట దురుసుతనం తగ్గించుకోవాలి. స్థిరాస్థులు ఏర్పడతాయి. క్రమక్రమంగా ఆర్థిక పురోగతి బాగుంటుంది. సివిల్ సర్వీస్‌లలో ఎంపిక అవుతారు. ఐ.ఐ.టిలో సీటు వస్తుంది, మెడిసిన్ సీటు వస్తుంది. విదేశాలలో చదువుకోవడానికి అవకాశం వస్తుంది, దీర్ఘకాలిక ఇబ్బందుల నుండి బయటపడతారు. ప్రేమ వివాహాలు ఫలిస్తాయి, కాపురాలు మాత్రం బాగుండవు. జాగ్రత్త వహించండి. పోటీ పరీక్షలకు ముందు చికాకులు ఎదురైనా విజయవంతమైన ఫలితాలు సాధిస్తారు. మోకాళ్ళ నొప్పులు, కీళ్ళనొప్పులు కొద్దిగా బాధిస్తాయి. రాజకీయ పదవి ప్రాప్తి ఉంది. ఉద్యోగం చేసేవారికి ప్రమోషన్ లభిస్తుంది. సమాజంలో స్త్రీలకు ఎదురయ్యే సమస్యలు మీదాకా వస్తాయి. వాటిని పట్టించుకోకుండా మీ దారిన మీరు వెళతారు. చిల్లర విషయాలకు ప్రాధాన్యత ఇవ్వకూడదని నిశ్చయించుకుంటారు. నూతన భాషలు నేర్చుకుంటారు. అన్యభాషలలో ఉన్న మీ ప్రావీణ్యం ఉపయోగపడుతుంది. కంటి ఆరోగ్యం గురించి ప్రత్యేక శ్రద్ధ వహించాలి, సైటు రాకుండా జాగ్రత్త పడండి. పునర్వివాహ

ప్రయత్నాలు చేసే వారికి మధ్యవర్తుల వల్ల మేలు జరుగుతుంది. అవివాహితులైన వారికి వివాహం కుదురుతుంది. సంతానం లేనివారికి సంతానం కలుగుతుంది. మీ పేరుమీద ఉన్న స్థిరాస్థుల విలువ పెరుగుతుంది. మీరు చదివిన చదువుకు సంబంధించిన ఉద్యోగం కొద్దిపాటి ఆలస్యంగా వస్తుంది. సన్నిహితులు, స్నేహితులు, బంధువులలో మంచి పేరు తెచ్చుకుంటారు. వైవాహిక జీవితం బాగుంటుంది. మంచి భర్త లభిస్తాడు. ఉద్యోగ పరంగా మీ ఎదుగుదల చూడలేక కొంతమంది వ్యక్తులు నిందలు, పుకార్లు ప్రచారం చేస్తారు. వీటన్నిటిని మీరు లెక్కచేయరు. ఉద్యోగపరంగా మీరు ఇచ్చే ఆదేశాలను లెక్కచేయరు. కఠినమైన ఈ సమస్యను పై అధికారుల ద్వారా పరిష్కరించుకుంటారు. నిందలు, పుకార్లు అబద్ధాలు అని తేలిపోతుంది. చట్టపరమైన ఉద్యోగపరమైన హక్కులను అధికారులను మీకు అనుకూలంగా మలచుకోగలుగుతారు. దొంగ స్వామీజీలను నమ్మడం వలన నష్టపోతారు. అతీంద్రియ శక్తులు మీమీద పనిచేయడం లేదని గ్రహించండి. అనవసరమైన అనుమానాలకు తెరదించండి. నిత్యం శ్రీలక్ష్మీ చందనంతో మహాలక్ష్మీదేవి పూజ చేయండి. సర్పదోష నివారణ చూర్ణంతో స్నానమాచరించండి. సాంప్రదాయక వంటకాలకన్నా ఫాస్ట్‌ఫుడ్‌నే ఇష్టపడతారు. కొంత మంది విషయంలో వైవాహిక జీవితంలో అన్యోన్యత లోపించినట్లుగా భావిస్తారు. విదేశాలలో ఉన్నవారికి గ్రీన్ కార్డు లభిస్తుంది. మంచి ఉద్యోగం కూడా లభిస్తుంది. విదేశాలలో స్థిరాస్థులు కొనుగోలు చేస్తారు. లాభం చేకూర్చే కొన్ని ప్రయాణాలు సంభవిస్తాయి. నిత్యం హనుమాన్ వత్తులతో దీపారాధన చేయండి. దీపారాధనకు అష్టమూలికా తైలాన్ని ఉపయోగించండి. పొదుపు పథకాలు అమలు చేసి లబ్ది పొందుతారు. ఆకస్మిక ధనలాభం సూచిస్తుంది. విలువైన వస్తువుల భద్రత పట్ల ఎక్కువ శ్రద్ధ చూపించండి. దొంగ భయం పొంచి ఉంది జాగ్రత్త. బ్యూటీపార్లర్లు నడిపేవారికి అనుకూలంగా ఉంది. మొత్తం మీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**
**8466932223/4/5, 9014126121**



## మహాతీర్థం పొడి

ఏ దేవుడికైనా, దేవతకైనా పూజ చేసేటప్పుడు మహాతీర్థం పొడి కొద్దిగా ఉపయోగించాలి. ఎలాంటి అభిషేకానికైనా ఈ మహాతీర్థం పొడిలో కొద్దిగా నీళ్ళు కలిపి అభిషేకం చేయండి. ఈ మహాతీర్థం పొడిలో 17 రకాల దేవతా ప్రీతికరమైన వన మూలికలు కలుస్తాయి. మహాతీర్థం పొడితోచేసే అభిషేకాలు, పూజలు మంచి ఫలితాలనిస్తాయి. ఇంతవరకు పూజా ద్రవ్యాలతో ఈ రకమైన తీర్థం రాలేదు. ప్రజలకు సౌలభ్యంగా ఉండడానికి పురాతన గ్రంథాలు పరిశీలించి ఇది తయారుచేయడమైనది. దీనివల్ల సౌఖ్యం, సంతోషం కలుగుతాయి. ఇష్టదేవతా అనుగ్రహం కలుగుతుంది.



# 2016-2017 లో ధనుస్సురాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 5 | వ్యయం - 14 | రాజ - 4 | అవ - 2 |

**మూల 1, 2, 3, 4 పా॥లు, పూర్వాషాఢ 1, 2, 3, 4 పా॥లు, ఉత్తరాషాఢ 1వ పాదాల యందు పుట్టినవారు "యే, యో, బా, బి, భూ, ధా, భా, డ, భే" అను అక్షరములను తమ పేరునకు మొదట గలవారు ధనుస్సురాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

ఈ రాశివారికి ఈ సంవత్సరం బాగుంది. సంవత్సర ప్రథమార్థంకన్నా ద్వితీయార్థం బాగుంది. అనుకున్న పనులు మూడొంతులు పూర్తి అవుతాయి. ఆర్థికపరమైన సర్దుబాట్లు ఎక్కువ అవుతాయి. డబ్బులు వస్తాయి, చేతిలో నిలబడవు, సమస్యలు వస్తాయి, సమసిపోతాయి. ప్రతి విషయం కొండంత కష్టంగా అనిపిస్తుంది, మబ్బులంత తొందరగా విడిపోతుంది, మనోస్థైర్యం చాలా అవసరం. ఆధ్యాత్మిక రంగంలో ఉన్నత స్థితి సాధించాలని మంత్రోపదేశం తీసుకుంటారు. క్రమబద్ధమైన ఆధ్యాత్మిక జీవితాన్ని గడుపుతారు. చిన్న విషయాలకు కూడా అతిగా ప్రతిపాదిస్తారు. మీ సలహాలను పెడచెవిన పెట్టి దురాశకు పోయి నష్టపోయిన మీ సన్నిహితులను మందలించి తగిన సహాయం కూడా అందిస్తారు. జీవితంలో అశాంతిని సృష్టిస్తున్న ఓ స్త్రీని వదిలించుకోవడానికి న్యాయపోరాటం చేసి విజయం సాధిస్తారు. మనశ్శాంతి కోసం పుణ్యక్షేత్రాలను సందర్శిస్తారు. ఉద్యోగానికి సరైన కారణం లేకుండా కొంతకాలం శెలవు పెడతారు. స్త్రీ పురుషుల అనుబంధానికి, స్నేహానికి ఎవరైతే వక్రభాష్యాలు చెవుతున్నారో వీరితో ఏకీభవించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీరు అభిమానించిన స్త్రీ కనుమరుగు అవుతుంది (కొంత మంది విషయంలో) ఈ విషయాన్ని మౌనంగా భరిస్తారు. కొంత మంది విషయంలో వన్ సైడ్ లవ్ ఫలించదు. మీ ఊహలకు, అపోహలకు, భయాలకు ఇతరులను నిష్కారణంగా బలిచేస్తారు. ఇతరుల విధానాలకు మీరు అతిగా ప్రభావితులు అవుతారు. కొంతలో కొంత ఇది మేలు చేస్తుంది. వాస్తవాలను స్పష్టంగా గ్రహిస్తారు. ఊహాలోకాలలో విహరించే పరిస్థితికి స్వస్తి చెబుతారు. దొంగస్వామీజీల వల్ల నష్టపోతారు. ఇతరుల నుండి సలహాలు తీసుకునే పద్ధతికి స్వస్తి చెబుతారు, మంచి చెడూ మీరే ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటారు. ఊబకాయం, ఒళ్ళు తగ్గించుకునే ప్రయత్నాలు ప్రారంభిస్తారు, ఇది ఆరంభ సూరత్వమే, విధివిధానంగా చేయలేరు. కొన్ని సమయాలలో మీ సామర్థ్యాన్ని, నిజాయితీని నిరూపించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. నిప్పులాంటి మనిషిగా మీ నిజాయితీని నిరూపించుకుంటారు. ప్రతిరోజు 'దైవికం' అనే పొడితో ధూపం వేయండి, దుష్టశక్తులకు దూరంగా ఉండండి. ఇదే పరిస్థితి మీ కుట్రదారులకు కూడా ఏర్పడుతుంది. వీళ్ళు నిజాయితీని నిరూపించుకోలేక ముఖం చాటువేస్తారు. ఎవరికీ అందుబాటులో లేకుండా పోతారు.

వృద్ధాశ్రమాలను నిర్మించి వాటిని ఓ దారిలో పెట్టి ఆర్థికంగా వాటికి పరిపుష్టి కలిగించి నిర్వహణా బాధ్యతలని వేరొకరికి అప్పగిస్తారు. ఉద్దేశపూర్వకంగా మిమ్ములను అవమాన పరచాలని ఓ ముఖ్యకార్యక్రమానికి మీ వైరివర్గం మీకు ఆహ్వానం పంపించరు. ప్రోటోకాల్ ప్రకారం మిమ్ములనే ముందుగా ఆహ్వానించాలి. ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకుని సందర్భం వచ్చినప్పుడు గుణపాఠం చెప్పాలని నిర్ణయించుకుంటారు. గతించిపోయిన వారి జ్ఞాపకాలు మీకు మనోవేదనను కలిగిస్తాయి. ఓ కష్టమో సుఖమో, పండుగో వచ్చినప్పుడు వాళ్ళు జీవించి ఉంటే ఇలా ఉండేదా పరిస్థితి? అని తలచుకుని తలచుకుని బాధపడతారు. సమాజం ఒక వేదిక, మనోభావాలను చెప్పడం కూడా ఒక పొరపాటు అవుతుంది. అన్నింటినీ దిగమింగి సంతోషంగా, ధైర్యంగా ఉన్నట్లు నటించాలి, మీరు అదే చేస్తారు. భావస్వేచ్ఛకు బంగారు సంకెళ్ళు పడతాయి. ఉద్యోగంలో ప్రమోషన్ల కొరకు పరీక్షలు రాసి అనుకూల ఫలితాలను పొందుతారు. ప్రమోషన్ ఆర్డర్లు అమలు కావటం ఆలస్యం అవుతుంది. వాలెంటరీ రిటైర్మెంట్ ఆలోచనలు వస్తాయి, కార్యాలయంలో నీచ రాజకీయాలు, ఇంట్లో పరిస్థితి మీ ఆలోచనకు కారణం అవుతుంది. మీ స్నేహిత వర్గం దీనికి అడ్డు పడటం జరుగుతుంది. వ్యాపారంలో మాత్రం నూతన ప్రయోగాలు చేసి మంచి ఫలితాలను సాధిస్తారు. మీ కంపెనీకి ప్రజలలో గుడ్‌విల్, నమ్మకం పెరుగుతుంది. ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న ఒక ఆశ ఫలించడం మీకు, మీ భాస్వాముల ఆనందానికి అవధులు ఉండవు. బ్యాంకు రుణాలు, అనుకూలమైన స్థలం, ప్రభుత్వ రాయితీలు, మొదలైనవాటికి ప్రోత్సాహం లభిస్తుంది. మీరు ఆశించిన విధంగా, ఊహించని విధంగా మీ జ్యేష్ఠ సంతానానికి ఉద్యోగం లభిస్తుంది. ఆడపిల్లల గురించి, వాళ్ళ పెళ్ళిళ్ళ గురించి గట్టిగా ఆలోచన చేస్తారు. వివాహ ప్రయత్నాలు ప్రారంభిస్తారు. అవి సఫలం అవుతాయి, మంచి సంబంధం కుదురుతుంది. పునర్వివాహ ప్రయత్నాలు చేసేవారికి కష్టం మీద సంబంధం కుదురుతుంది. ఈ రాశిలో జన్మించిన వారు భృగుపాశుపత హోమం చేయించాలి. నిత్యం సర్వరక్షా చూర్ణంతో, సర్పదోష నివారణ చూర్ణాన్ని కలిపి స్నానం చేయాలి. బంధువులలో స్త్రీల మధ్య విభేదాలు వస్తాయి, అవి పెద్దవై అందరినీ చికాకు పరుస్తాయి. చాకచక్యంగా ఈ సమస్యలను పరిష్కరించి ఆపద్బాంధవుడు అనిపించుకుంటారు. దురాశాపరులైన బంధువర్గం వల్ల, ఆత్మీయుల వల్ల ఇబ్బందులు ఏర్పడతాయి. ఎన్నో విధాలుగా సహాయం చేసిన వాళ్ళను తృప్తిపరచలేరు. కుటుంబానికి సంబంధించిన వరకు మీ అభిప్రాయాలను ఎవ్వరూ సమర్థించరు, ఖండించరు. ప్రేమవివాహాలు చేసుకున్నవారికి చేదు అనుభవాలు సంభవిస్తాయి. న్యాయస్థానాల వరకు ఈ వివాదాలు పాకుతాయి. నిరంతరం కష్టపడటంలో దైవాన్ని, సంతృప్తిని చూసుకుంటారు. భగవంతుడు నొసట రాసిన రాత శాశ్వతమని నమ్ముతారు. ఈ నమ్మకం చాలా విషయాలలో మీకు మనోధైర్యాన్ని కలిగిస్తుంది. అనుకూలమైన వారిని నిత్యం వేధింపులకు గురిచేస్తున్న ఓ రౌడీ మూకకు మీ పలుకుబడిని ఉపయోగించి తగిన శాస్తి చేస్తారు. కొన్ని సందర్భాలలో దయాదాక్షిణ్యం, మంచితనం మరిచి పోయినట్లుగా ప్రవర్తిస్తారు. నైతిక బాధ్యతలను విస్మరించారని సన్నిహితవర్గం నుండి ఆరోపణలు వస్తాయి. భాగస్వామ్య వ్యాపారంలో మీరే కేంద్ర బిందువు అవుతారు. మిగిలిన భాగస్వాముల పాత్ర నామమాత్రం అవుతుంది. పగటిపూట తీసుకునే నిర్ణయాలు లాభిస్తాయి, తలనొప్పి లేదా పార్శ్వపునొప్పి కొంతకాలం బాధిస్తుంది. కీలకమైన పోటీ పరీక్షలలో నామమాత్రంగా శ్రమించి అనుకూల ఫలితాలు సాధిస్తారు. అనూహ్యంగా ప్రతి విషయంలోనూ అదృష్టం కలసివస్తుందని భావించవద్దు, అదృష్టం కోసం ఎదురు చూడటం మన ఆశ, కృషికి తగిన

ఫలితం వాస్తవం. ఈ విషయాన్ని గ్రహించి తగిన విధంగా ప్రవర్తిస్తారు. ప్రతినిత్యం సిద్ధ గంధంతో శ్రీ వెంకటేశ్వరస్వామి వారిని పూజించండి. అనుకూలమైన రాహుగ్రహ ప్రభావం వల్ల ప్రతిష్ఠ పెంచే ఓ పదవి లభిస్తుంది. కుటుంబ సభ్యుల దృష్టిలో అది కొనుగోలు. మీ దృష్టిలో మాత్రం పెట్టుబడి. పాస్‌పోర్టు, వీసాల కోసం ప్రయత్నించేవారికి అవి లభిస్తాయి. గ్రీన్ కార్డు కోసం ఎదురుచూసే వాళ్ళకి గ్రీన్ కార్డు లభిస్తుంది. ప్రభుత్వ సంబంధమైన కొన్ని రకాల ఉత్తర్వులు మీకు మేలు చేస్తాయి. మీ పలుకుబడిని ఉపయోగించి తక్కువ కొటేషన్‌తో ఎక్కువ లాభాలు ఉన్న కాంట్రాక్టులను మీ స్వంతం చేసుకుంటారు. దూరప్రాంతాలకు మీ పిల్లలను పంపించి చదివిస్తారు. సంసారం గుట్టు, రోగం రట్టు అనే సామెత మీ విషయంలో నిజమవుతుంది. మీ సమస్యలను ఎవరితోనూ పంచుకోవడానికి ఇష్టపడరు. మంచి విషయాలు చెబితే జనం ఓర్చుకోలేరు, చెడ్డ విషయాలు చెబితే లోకువగా చూస్తారని మీ అభిప్రాయం. రెన్యువల్స్, లీజుకాలం పొడిగించబడతాయి. వ్యాపారంలో అనారోగ్య పోటీని ఎదుర్కొంటారు. వ్యవసాయ ఉత్పత్తులను నిల్వ చేసే వ్యాపారులకు, కమీషన్ ఏజెంట్లకు మంచి కాలం. చట్ట వ్యతిరేకంగా నిల్వలు చేస్తే చాలా ఇబ్బందిపడతారు, జాగ్రత్త. వచ్చిన డబ్బులను వచ్చినట్లుగానే ఖర్చు పెట్టే పద్ధతిని మార్చుకోవాలని అనుకుంటారు, పొదుపు పథకాలలో ధనాన్ని పెట్టుబడిగా పెడతారు. పుత్ర సంతానం కన్నా ఆడపిల్లల మీద ఎక్కువ ప్రేమ పెంచుకుంటారు. వాళ్ళ జీవితంలో ఏ కష్టం రాకుండా ధనబలం అనే గోడను వాళ్ళ చుట్టూ కట్టాలని అనుకుంటారు. ఇందు కోసం నిర్విరామంగా కృషి చేస్తారు. కళా సాంస్కృతిక రంగాలకు దూరంగా ఉండాలని నిర్ణయించుకుంటారు. మీ టాలెంట్ పట్ల నమ్మకం ఉన్న స్నేహితులు నచ్చజెప్పి మీరు తీసుకున్న నిర్ణయాన్ని ఉపసంహరించుకునేలా చేస్తారు. మీ సామర్థ్యం మీడియా పరంగా ప్రశంసించ బడుతుంది. సంతానం లేని వారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది (సంతాన పాశుపత హోమం చేయాలి). ఉద్యోగాల విషయంలో మధ్యవర్తులవల్ల, కమీషన్ ఏజెంట్లవల్ల నష్టపోయే ప్రమాదం ఉంది, జాగ్రత్త వహించండి. దొడ్డిదారిలో ఉద్యోగాలు సంపాదించుకునే మార్గాలకు స్వస్తి చెప్పండి, అవి ఎండమావులని గ్రహించండి. సమాజంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా మీ మనస్తత్వాన్ని మార్చుకోలేరు. సనాతన సాంప్రదాయాల మీద మీకున్న నమ్మకం అంత బలీయమైంది. స్వల్ప విషయం కారణంగా ఓ ముఖ్య రాజకీయ నాయకుడిని దూరం చేసుకుంటారు. ప్రాణంకన్నా ఆత్మగౌరవం ముఖ్యమని భావిస్తారు. భూమి సంబంధమైన వ్యాపారాలు, కొనుగోళ్ళు, అమ్మకాలు సంవత్సర ద్వితీయార్థంలో రాణిస్తాయి. అనవసరంగా స్వామీజీల చుట్టూ తిరగడం, జ్యోతిష్కులకు జాతకం చూపించడం మానుకోండి. సమస్యలను దేవుని పాదాలకు విన్నవించడం మంచిదని గ్రహించండి. మీరు వ్రాసిన చక్కని ఇంగ్లీషు డ్రాఫ్టింగ్‌లు, ప్రసంగాలు పలువురి ప్రశంసలు అందుకుంటాయి. ఇతర భాషలలో ప్రవేశం, ప్రావీణ్యత మీకు అండగా నిలుస్తుంది. జనరల్ నాలెడ్జ్ కొరకు ప్రతిరోజు కొంత సమయాన్ని రీడింగ్‌కు కేటాయిస్తారు. మీ ఆదాయ వ్యయాలకు సంబంధించిన జమాఖర్చులు గణితానికి సంబంధించిన పుస్తకాలలో లోపాలు ఉన్నాయని గ్రహించి చివరి నిముషంలో జాగ్రత్తపడతారు. మీ తొందరపాటుతనం వల్ల, నోటిదురుసుతనం వల్ల మీకు అత్యంత సన్నిహిత మిత్రుణ్ణి దూరం చేసుకుంటారు. అతడు శత్రువర్గానికి సహాయపడతాడనే భయంతో మరొక మిత్రుని ద్వారా రాయబారం నడిపి తిరిగి సన్నిహితం చేసుకుంటారు. ఇతరులకు సంబంధించిన ఆర్థిక పత్రాలు, డాక్యుమెంట్స్ మీ దగ్గర దాచిపెట్టవలసిన పరిస్థితి వస్తుంది. కూతురివైపు బంధువులకు మీ రాజకీయ పలుకుబడి ఉపయోగించి చాలా పనులు చేసిపెడతారు. బంధువులతో బంధువులుగా

కాక స్నేహితుల్లా మెలుగుతారు. మీ సలహాలు, నైపుణ్యం, శ్రమ ఇతరులకు ఉపయోగపడుతుంది. ప్రశంసలకు పరిమితం కాకుండా మీకు రావాల్సిన భాగాన్ని నిర్మొహమాటంగా వసూలు చేస్తారు. మీలో వచ్చిన మార్పు కుటుంబ సభ్యుల ఆనందానికి, మిత్రుల ప్రశంసలకు దారితీస్తుంది. దైవసంబంధమైన మెక్కుబడులు తీరుస్తారు. ఓ స్థిరాస్థికి సంబంధించి అడ్వాన్సు ఇస్తారు, మరొకరి పేరు మీద రిజిస్ట్రేషన్ చేయిస్తారు. ఇందు వలన శ్రమలేకుండా ధనాదాయం వస్తుంది. కొంతకాలం సంతాన విషయం మీరు పట్టించుకోకపోయినా వాళ్ళ అభివృద్ధి బాగుంటుంది. మెరిట్ మార్కులు సాధిస్తారు. పోటీ పరీక్షలలో విజయం సాధించి, ఉద్యోగం కూడా సాధిస్తారు. సహజీవనం సాగించవలసిన వారితో ఇమడలేక సంచలనాత్మక నిర్ణయాలు తీసుకుంటారు. వివాదాస్పదమైన ఆస్తివ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారమవుతాయి. మీ తోటివారు ఎంతగానో ఎదిగిపోతున్నారనే భావం మనోవ్యాకులతకు కారణం అవుతుంది. ఇది అనవసరంగా మనస్సు పాడు చేసుకోవడమే. సమాజంలో మీకున్న స్థాయి గుడ్ విల్ వాళ్ళకు లేదని, మీకూ వాళ్ళకి నక్కకి నాగలోకానికి ఉన్నంత తేడా ఉందని గ్రహించండి. కార్యాలయంలో మీరు చేస్తున్న ప్రతిపనికీ వివరణ అడుగుతున్న అధికారుల ప్రవర్తన నచ్చక సెలవు పెడతారు. డబుల్ రిజిస్ట్రేషన్ ఆస్తిని కొనుగోలు చేసే ప్రమాదం నుండి చివరి నిముషంలో బయటపడతారు. అమ్ముడుపోని కొన్ని స్థిరాస్థులు గుదిబండగా మారతాయి. కుటుంబ వ్యవహారాలలో బంధువుల, స్నేహితుల జోక్యం అరికడితేగానీ గృహశాంతి లభించిందని గ్రహిస్తారు. ఇ.ఎన్.టి ప్రాబ్లమ్స్ రావచ్చు. స్పెక్యులేషన్ లాభించదు. మధ్యవర్తిత్వాల వల్ల, పెద్దల తీర్పుల వల్ల నష్టపోతారు. మీ వ్యూహరచన వల్ల, దైవానుగ్రహం వల్ల శక్తివంతమైన కూటమి మీకు దగ్గరవుతుంది. ఎంతమంది మీ చుట్టూ వలయంగా ఉన్నా మనస్సులోని భావాలు మీరు చెప్పుకోవడానికి ఆత్మీయులే కరువవుతారు. అహంకారాలు, సోమరిపోతులు ఎవరైతే ఉన్నారో వాళ్ళను మీ సర్కిల్‌లో లేకుండా తరిమికొడతారు. మీ నైపుణ్యానికి సంబంధించిన ప్రశంసాపూర్వకమైన సర్టిఫికెట్లు చేతికి అందుతాయి. మీకు అందిన ఓ రహస్య సమాచారాన్ని అనుసరించి వృత్తి, ఉద్యోగాలలో కీలకమైన మార్పులు తెస్తారు. మీ మీద ఆధారపడినవారి కోసం మీ అభిప్రాయాలను, సిద్ధాంతాలను మార్చుకుంటారు. కృతజ్ఞతలేని వ్యక్తులను పట్టించుకోకూడదని నిర్ణయించుకుంటారు. మీకు తెలిసిన రాజకీయనాయకులు, అధికారుల వద్ద డబ్బు లేనిదే పని జరగదని గ్రహిస్తారు. గోప్యంగా వ్యవహరించి మీ పనులు వేరే వారిద్వారా లంచం ఇచ్చి పూర్తి చేయించుకుంటారు. రాజకీయపరంగా కొంత మంది వ్యక్తులకు అండగా నిలిచి వారికోసం శ్రమిస్తారు. శ్రీకృష్ణపరమాత్మ అర్జునుణ్ణి విజయం కొరకు సారథ్యం వహించిన విధంగా మీరు వ్యవహరించి చరిత్రపుటలలో నిలిచిపోతారు. అత్యంత సన్నిహితులను నమ్మి కొన్ని ముఖ్యకార్యక్రమాలను వారికి అప్పగిస్తారు. అయితే కార్యక్రమాలు విజయవంతం అవుతాయిగానీ మంచి ఫలితాలు మాత్రం మీ దాకా రావు. సొమ్ము చేతికి రాకపోగా స్నేహితులతో విభేదాలు ఏర్పడతాయి. పరిస్థితుల ప్రభావం వల్ల సహోదర సహోదరీ వర్గానికి సహాయపడతారు, అండగా నిలుస్తారు. ప్రింటింగు, ప్రచార సంబంధిత విషయాలు, లీజులు, సబ్ లీజులు మీకు లాభిస్తాయి. మీ ప్రయోజనాలు స్థిరంగా ఉంటాయి. లౌక్యంగా మాట్లాడి చొరవగా చొచ్చుకుపోయే వ్యక్తుల వల్ల మీ ప్రయోజనాలు దెబ్బతినే అవకాశం ఉంది. కొన్ని సందర్భాలలో ముఖ్యమైన వ్యక్తులు చెప్పుడు మాటలు విని మీ నుండి కనీసం వివరణ కోరకుండా ఏకపక్ష నిర్ణయాలు చేస్తారు. కొంత మంది సన్నిహితవర్గం మీ పేరు చెప్పి అప్పులు చేయడం ఆ విషయం మీకు చెప్పకపోవడం మీ సిబ్బంది మీద మీకన్నా ఎక్కువగా

అధికారం చెలాయించడం, పద్ధతిలేకుండా ప్రవర్తించడం ఇలాంటివి ఆలస్యంగా మీ దృష్టికి వస్తాయి. స్థాయికి తగని వ్యక్తులను తలకెక్కించుకున్నందుకు చింతిస్తారు. నష్టపోతారు. సామూహిక న్యాయం కోసం పోరాడి స్వప్రయోజనాలకు ఇబ్బంది తెచ్చుకుంటారు. ఈ విషయం మీరు ఊహించినదే అయినా న్యాయం కోసం పాటుపడతారు. పదవిలో ఉండి అందరికీ మేలు చేస్తారు. దైవం నావైపు ఉన్నదనే భావన మీకు కొండంత బలాన్ని, ఉత్సాహాన్ని ఇస్తుంది. నిత్యం సిద్ధగంథాన్ని ధరించండి, శుభప్రదంగా ఉంటుంది. అనారోగ్య కారణాల వల్ల, టెన్షన్ వల్ల ముఖ్యమైన పరీక్షకుగాని, ఇంటర్వ్యూలకుగాని సరైన న్యాయం చేయలేరు, ఫలితాలు ప్రతికూలంగా ఉంటాయని భావిస్తారు, భయపడ్తూ మీరు చేసిన పనులు విజయవంతం అవుతాయి. ఆత్మవిశ్వాసం ఎప్పుడూ మిమ్ములను రక్షిస్తుంది. ఆత్మవిశ్వాసంతో చేసే ఏ మంచి పనికి అయినా మంచి ఫలితాలు ఉంటాయి. స్త్రీలతో చమత్కారాలు, కబుర్లు, గంటలు గంటలుగా ఊహా సంభాషణలు, మొదలైనవాటితో కాలం దొర్లిపోతుంది. దీనివలన అభివృద్ధి, ప్రయోజనం ఉన్నాయో లేదా దేవుడికే తెలియాలి. మనం చేసే పనులను సమాజం గ్రహిస్తుందని గ్రహించండి. అపనిందలు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాయి. వాటికి మీరే అవకాశం కల్పిస్తే ఎలా? మీ మనస్సులో దురుద్దేశ్యం లేకపోవచ్చు, సమాజానికి మాత్రం మీ చేష్టలు కనబడతాయి, వినబడతాయి, మనస్సు మాత్రం కనిపించదు. విద్యార్థినీ విద్యార్థులు సరస్వతి తిలకం ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. ఉపాధ్యాయులలో దైవభావం కలిగి ఉండుట మంచిది. కీలక సందర్భాలలో వాళ్ళ అవసరం ఉంటుందని మరచిపోవద్దు. టూవీలర్ కొనుగోలు చేయవద్దు, రాహుదశ, శనిదశ నడుస్తున్న ముగ్గురు కలసి ప్రయాణం చేయవద్దు. ఉద్యోగానికి అప్లికేషన్లు పెట్టేటప్పుడు తప్పులు లేకుండా చూసుకోండి. నిపుణుల సలహా తీసుకోండి, నామర్దాగా భావించవద్దు. అనుకూలమైనటు వంటి గురు గ్రహప్రభావం వల్ల ఊహించిన దానికన్న మంచి ఫలితాలు వస్తాయి. తొందరగా ఉద్యోగంలో చేరి డబ్బులు సంపాదించి ఇంట్లో ఇవ్వాలన్న మీ కొరిక తప్పక నెరవేరుతుంఉది. మీ మనస్తత్వమే మిమ్ములను దైవానికి దగ్గర చేస్తుంది. భగవంతుని పాత్ర కూడా అర్థవంతమైనదే. కృషి ఫలించాలని ప్రార్థిస్తారు తప్పులేదు, చేయడానికి పని ఇవ్వమని కోరుతారు తప్పులేదు, అత్యాశ కోరికలు ఉండవు. సామాజిక సేవాసంస్థలలోనూ, ఆధ్యాత్మిక కేంద్రాలలోనూ, యూనియన్లలోనూ ఏ పదవీ నిర్వహించకుండా సేవ చేస్తారు. సామాన్యరీతిగా ఉంటేనే స్వేచ్ఛగా ఉంటారని భావిస్తారు. సంవత్సర ద్వితీయార్థంలో ఆర్థికంగా పుంజుకుంటారు. విలువైన స్థిరచరాస్తుల కొనుగోలు చేస్తారు. ఋణాలు తీరుస్తారు, తనఖాలు విడిపిస్తారు. వ్యాపారంలో లాభాలు, ఉద్యోగంలో స్థితి బాగుంటుంది. కొన్ని రాజకీయ కారణాల వల్ల భూమి ధర పెరుగుతుంది. ఇందువల్ల మీకు ఆర్థికబలం ఏర్పడుతుంది. బ్యాంకు ఋణాలు, సింగిల్ సెటిల్మెంట్లు పూర్తవుతాయి. వ్యాపార విస్తరణ చేస్తారు, బ్రాంచీలు నెలకొల్పుతారు. కుడి మోకాలినొప్పి బాధించవచ్చు, కంటి సైటు పెరుగుతుంది. యోగా, మెడిటేషన్ వల్ల, ప్రకృతి వైద్యం వల్ల ప్రయోజనాలు పొందలేరు. దైవాంశ సంభూతులమని చెప్పుకునే వారి మాయమాటలు నమ్మి నష్టపోతారు. ఇలాంటివారిని నమ్మితే ఇలాంటి "మహిమలే" ఎదురవుతాయని సరిపెట్టుకుంటారు. సినీరంగంలో, టీవి రంగంలో ఉన్నవారికి నూతన అవకాశాలు కలిసివస్తాయి, అవార్డులు లభిస్తాయి. శివాలయంలో పూజారికి ఐదుకిలోల బియ్యం, వస్త్రం, మీ శక్తిమేర దక్షిణ ఇవ్వండి, మంచి జరుగుతుంది. ప్రతి విషయాన్ని ప్రశాంతంగా ఆలోచన చేసే మనస్తత్వం వల్ల మేలు జరుగుతుంది. తల్లిదండ్రులు, వృద్ధులు, పెద్దలు మిమ్ములను ప్రేమగా చూసుకుంటారు. మానసిక దృఢత్వం అలవరచుకోండి. ప్రతి విషయంలో

సున్నితత్వం పనికిరాదు. పెద్దవాళ్ళ మనస్సు కష్టపెట్టకండి, ప్రతిరోజు అష్టమూలికా తైలంతో దీపారాధన చేయండి. నాగ సింధూరాన్ని ధరించండి, నరదృష్టికి దూరంగా ఉండండి. తొమ్మిదింట సంచరించు గురురాహువుల ప్రభావం, వ్యయంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, తృతీయంలో సంచరించు కేతుగ్రహ ప్రభావం, రవిచంద్ర గ్రహణాలు, గురుశుక్ర మౌఢ్యములు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. అన్నదాన పథకాలకు విరాళాలు ఇస్తారు. సాంకేతికపరమైన కొన్ని ప్రయోగాలు ఫలిస్తాయి. ఆప్యాయత, ఆత్మీయత తెంచుకున్న ఓ జీవితో మీరు శాశ్వతంగా విడిపోతారు. మనో దుఃఖం కలుగుతుంది. భగవంతుని సంకల్పానికి ఎదురీదలేమని గ్రహిస్తారు. కొన్ని సంఘటనలు చూసిన తరువాత విధి అనెడి రెండు చిన్న అక్షరముల మాట ఎంతో బలీయమైనదని విధి సృష్టించిన విషవలయాన్ని ఎవరూ దాటలేరని గ్రహిస్తారు. అధికారుల వేధింపులు భరించలేక ఎదురు తిరుగుతారు. నీతినిజాయితీ, శక్తిసామర్థ్యాలు, నియమబద్ధమైన జీవితం, నిత్యదేవాతారాధన అన్నీ వ్యర్థం అని భావిస్తారు. దొడ్డిదారి రాజకీయాలు, లంచాలు, కులమతాలు, ప్రాంతీయ విచక్షణ అభివృద్ధికి సోపానాలు అని స్పష్టంగా తెలుసుకుంటారు. దొంగలు, సమర్థులతో కలిసి ఉన్నత శిఖరాలు అధిరోహించేకన్నా చెప్పులు లేని కాళ్ళతో నడిచి వెళ్ళడం ఉత్తమమని భావిస్తారు. దేవుడిమీద కోపం వచ్చినా అది తాత్కాలికమే, ఆధ్యాత్మిక కార్యక్రమాలు యథావిధిగా చేస్తారు. వివాహం చేసుకున్న కొద్ది రోజులకే భేదాభిప్రాయాలతో విడిపోవాలని నిర్ణయించుకున్న దంపతులను చూసి నైరాశ్యం ఏర్పడుతుంది. వాళ్ళను కలిపే ప్రయత్నాలు ఫలించవు. ఈ రకమైన ధోరణి సమాజంలో ఉన్మాదంగా మారడం మీ మనోవేదనకు కారణం అవుతుంది. ప్రేమ వివాహాల పట్ల మీ అభిప్రాయాలను మార్చుకుంటారు, ప్రోత్సహించకూడదని నిర్ణయించుకుంటారు. మనస్సులో మాట స్పష్టంగా చెప్పడం వల్ల లౌక్యం లేక ముక్కుసూటిగా ప్రవర్తించడం వల్ల స్వతంత్ర నిర్ణయాల వల్ల చాలా సమస్యలను ఒంటరిగా ఎదుర్కోవలసి వస్తుంది, ధైర్యంగా ఎదుర్కొంటారు. మనస్సులోని ఆలోచన వ్యూహం ఇతరులకు తెలియనివ్వరు, మీ వ్యూహాన్ని అమలు చేసే ముందు ఆత్మీయులకు తెలియజేస్తారు. ఐతే వాళ్ళ సలహాలను స్వీకరించరు. మీ ఆలోచనలను అమలు చేస్తారు. ముఖ్యమైన బాధ్యతలు మీకు అప్పగించ బడతాయి. ప్రచండమైన సింహగర్జనకు అడవిలో జంతువులు పారిపోయినట్లుగా మిమ్ములను చూసి మీ శత్రువర్గం గజగజలాడిపోతుంది. ప్రతి విషయంలోనూ విజయం నాదేనన్న అహంభావం కానీ, మితిమీరిన ఆత్మవిశ్వాసం కానీ కలిగి ఉండరు. ప్రతి విషయంలో శాంతంగా వ్యవహరిస్తారు. సర్వసంగ పరిత్యాగులైన నిజమైన స్వామీజీలు మీకు సన్నిహితం అవుతారు. వాళ్ళ ప్రబోధనలు మీకు మంచి మార్గం చూపిస్తాయి. మనశ్శాంతిని కలిగిస్తాయి. దీవెనలు, కోరికలు మన ఆశలు, జరిగేది దైవసంకల్పం. ఒకానొక కీలక సమయంలో మీ స్వంత మనుషులను ఆదుకునే అవకాశం మీకు వస్తుంది. అయినా అధికారానికి స్వేచ్ఛలేదని భావిస్తారు, సహాయపడలేరు. కఠినమైన ధర్మము అనెడి బంగారు గొలుసులతో బంధించబడిన చేతులకు స్వేచ్ఛ ఉండదని తెలియ బరుస్తారు. పెట్టుబడిపెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు, ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలు ఈ సంవత్సరం జీవితాశయం సాధిస్తారు. నూతన నిర్ణయాలు ఫలిస్తాయి. ఆర్థికంగా కొంత మెరుగైన ఫలితాలు సాధిస్తారు. కుటుంబ పురోగతికి శారీరకంగా, మానసికంగా శ్రమిస్తారు. పొదుపు చేసిన ధనంతో స్థిరాస్థి కొనుగోలు చేస్తారు.

ఆభరణాల పట్ల గతంలో ఉన్న మోజు తగ్గుతుంది. అవివాహితులైన వారికి వివాహ కాలం, సన్నిహిత బంధువుల విమర్శలు బాధించినా పైకి లెక్కచేయనట్లుగా ఉంటారు. మీ నుండి ఎటువంటి వ్యతిరేకత లేకపోయినా ముఖ్యమైన వాళ్ళు మీ నుండి దూరం వెళ్ళిపోతారు. న్యాయపరమైన చిక్కులు, పోరాటాలు ఓ దరికి చేరతాయి. మిమ్ములను ఉద్దేశ్యపూర్వకంగా ఇబ్బంది పెట్టేవాళ్ళను వదిలించుకోవాలని నిర్ణయించుకుంటారు. చాలా సందర్భాలలో మీకు ఇష్టంలేని విషయంపైనే చర్చించవలసి వస్తుంది. మన ఇష్టాఇష్టాలతో సంబంధం లేకుండా భగవంతుడే నిర్ణయాలు తీసుకుంటాడని కొన్ని సంఘటనలు నిరూపిస్తాయి. పి.హెచ్.డి వంటివి పూర్తవుతాయి. సివిల్ సర్వీస్‌లకు, పోటీ పరీక్షలకు ఎంపిక అవుతారు. సరదాగా ఇతర భాషలు నేర్చుకుంటారు. వినోదం పేరిట ప్రసారం అవుతున్న అసభ్య సీరియల్స్‌కు దూరంగా ఉంటానని నిర్ణయించుకుంటారు. ముఖ్యంగా పిల్లలు టీవి చూడకుండా జాగ్రత్త వహిస్తారు. పెళ్ళిచూపులు వంటి తతంగాలు మీకు నచ్చవు, సనాతన సాంప్రదాయాలను గౌరవించాలని కుటుంబ ప్రతిష్ట నిలబెట్టడానికి కొన్ని ఇష్టంలేని పనులు చేస్తారు. మీరు ఓ ప్రశాంతమైన దారిలో వెళుతుంటే మిమ్ములను మరో మార్గంలోకి లాగాలని మీ మిత్రులు ప్రయత్నిస్తారు, ఆశలు చూపిస్తారు. పరుగెత్తి పాలు తాగే కన్నా నిలబడి నీళ్ళు తాగడానికే మొగ్గుచూపుతారు, మీ మీద ఏ ప్రలోభాలూ పనిచేయవు. సంతానం మీద మీరు పెంచుకున్న ఆశలు సఫలీకృతం అవుతాయి. కొంత మందికి పోటీ పరిక్షలలో మంచి మార్కులు వచ్చినా ఇంటర్వ్యూలలో మాత్రం చేదు అనుభవాలు ఎదురవుతాయి. ఎట్టకేలకు అదృష్టం మిమ్ములను వరిస్తుంది. దిగులు చెందకండి. ప్రేమ వివాహాలు విఫలం అవుతాయి. చాలా మందికి మీ సంపాదన మీద ఉన్న ప్రేమ మీ మీద ఉండదు. ఈ విషయాన్ని కాస్త ఆలస్యంగా గ్రహిస్తారు. ప్రతిరోజు, ప్రతినిత్యం అష్టమూలికా తైలంతో, లక్ష్మీ తామర వత్తులతో దీపారాధన చేయండి. 'దైవికం' అనే పొడితో ధూపం వేయండి. శ్రీలక్ష్మీ చందనాన్ని ధరించండి. శ్రీలక్ష్మీ చందనంతో మహాలక్ష్మీ పూజ చేయండి. విదేశీయాన సంబంధమైన విషయాలు ఫలిస్తాయి. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలో సీటు వస్తుంది. ధనుస్సు రాశివారికి ఏలినాటి శని నడుస్తున్న కారణం చేత ఎనిమిది శనివారాలు శనికి తైలాభిషేకం చేయాలి, అఘోర పాశుపత హోమం చేయాలి. విదేశాల నుండి వచ్చిన సమాచారం వల్ల భవిష్యత్ కార్యాచరణలో మార్పులు చేస్తారు. మారుతున్న ప్రపంచ స్థితిగతులు మిమ్ములను ప్రభావితం చేస్తాయి. సంతానం లేని వారికి సంతానప్రాప్తి (సంతాన పాశుపత హోమం చేయండి). విద్యార్థినీ విద్యార్థులు సరస్వతి తిలకాన్ని ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. గృహనిర్మాణ సంబంధమైన మీ కల నెరవేరుతుంది. విద్యా, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో రాణిస్తారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలకు నిర్దిష్ట సమయం కేటాయిస్తారు. మోకాళ్ళ నొప్పులు, కీళ్ళనొప్పులు, పాదాల మంటలు బాధించే అవకాశం ఉంది. కేశ సంరక్షణకు తగిన ప్రాధాన్యతనివ్వండి, జుట్టురాలిపోకుండా జాగ్రత్తపడండి. పరోక్షంగా మీ మీద ఆధారపడ్డ రక్తసంబంధీకులకు, సన్నిహితులకు మీ శక్తికి మించిన సహాయం చేస్తారు. కొన్ని సందర్భాలలో స్వతంత్ర నిర్ణయాలు తీసుకోవాలని భావించినా తండ్రి మీద ఉన్న ప్రేమ అందుకు అడ్డంకి అవుతుంది. మొత్తం మీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





# 2016-2017 లో మకరరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 8 | వ్యయం - 8 | రాజ - 7 | అవ - 2 |

**ఉత్తరాషాఢ 2, 3, 4 పాదములు, శ్రవణం 1, 2, 3, 4 పాదములు, ధనిష్ఠ 1, 2 పాదముల యందు పుట్టినవారు "జో, జా, జీ, జూ, జే, ఖా, గా, గీ" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మకరరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

మకరరాశి వారికి ఈ సంవత్సరము మిశ్రమ ఫలితాలు సూచిస్తున్నాయి. వృత్తి, ఉద్యోగాల పరంగా అభివృద్ధి, స్థిరత్వం కలుగుతుంది. సంవత్సర ప్రథమార్థంలో ఆర్థికస్థితి అంతంత మాత్రంగా ఉంటుంది. ముఖ్యమైన రెండు కార్యక్రమాలు శని గ్రహ అనుకూలత వల్ల పూర్తి అవుతాయి. అడ్డంకిగా మారినటువంటి కొన్ని ఇబ్బందికరమైన విషయాలు వస్తాయి. స్వయంకృతాపరాధాల వల్ల నష్టాన్ని పూరించుకోవడానికి కఠినమైన క్రమశిక్షణతో మిమ్ములను మీరు సరిదిద్దుకునే ప్రయత్నాలు చేస్తారు. కొత్త మిత్రులు దూరం అవుతారు, పాతమిత్రులు దగ్గరవుతారు. రాజకీయ పరమైన విషయాలలో మీ జోక్యం అనివార్యం అవుతుంది. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ మీ రాజకీయ ప్రవేశం ఉంటుంది. మీరు కొనుగోలు చేసిన స్థిరాస్తి విలువ పెరుగుతుంది. మాహోన్నతమైన ఆశయాలు కలిగిన వ్యక్తితో కలిసి పనిచేయాలనుకునే మీ ఆరాటం ఫలిస్తుంది. సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్న వారికి మీ సలహాలు, సంప్రదింపులు అవసరం అవుతాయి. మొండికి పడిన ఓ అధికారి ఎంత మంది ముఖ్యులు చెప్పినా, మీకు అనుకూలంగా నిర్ణయాలు తీసుకోకపోవడం జరుగుతుంది. మీ పాలిట సైంధవుడిలా అడ్డుపడుతున్న ఆ అధికారికి స్థానచలనం సంభవిస్తుంది, దాంతో మీ సమస్య తీరుతుంది. మీరు కోరుకున్న మంచి ఉద్యోగ అవకాశం దొరుకుతుంది. సాఫ్ట్‌వేర్ రంగంలోని వారికి శక్తి సామర్థ్యాలకు తగినటువంటి మంచి ఉద్యోగం లభిస్తుంది. విదేశాలలో చదువుకోవాలనే మీ ఆరాటం ఈ సంవత్సరం ఫలిస్తుంది. అంతేగాక విదేశాలలో ఉద్యోగం చేయటానికి అవకాశం కోసం ఎదురు చూస్తున్నవారికి అటువంటి అవకాశాలు లభిస్తాయి. ఆరోగ్య పరంగా చిన్న చిన్న చిక్కులు ఏర్పడతాయి. కుడి మోకాలికి సంబంధించి ఎలాంటి నొప్పులు రాకుండా జాగ్రత్త పడండి. స్పెక్యులేషన్‌కు దూరంగా ఉండండి. మిమ్ములను నిత్యం పొగిడే భజన బృందాలకు దూరంగా ఉండండి. మోసగాళ్ళ మాటలు విని ఆత్మీయులను దూరం చేసుకుంటారు. మీ కార్యక్రమాలన్నీ క్రమశిక్షణాయుతంగా, రహస్యంగా ముందుకు సాగుతాయి. సహోదర, సహోదరీ వర్గానికి మీ కుటుంబ సభ్యులకు తెలియకుండా ఆర్థిక సాయం అందిస్తారు. విలువైన భూమిని కొనుగోలు చేస్తారు, కమర్షియల్ ఏరియాలో ఒక అపార్ట్‌మెంటు కొనుగోలు చేస్తారు. మీ కొనుగోళ్ళు అన్నీ గోప్యంగా ఉంటాయి. ఉద్యోగంలో బదిలీ వేటు తప్పక పోవచ్చు, అయితే కొన్ని సాంకేతిక కారణాల వల్ల మీ బదిలీ ఆగిపోతుంది. విద్యాపరంగా అభివృద్ధి

బాగుంటుంది. పోటీ పరీక్షలలో విజయం సాధిస్తారు. ఓ ముఖ్యమైన వ్యక్తికి మీరు ఆంతరంగికులు కావడం వల్ల ఆ వ్యక్తి చేసే తప్పుడు పనికి మీరే కారణం అని వైరివర్గం భావిస్తారు. అయితే వాస్తవ రూపంలో ఇది కొంత వరకు మాత్రమే నిజం. పోలీస్ స్టేషన్స్, కోర్టులు, తగాదాలు, వివాదాలు, మధ్యవర్తి పరిష్కారాలు ఇలాంటి సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో ప్రమోషన్ లభిస్తుంది, వృత్తి, ఉద్యోగాలలో మీ బరువు బాధ్యతలు పెరుగుతాయి, కష్టపడి పనిచేస్తారు. మంచి ప్రయోజనాలు పొందుతారు. శుభకార్యాల విషయంలో మీ అంచనాలు నిజం అవుతాయి. శుభకార్యాలు నిర్విఘ్నంగా జరుగుతాయి. కర్ణుడు ప్రయోగించిన నాగాస్త్రం తృటిలో తప్పిపోయినట్లుగా పునర్వివాహ సంబంధమైన వివాహయత్నాలు తృటిలో తప్పిపోతాయి. కుటుంబంలో ఐకమత్యం సాధించడానికి మీరు చేసే ప్రయత్నాలు విఫలం అవుతాయి. కొంత మంది వ్యక్తులలో మార్పు రాదని ఆలస్యంగా గ్రహిస్తారు. మీ కళ్ళ ముందు జరుగుతున్న అన్యాయాలను మీరు నిరోధించలేక పోతారు. కొంత మంది వాటికి భయపడి అన్యాయాన్ని ఆమోదిస్తారు. ధనం ఒక్కటే శాశ్వతమని భావించిన వ్యక్తులకు మీ ధర్మసూత్రాలు నచ్చవు. నూతన వాహనయోగం, గృహయోగం కలిసివస్తాయి. కోల్పోయినటువంటి వాటిని తిరిగి పొందగలుగుతారు. ప్రజలలో మీ పేరును, ప్రతిభను రుజువు చేసుకుంటారు. “సమాజం” అనే చక్కని పదము అన్యోన్యతకు, ఆప్యాయతలకు పెట్టింది పేరుగా ఈ దేశంలో వర్ధిల్లింది. సమాజంలోని వ్యక్తుల పరస్పర సహాయ సహకారాల వల్ల ఎంతోమంది విద్యావంతులయ్యారు, ఉద్యోగస్తులయ్యారు. ఒకరి బాధను అందరూ పంచుకునేవారు, ఓదార్పు అందరికీ కొండంత అండగా నిలిచేది. ఇటువంటి ఆరోగ్యకరమైన సమాజం నశించిపోయి మనుషుల మధ్య ద్వేషాలు పెరిగిపోయి అకారణమైన ఈర్ష్యాద్వేషాలు ప్రధానంగా నిలిచాయి. పక్కింట్లో చనిపోతే పలకరించ లేని పరిస్థితి ఏర్పడింది. ధనం, కులమత వర్గాలు ఒక్కటే ప్రధానమైన ఆకర్షణగా నిలిచింది. చివరకు పనులు చేసుకోవటానికి బంధువులకు కూడా లంచం ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇటువంటి సమాజంలో ఏ విధంగా నెగ్గుకు రాగలుగుతాము అనే ఆందోళన మీకు కలుగుతుంది. భగవంతుని దయవలన గ్రహాల అనుగ్రహం వల్ల ఇలాంటి కుళ్ళు విషయాలను అధిగమిస్తారు, మీ స్థానాన్ని కాపాడుకుంటారు. సామాజిక పోకడలు మీపై ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, ప్రభావం చూపుతాయి. మీరు తీసుకున్న నిర్ణయాల పైన వాటి ప్రభావం ఉంటుంది. సమ్మెలు, బంధులు, ఉద్యమాలు వాటివల్ల కొన్ని సందర్భాలలో లాభపడతారు, కొన్ని సందర్భాలలో నష్టపోతారు. కార్యాలయంలో మీకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభిస్తాయి. ఉన్నత అధికారులు మీకు స్వేచ్ఛను ఇస్తారు. దాని వలన దీర్ఘకాలికంగా అన్యాయానికి గురి అవుతున్నవారికి మీ వల్ల న్యాయం జరుగుతుంది. అదే విధంగా మీ ఉత్తర్వులు వివాదాస్పదమవుతాయి. కొందరు కోర్టుకు ఎక్కుతారు. ఇందులో మీకు ఎలాంటి స్వార్థ ప్రయోజనాలు లేవు గనుక నిశ్చింతగా ఉంటారు. సివిల్ సర్వీసులకు ఎంపిక అవుతారు. మీ ఆధ్వర్యంలో నడిచే విద్యా సంస్థలు, సేవాసంస్థలు పురోగమనంలో ఉంటాయి. ఆధ్యాత్మిక రంగంలో ఉన్నవారికి మంచి పేరు ప్రఖ్యాతలు, ధనం లభిస్తాయి. మీ పాండిత్యానికి, కృషికి అన్ని విధాలుగా తగిన గుర్తింపు లభిస్తుంది. సంవత్సర ద్వితీయార్థంలో కొన్ని మంచి పనుల నిర్వహణకు, కుటుంబ భవిష్యత్తుకు విశేషంగా ధనాన్ని ఖర్చుచేస్తారు. కొన్ని వ్యాపార వ్యవహారాలకు సంబంధించి మీరు తీసుకునే నిర్ణయాలు ఆలస్యం కావడం వల్ల అనుకున్న ప్రయోజనాలు సాధించలేరు. సరైన సమయంలో సరైన నిర్ణయాలు వెనువెంటనే అమలు చేయాలని నిర్ణయం తీసుకుంటారు. పెట్టుబడులు పెట్టడానికి భయపడకూడదని నిర్ణయించుకుంటారు. ఇంట్లో వాళ్ళను సంతృప్తి పరచడానికి కొన్ని విలువైన వస్తువులు కొనుగోలు

చేస్తారు. ఆపద సమయంలో చిన్ననాటి మిత్రుడు ఆదుకుంటాడు. గతించిపోయిన వ్యక్తి జ్ఞాపకాలు విశేషంగా బాధిస్తాయి. బాధలు పంచుకోవడానికి వ్యక్తులు కరువు అవుతారు, బయటి వ్యక్తులకు మీ భావాలు అర్థమవుతాయి. కుటుంబం పట్ల మీ బాధ్యతలను సక్రమంగా నిర్వహించడం లేదనే విమర్శలు వస్తాయి, నూతన వ్యక్తులను కలుపుకుని చేసే పనులు, వ్యాపార వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక ప్రయోజనాలు క్రమంగా వృద్ధిచెందుతాయి. మీ గుడ్‌విల్‌ను కాపాడుకోవడానికి నిరంతరం శ్రమించాల్సి వస్తుంది. నిర్మాణసంబంధమైన విషయాలలో లోపాలు కనిపెడతారు. అధికమొత్తంలో ధనం ఖర్చయినా మీ భాగస్వాములు ఎందుకు లెక్కలు చూపడం లేదో మీకు అర్థమవుతుంది. మీ వ్యక్తిగత విషయాలను ఆసరాగా తీసుకుని మీకు అన్ని విధాలా నష్టం తెస్తున్నారని గ్రహిస్తారు. భాగస్వాములతో విడిపోవాలని నిర్ణయించుకుంటారు. మీ అసమర్థతను మీ కుటుంబ వ్యక్తులు ఎత్తి చూపుతారు, మీ నిర్ణయాలు, ముక్కుసూటితనం, తెలివితేటలు కార్యాలయం, వ్యాపారం వరకే పరిమితంగా పనిచేస్తాయి. లౌకిక విషయాలలో కుటుంబ విషయాలలో మీ పద్ధతులు పనిచేయవు. “మేధావులు ఇతరుల సమస్యలను పరిష్కరించినంత తేలికగా సొంత విషయాలను పరిష్కరించుకోలేరని తెలుస్తుంది”. ఈ విషయాన్ని మీరు బాగా గుర్తుపెట్టుకుంటారు. మితిమీరిన ఆత్మవిశ్వాసంతో మీ వాళ్ళు చేసేపనులను మీరే అడ్డుకుంటారు. సమన్వయంతో వ్యవహరించాలని నిర్ణయించుకుంటారు. రాజకీయంగా దూకుడు నిర్ణయాలు తీసుకోకుండా ఆచితూచి వ్యవహరిస్తారు. ప్రభుత్వ సంబంధమైన గౌరవ అవార్డులు లభిస్తాయి. మీ ఎదుగుదల, అభివృద్ధి కొందరికి ఇబ్బందిగా మారుతుంది. మీ మీద ద్వేషం పెరుగుతుంది, అసూయాగ్రస్తులైన వారితో, మీ వైరివర్గంతో మీ సన్నిహితులు స్నేహితులు చేరిపోవడం మీకు ఆశ్చర్యం కలిగిస్తుంది. కొందరి విషయంలో ఉద్యోగపరంగా కొన్ని నూతన అవకాశాలు కలిసివచ్చినప్పటికీ ఆర్థికపరమైన సమస్యలను దృష్టిలో పెట్టుకుని ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగం చేయటమా? మానటమా? అనే మీమాంశలో పడతారు. వాలెంటరీ రిటైర్మెంట్ ఆలోచనలు వస్తాయి, కేవలం మాటలు చెప్పి పబ్బం గడుపుకునే వ్యక్తులవల్ల మీకు ఉపయోగం లేదని గ్రహిస్తారు. మధ్యవర్తి పంచాయితీలు, సివిల్, క్రిమినల్ కోర్టులకు సంబంధించిన విషయాలు మీకు అనుకూలంగా ఉంటాయి. కొండంత అండగా ఉంటారని భావించిన వ్యక్తులు అడ్రస్ లేకుండా పోతారు. న్యాయరంగంలోని వారికి, వైద్యరంగంలోని వారికి, ఆయుర్వేద వైద్యులకు, హెర్బల్స్ వ్యాపారులకు, ఎగుమతి, దిగుమతి, వ్యాపారస్థులకు, ఆహార సంబంధమైన వ్యాపారులకు ఈ సంవత్సరం శ్రమకు తగిన ఫలితాలు లభిస్తాయి. రహస్యంగా కొన్ని స్థిరాస్థులు కొనుగోలు చేస్తారు. గుర్తింపులేని మీరు పడిన బాధకు ఉపశమనం లభిస్తుంది, గుర్తింపు లభిస్తుంది. కంటికి సంబంధించి, సైటు పెరిగే అవకాశం ఉంది. కేశ సంరక్షణ (జుట్టు) విషయంలో జాగ్రత్తలు తీసుకోండి. కార్యాలయానికి సంబంధించిన కొన్ని విషయాలు అబద్ధాల కల్పనతోటి మీడియా ద్వారా వెల్లడవుతాయి. ఇవి పాత శత్రువులు చేసిన పనే అని గ్రహిస్తారు. కార్యాలయ ప్రతిష్టకు ఎలాంటి భంగం కలగకుండా మీరు నిలువరించ గలుగుతారు. గతంలో మీ వల్ల ప్రయోజనం పొంది రాజకీయంగా ఉన్నత స్థానాలు పొందిన వ్యక్తులు తిరిగి మీ సహాయసహకారాలు అర్థిస్తారు. ఇటువంటి రాజకీయ నక్కలను ప్రోత్సాహించ కూడదని కఠినంగా నిర్ణయం తీసుకుంటారు. ప్రజలలో మీకున్న పలుకుబడి చాలా మందికి తెలిసి వస్తుంది. సంవత్సర ద్వితీయార్థంలో బంధువులతో బంధుత్వం కలుపుకోవడానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రభుత్వ సంబంధమైన పైరవీలు ఫలిస్తాయి. ఊహించనటు వంటి మంచి పరిణామాలు వృత్తి, ఉద్యోగాలలో చోటు చేసుకుంటాయి. కొంత

ధనాన్ని ఫిక్సడ్ డిపాజిట్స్ రూపంలో దాస్తారు, ఆ ధనం మీరు అనుకున్న వ్యక్తులకు ఉపయోగపడాలని ఆశించి ఆ విధంగా చేస్తారు. బలవంతులైన ప్రత్యర్థుల బలహీనతలకు సంబంధించిన ఆధారాలు మీకు సాక్ష్యాలతో సహా దొరుకుతాయి, వాటిని మీరు సమయానుకూలంగా ఉపయోగించుకుంటారు. పునర్వివాహాల విషయంలో ఇతరులకు మీరు చేసే సహాయం ఫలిస్తుంది, మానసిక సంతోషం కలుగుతుంది. కుటుంబంలో అశాంతికి కారణమైన వ్యక్తులను గుర్తించి కూడా మీరు ఏమీ చేయలేరు. మీకులేని ఉద్దేశ్యాలను మీకు ఆపాదించి రక్త సంబంధీకులకు, సన్నిహితులకు అందరికీ దూరం చేయాలని మీ శత్రుకూటమి విశేష ప్రయత్నాలు చేస్తుంది. ఈ సందర్భంగా ఓ పెద్దమనిషి మీకు అండగా నిలుస్తాడు, ఎలాంటి దుష్పరిణామాలు కలగకుండా చేయగలుగుతాడు. రాళ్ళు, రత్నాలు వంటి ఆధ్యాత్మిక సామాగ్రి కొని మోసపోతారు. జీవిత భాగస్వామి విషయంలో ఎంతో ఉదారంగా వ్యవహరిస్తారు, గతంలో ఏర్పడిన స్పర్థలు మరచిపోయి మంచి భర్తగా వ్యవహరిస్తారు. ధైర్యసాహసాలు కలిగిన వ్యక్తిగా, స్పష్టంగా అభిప్రాయాలు చెప్పే వ్యక్తిగా ఓ మంచి పేరును సంపాదిస్తారు. వస్తు భద్రత పట్ల, ఇన్సురెన్స్ పట్ల జాగ్రత్త వహించండి. గ్రహ ప్రభావం వల్ల అన్య స్త్రీల గురించి ఆలోచనలు ఎక్కువ అవుతాయి, పరిచయాలు కూడా పెరుగుతాయి. ఈ విషయాలను ఆలోచనల వరకే పరిమితం చేస్తే మంచిది. పరిచయాలను తగ్గించుకోవడానికి, తెగతెంపులు చేసుకోవడానికి ప్రయత్నించండి. గృహంలో శుభకార్యాల పట్ల దృష్టి సారిస్తారు, బాధ్యతాయుతంగా వాటిని పూర్తిచేయగలుగుతారు. వంశ పారంపర్యంగా రావాల్సిన ఆస్తులు కొంత వివాదాస్పదం అవుతాయి. సంతానం లేనివారికి సంవత్సర ద్వితీయార్థంలో సంతానం కలుగుతుంది. పునర్వివాహం చేసుకునేవారికి కాలం అనుకూలంగా లేదు, చేతిదాకా వచ్చిన సంబంధాలు చేజారిపోతాయి. ఇలాంటి సంఘటనలు నైరాశ్యానికి, కోపానికి, వేదాంతానికి, నిర్లిప్తతతకు దారితీస్తాయి. మిత్రుల ప్రోత్సాహం వల్ల మీకు ఇష్టంలేని చిన్న చిన్న వ్యాపారాలు చేసి కొద్దిగా నష్టపోతారు. సంవత్సర ద్వితీయార్థంలో గ్రీన్ కార్డు లభిస్తుంది. హెచ్ 1 వీసా కోసం ప్రయత్నించేవారికి హెచ్ 1 వీసా లభిస్తుంది. "వెనుదిరిగిన కెరటం ఉవ్వెత్తున ఎగిసి పడినట్లు" వెనకడుగు వేస్తారని భావించిన మీ శత్రువర్గంపై విరుచుకుపడతారు. కాలం అండగా నిలిస్తే ఏమైనా చేయవచ్చుననేది వారికి రుచి చూపిస్తారు. తుపానుకు ముందు ప్రశాంతతను చూసి సంతోషపడ్డ వైరివర్గానికి తగిన గుణపాఠం చెబుతారు. అందరినీ ఏకం చేయటంలో విజయం సాధిస్తారు. సంతానం సంగీత, సాహిత్య కళారంగాలలో రాణిస్తారు. బహిరంగ సభలు, బహిరంగ సమావేశాలు ఏర్పాటు చేసేటప్పుడు ఎక్కువ జాగ్రత్తలు తీసుకోండి. అనేక సంవత్సరాలుగా ఇబ్బందులు సృష్టిస్తున్న ఓ స్త్రీ కాలం చేయడం జరుగుతుంది. అనుకూలమైన శనిగ్రహ ప్రభావం వల్ల ఆకస్మిక ధనప్రాప్తి, స్థిరాస్థుల పురోగాభివృద్ధి జరుగుతుంది. ఎంత సాధించినా, ఏమి చేసినా ఇంట్లో రాజకీయాలకు తెరపడదు. ఇంట్లో వాళ్ళే తప్పుడు లెక్కలు, దొంగ లెక్కలు చూపిస్తుంటే ఎవరికి చెప్పుకోవాలి? తల్లీ, చెల్లీ, భార్యా మధ్య సమస్యలు ఎలా పరిష్కరించాలి? ఎవరి తరపు మాట్లాడాలి? ఏమని తీర్పు ఇవ్వాలి? ఈ ప్రశ్నలకు సమాధానాలు లభించక మీరు మనోవేదనకు గురవుతారు. ఎవరికీ సర్దుకుపోయే మనస్తత్వం ఉండదు. అన్ని విషయాలలో మీరే సర్దుకుపోవాలి, సమాధానం చెప్పుకోవాలి. ప్రతిష్టాత్మకమైన విద్యా సంబంధమైన, ఉద్యోగ సంబంధమైన పోటీ పరీక్షలలో నెగ్గుతారు. సంతానం ఐ.ఐ.టి, సి.ఏ., ఎంసెట్ పరీక్షలలో కూడా రాణిస్తారు. అతీంద్రియ శక్తులు ఉన్నాయని భ్రాంతిపడి, భయపడుతున్న కొందరు వ్యక్తులను మార్చడానికి మీ శాయశక్తులా ప్రయత్నిస్తారు. గృహనిర్మాణ

సామాగ్రి వ్యాపారం చేసేవారికి, ఎలక్ట్రానిక్స్, స్టేషనరీ వ్యాపారులకు అనుకూల కాలం. జూద సంబంధమైన ఏ విషయంలోనూ చేయి పెట్టవద్దు. పరిచయాలను ఉపయోగించుకుని అన్ని విధాలుగా ఈ సంవత్సరం లాభపడతారు. చేతలు ఎక్కువగా ఉంటాయి, మాటలు తక్కువగా ఉంటాయి. ఇష్టం లేకపోయినా నలుగురి బాటలోనే మీరూ పయనిస్తారు. ఈ పయనంలో అందరికంటే మీరే అధికంగా లాభపడతారు. సాంకేతిక కారణాలవల్ల కొత్తగా కొన్ని ఋణాలను చేస్తారు, అభివృద్ధి చెందే వాటిలో ఆ ఋణాలు పెట్టుబడిగా పెడతారు. దూరప్రాంతంలో ఉన్న మీ సన్నిహితవర్గం ఆర్థిక సహాయ సహకారాలు అందజేస్తారు. సుగంధ ద్రవ్యాల వ్యాపారాలు, హోల్‌సేల్ మార్కెటింగ్, రిటైల్ మార్కెటింగ్, తక్కువ వ్యవధిలో సాగే తాత్కాలిక వ్యాపారాలు, ఆటోమొబైల్స్, నిర్మాణరంగం, ట్రావెల్స్ మొదలైన వ్యాపారాలలో ఉన్నవారికి మంచి లాభాలు లభిస్తాయి, చెల్లింపులు, రాబడులు కొంతకాలం సరిసమానంగా ఉంటాయి. ఫ్యాషన్ డిజైన్ రంగంలో ఉన్నవారికి అనుకూలమైన కాలం. విద్యార్థినీ విద్యార్థులకు మెరిట్‌మార్కులు, స్కాలర్‌షిప్‌లు లభిస్తాయి. ప్రతిరోజు ప్రతినిత్యం సరస్వతి తిలకం ధరించాలి, జ్ఞానచూర్ణాన్ని సేవించాలి. మిత్రులతోటి పోటి ఏర్పడుతుంది. మాటకు మాట చిలికి చిలికి గాలివాన అవుతుంది. ఇది మీరు ఊహించని పరిణామం. కనుక సాధ్యమైనంతవరకు సామరస్యంగా నడుచుకోండి. "దైవికం" అనే చూర్ణంతో ఉదయం సాయంత్రం ధూపం వేయండి. దుష్టశక్తులు తొలగిపోతాయి. విదేశాలలో మీరు కోరుకున్న పురోగాభివృద్ధి మీరు ఆశించిన వారివల్ల నెరవేరదు, మీ స్వయంకృషితోనే అది సాధ్యపడుతుంది. సంవత్సర ద్వితీయార్థంలో విదేశీ విషయాలపై దృష్టి సారించడం చెప్పదగిన సూచన. సంతానం వారి వారి వృత్తి, ఉద్యోగాల పరంగా అభివృద్ధి సాధిస్తారు. ప్రతిష్టాత్మకమైన కంపెనీలలో ఉద్యోగ అవకాశాలు కలిసివస్తాయి. మీలో కొన్ని బలహీనతలు చోటు చేసుకుంటాయి. దురభ్యాసాలవైపు మనస్సు పోతుంది. సుఖంగా ఉన్న జీవితాన్ని మీకు మీరుగా ఇబ్బందుల పాలు చేసుకుని మీ స్థాయిని మీరే తగ్గించుకుంటారు. అనవసరమైన కొనుగోళ్ళు చేస్తారు. ధనాన్ని దుర్వినియోగం చేస్తారు. ఆక్షన్లు అనుకూలిస్తాయి. కొన్ని సందర్భాలలో తాత్కాలికంగా భయానికి, భ్రాంతికి లోనవుతారు. ఒక విందులో జరిగిన సంభాషణలలో అపశ్రుతులు చోటు చేసుకుంటాయి, దాని వలన మీలో పరివర్తన కలుగుతుంది. ఆహార నియమాలు పాటిస్తారు. క్రమశిక్షణాయుతంగా ఉంటారు. మీరు చేసిన తప్పులను తెలుసుకుంటారు స్వయంకృతాపరాధాలు మళ్ళీ దొర్లకుండా తగిన జాగ్రత్తలు పాటిస్తారు. మీలో వచ్చిన మార్పు ఇంటిలోనివారి ఆనందానికి కారణం అవుతుంది. ఉపయోగంలేని అంశాలు ప్రక్కన పెడతారు, మానసిక వత్తిడి నుండి బయటపడతారు. నిత్యం హనుమాన్ వత్తులతో దీపారాధన చేయండి, అష్టమూలికా తైలాన్ని ఉపయోగించండి. ముఖ్యమైన పోటీ పరీక్షల ఫలితాలు కొన్ని సాంకేతిక కారణాలవల్ల పెండింగ్‌లో ఉండటం మీ అసహనికి కారణమవుతుంది. తల్లిదండ్రులను, వృద్ధులను ఏ లోటూ లేకుండా బాగా చూసుకుంటారు. కొద్దికాలం పిల్లలను వదిలిపెట్టి ఉండటం మానసిక వేదనకు కారణం అవుతుంది. స్థిరాస్థుల అభివృద్ధికి బాల్య మిత్రులతో కలిసి ఒక యూనిట్ ఏర్పరచుకుంటారు. వ్యాపారంలో స్త్రీల భాగస్వామ్యం, భార్య భాగస్వామ్యం కలిసివస్తుంది. జీవితంలో ఏదో కోల్పోయామన్న భావన, వైరాగ్యం, గతస్మృతులు మీ మనోవేదనకు కారణం అవుతాయి, అన్నీ ఉండి అనుభవించలేకపోతున్నామనే భావన మీ మనస్సుని కలవరపరుస్తుంది. పుష్కలంగా డబ్బు లేకపోయినా గతంలోనే బాగుందనే భావన పదేపదే అనిపిస్తుంది. కర్కశం అనే కాలానికి

అందరూ ఒక్కటే అన్న భావన మీకు మింగుడు పడదు. గతం అనే సముద్రంలో పడిపోయిన ఆత్మీయుల గురించి ఇంకా బాధపడటం మీ మనోధైర్యాన్ని, మనోభావాన్ని సూచిస్తుంది. మీ ముందు ఉన్న బాధ్యతలను, కఠినమైన సవాళ్ళను యాంత్రికంగా, సమర్థవంతంగా ఎదుర్కొంటారు. దొంగ స్వామీజీల వల్ల కుటుంబం అంతా నష్టపోయే అవకాశం ఉంది. దైవాంశసంభూతులమని చెప్పుకునే వారి రాక్షస స్వరూపం మీకు తెలుస్తుంది. మారుతున్న రాజకీయ, సామాజిక పరిస్థితులు, వాతావరణ పరిస్థితులు, కుల, మత,వర్గ, ప్రాంతీయ విద్వేషాలు ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ మీమీద ప్రభావం చూపుతారు. బంగారం, వెండి రాగి మొదలైన లోహపు వ్యాపారులకు కాలం అనుకూలంగా లేదు. ఇనుము, స్టీలు మొదలైన వ్యాపారులకు కాలం అనుకూలంగా ఉంది. బలమైన, నమ్మకమైన అనుచర గణం మీకు అన్ని విషయాలలో అండదండగా ఉంటారు. వారికోసం మీరు ఖర్చుపెట్టిన దానికన్నా నాలుగింతలు లాభపడతారు. దూరప్రాంతంలో ఉన్న మీ ఆత్మీయులు, బిడ్డలు పంపిన ధనాన్ని అనుకూలమైన రంగాలలో పెట్టుబడిగా పెడతారు. ఈ విషయంలో చాలా మంది నష్టపోయినా మీరు నష్టపోరు. గురు మౌఢ్యమి, శుక్ర మౌఢ్యమి వచ్చినపుడు, సూర్యగ్రహణాలు, చంద్రగ్రహణాలు వచ్చినపుడు జాగ్రత్తలు తీసుకోవాలి, నవగ్రహ వత్తులతో దీపారాధన చేయాలి. గ్రహణాలు వచ్చినపుడు 27 రోజులలోపు శివాలయంలో సర్పసూక్త సహిత మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేయించాలి, శివాలయంలోని పూజారికి వస్త్రాలు సమర్పించాలి. కళాసాహిత్య రంగాలలో, సాంస్కృతిక రంగాలలో మీ ప్రతిభకు ఉద్యోగం వస్తుంది. ఈ పోటీ ప్రపంచంలో ప్రతిదానికి ప్రత్యామ్నాయం ఉందని గ్రహిస్తారు. ఈ భావమే మీ ఎదుగుదలకు కారణం అవుతుంది. అనుకూలమైన శని గ్రహ ప్రభావం వల్ల ఉద్యోగంలో మీకు ఎదురులేని పరిస్థితి ఏర్పడుతుంది. ఇక్కడే మీరు జాగ్రత్త వహించాలి. ఒదిగి ఉంటేనే మంచి ఫలితాలు దరిచేరతాయన్న విషయాన్ని మీరు గమనించాలి. వడ్డించేవాడు మనవాడైతే ఎక్కడ కూర్చున్నా ఫరవాలేదు, కానీ విస్తరి ఉండాలనే విషయం గమనికలోకి తీసుకోండి. విస్తరి లేకపోతే నేలమీద ఎవరూ వడ్డించలేరు. తప్పులను వెనువెంటనే సరిదిద్దుకోవడం భగవంతుడు మీకు ఇచ్చిన విద్య. మీ వల్ల జరిగిన తప్పిదాలను రాత్రికిరాత్రే మీరు సవరించుకుంటారు. కార్యాలయంలో తిరిగి ఐకమత్యం సాధిస్తారు. పురాతన చరిత్రను తెలుసుకోవడానికి మక్కువ చూపిస్తారు. శుభకార్య సంబంధమైన విషయాలలో మీ మాటే చెల్లుబాటు అయ్యే విధంగా ముందు జాగ్రత్తలు తీసుకుంటారు. డాక్టర్లు, లాయర్లు,  చార్టెడ్ అకౌంటెంట్‌లకు కాలం అనుకూలంగా ఉన్నప్పటికీ ఆశించిన దానిలో డబ్బు రాదు, ఆశించని దానిలోనే డబ్బు అధికంగా వస్తుంది. కమర్షియల్ ట్యాక్స్, ఇన్ కం ట్యాక్స్, మ్యునిసిపల్ ట్యాక్స్ అధికారుల వల్ల, ఎసిబి అధికారులవల్ల, విజిలెన్స్ అధికారుల వల్ల ఇబ్బందులు రావచ్చు. అయితే ఈ ఇబ్బందులు, కొండలాగా వచ్చినా మబ్బులాగా తొలగిపోతాయి. మీ మీద ఎంతమాత్రం ప్రభావం చూపలేవు. అయితే ఇదొక గుణపాఠంగా తీసుకుని ఎవరు మీ మీద ప్రయోగించారో తెలుసుకుంటారు. తగిన సమయంలో వారికి జీవితంలో మరచిపోలేని విధంగా గుణపాఠం చెబుతారు. జనసామాన్యంలో సాధారణమైన వ్యక్తులను కూడదీసి సమిష్టిగా మహోన్నతమైన విజయాన్ని సాధిస్తారు. ఇది సమాజానికి, పేదవారికి, శ్రామిక కర్షక, కార్మికవర్గాలకు, చేతివృత్తి, పనివారికి, సన్నకారు రైతులకు మంచి ఉదాహరణగా ఉపయోగడుతుంది, స్ఫూర్తినిస్తుంది. మీ వర్గం ఐకమత్యం దెబ్బతీసే ప్రయత్నాలు నెరవేరవు. నిత్యం ఓం నమోనారాయణాయ వత్తులతో దీపారాధన చేయండి. యూనియన్స్‌ను

సమర్థవంతంగా నడుపగలుగుతారు. మీమీద అందరూ నమ్మకం కలిగి ఉంటారు. ద్వితీయంలో సంచరించు కేతుగ్రహ ప్రభావం, అష్టమంలో సంచరించు గురురాహువుల ప్రభావం, ఏకాదశంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, గురుశుక్ర మౌఢ్యములు, రవిచంద్ర గ్రహాలు ప్రధానమైన ఫలితాలను నిర్దేశిస్తున్నాయి. మొత్తంమీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. కీలకమైనటువంటి బాధ్యతలను విజయవంతంగా నిర్వహించామన్న సంతృప్తి కలుగుతుంది. ప్రతిరోజు నాగసింధూరాన్ని ధరించండి, నరదృష్టికి దూరంగా ఉండండి. పెట్టుబడిపెట్టి మోసపోయిన ఫైనాన్స్ కంపెనీల నుండి డబ్బులు రావు. ఈతలు, పిక్నిక్‌లు, బైక్ రైడింగ్‌లకు దూరంగా ఉండండి.

**స్త్రీలకు ప్రత్యేకం**

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు ఈ సంవత్సరము బాగుంది. విద్యా, విదేశీ వ్యవహారాలు లాభిస్తాయి. మీ పేరుమీద ఇతరులు చేసే వ్యాపారాలు లాభసాటిగా నడుస్తాయి. మీ ఆధ్వర్యంలో నడిచే బ్యూటీపార్లర్స్, విద్యాసంస్థలు, సామాజిక సేవాసంస్థలు బాగా నడుస్తాయి. మంచి పేరు వస్తుంది. మొండికి పడిన సంతానాన్ని ఓ దారిలోకి పెట్టగలుగుతారు. పొదుపు చేసిన ధనం అక్కరకు వస్తుంది. ప్రతిరోజు, ప్రతినిత్యం శ్రీలక్ష్మీ చందనంతో మహాలక్ష్మీని పూజించండి. శ్రీలక్ష్మీ చందనాన్ని ధరించండి. స్వగృహ యోగం కలుగుతుంది. విలువైన ఆభరణాలు, వస్తువులు ఏర్పడతాయి. ఆకస్మిక ధనప్రాప్తి కలుగుతుంది. అవివాహితులైన వారికి వివాహ కాలం, పునర్వివాహ ప్రయత్నాలు చేసేవారికి ప్రయత్నాలు ఫలిస్తాయి. యోగ, మెడిటేషన్ వంటివి చేస్తారు. ఉన్నంతలో చక్కగా కనబడటానికి ప్రయత్నిస్తారు. అలంకార సామాగ్రి అమ్మేవారికి, చిన్న చిన్న వ్యాపారాలు చేసేవారికి సానుకూలంగా ఉంది. కొంతమందికి జీవిత భాగస్వామితో విభేదాలు వస్తాయి, కొంతమంది చట్టపరంగా విడిపోయే పరిస్థితి గోరిస్తుంది. పుట్టింటి యోగక్షేమాలు ఎలా ఉన్నాయో విచారించడం పెద్ద నేరంగా పరిగణింపబడుతుంది. మీరు ఫోన్లలో, సెల్‌ఫోన్లలో ఏమేమి మాట్లాడుతున్నారో తెలుసుకోవాలని మీ ఇంట్లోవారే పరిశోధిస్తారు. ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో తెల్సుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. పోటీ పరీక్షలలో విజయం సాధించి మంచి ఉద్యోగం సాధిస్తారు. చాలా మంది దృష్టి మీ సంపాదన మీదే ఉంటుంది. విదేశాలలో చదువుకునే అవకాశాలు కలిసివస్తాయి. అవివాహితులైన వారికి వివాహం కుదురుతుంది. రాజకీయరంగంలోని వారికి పదవులు లభిస్తాయి. అనేక మందికి సలహాలు ఇచ్చి మేధావిగా, మంచి స్నేహితురాలిగా పేరు తెచ్చుకున్న మీరు స్వంత విషయాలలో నిర్ణయాలు తీసుకోవడానికి కంగారు పడతారు. జీవితంలో మొట్టమొదటిసారిగా ఓ వ్యక్తి చేతిలో మోసపోవడం జరుగుతుంది. సామాజిక సేవా కార్యక్రమాలలో మంచి పేరు లభిస్తుంది. క్రీడా సాంస్కృతిక రంగాలలో మంచి ప్రతిభ లభిస్తుంది. ఇతరుల ఈర్ష్యాద్వేషాలను లెక్క చేయకపోవడమే మీ గొప్పతనం. సహోదర సహోదరీ వర్గానికి రహస్యంగా ఆర్థిక సాయం అందిస్తారు. నిత్యం సిద్ధ గంధంతో శ్రీ వేంకటేశ్వరస్వామిని పూజించండి. ఆరావళి కుంకుమతో మహాలక్ష్మీదేవిని పూజించండి. నిత్యం సర్పదోష చూర్ణంతో స్నానం చేయండి. కార్యాలయంలో మీరు చేసే పని నలుగురికి ఆదర్శవంతమవుతుంది. అదే కొంత మంది అసూయకు కారణమవుతుంది. చిన్ననాటి స్నేహితులకు సహాయం చేయలేకపోయామన్న బాధ కలుగుతుంది. దూరప్రాంత విద్యా విషయాలు ఫలిస్తాయి. చదువుకు సంబంధించిన బ్యాంకు ఋణాలు లభిస్తాయి. పెద్దలమీద గౌరవంతో కొన్ని నిర్ణయాలు వెనక్కి తీసుకుంటారు,

బంధువులతో వున్న భేదాభిప్రాయాలు, ఉన్న ఇబ్బందులు బయటికి రాకుండా జాగ్రత్తపడతారు. ఆర్థిక వ్యవహారాలు ఓ దరికి వస్తాయి. గతంలో కొనుగోలు చేసిన స్థిరాస్థి విలువ పెరుగుతుంది. కొంత మంది విషయంలో ప్రేమ, పెళ్ళి వ్యవహారాలు వివాదాస్పదమవుతాయి, ప్రేమ వివాహాలు ముడిపడవు. జీవిత భాగస్వామితో చాలా తక్కువ సమయంలోనే విభేదాలు వస్తాయి, అసూయాగ్రస్తులైన తోటి స్త్రీలవల్ల ఇబ్బంది పడతారు. అత్యున్నతమైన సాంకేతిక విద్యను అభ్యసిస్తారు. (ఐ.ఐ.టి. వంటివి) టీవి, సినిమారంగంలో ఉన్నవారికి నూతన అవకాశాలు కలిసివస్తాయి. పోలీసు ఉద్యోగాలకు సెలెక్ట్ అవుతారు, తాత్కాలిక ఉద్యోగాలు చేసుకునేవారికి పర్మినెంట్ అవుతుంది. మొత్తంమీద ఈ సంవత్సరం సంతృప్తికరంగా ఉంటుంది. మానసిక సంతోషం కలుగుతుంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్షలు ధరించరాదు. వితంతువులు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





**జ్ఞాన చూర్ణము**

జ్ఞానము పెంపొందించుకోవడానికి అందరూ ఉపయోగించదగ్గది. ఇది ముఖ్యంగా విద్యార్థినీ, విద్యార్థులకు బాగా ఉపయోగపడుతుంది. ఇందులో సరస్వతీ ఆకు చూర్ణము సరస్వతీ హోమం చేసిన భస్మము, మారేడు పొడి కలిగి ఉంటుంది. తినడానికి అనువుగా ఉండడానికి ఇందులో పటికబెల్లం కలపడమైనది. ఈ జ్ఞాన చూర్ణము చక్కని జ్ఞాపకశక్తిని ఇస్తుంది. చదువుతున్న చదువు గుర్తుండడానికి ఇది తిరుగులేని చిట్కా.



# 2016-2017 లో కుంభరాశి ఫలితములు

| ఆదాయం - 8 | వ్యయం - 8 | రాజ - 3 | అవ - 5 |
|---|---|---|---|

**ధనిష్ఠ 3, 4 పాదములు, శతభిషం 1, 2, 3, 4 పాదములు, పూర్వాభాద్ర 1, 2, 3 పాదముల యందు పుట్టినవారు "గు, గే, గో, సా, సీ, సు, సే, సో, దా" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు కుంభరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

కుంభరాశి వారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. సంవత్సర ప్రథమార్థం, ద్వితీయార్థం రెండూ బాగున్నాయి. ముఖ్యమైన బరువు బాధ్యతలను దించుకోగలుగుతారు. ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. నిర్మాణ సంబంధమైన వ్యవహారాల పనులు పూర్తి అవుతాయి. సమాజంలో గుడ్ విల్ పెరుగుతుంది. కుటుంబం కొరకు అధికంగా ధనం ఖర్చువుతుంది. ఏదోక ఖర్చు తగ్గించుకోవాలని మీరు ప్రయత్నించినా సఫలీకృతం కాలేరు. విచిత్రమైన విషయం ఏమిటంటే అవసరం వచ్చినప్పుడు డబ్బు ఏదోకరూపంలో వస్తుంది. అవసరం లేనప్పుడు డబ్బు ఏ విధంగానూ రాదు. కొన్ని పెళ్ళి సంబంధాలు దగ్గరవరకూ వచ్చి వెనక్కి వెళ్ళిపోతాయి. అనేక రకాలైన ఒడిదుడుకులు ఏర్పడతాయి. జ్యోతిష్కుల అభిప్రాయాలవల్ల కూడా కొన్ని సంబంధాలు దగ్గరగా వచ్చి తప్పిపోతాయి. ఆటపోట్లు ఏర్పడినా చివరకు మంచి సంబంధం కుదురుతుంది. ఆధ్యాత్మికరంగంలో కొన్ని చేదు అనుభవాలు ఎదురవుతాయి. దొంగస్వామీజీలను నమ్మి మోసపోతారు. వ్యాపార విషయంలో మితిమీరిన ఆత్మవిశ్వాసంతో మీరు తీసుకున్న నిర్ణయాలు ప్రతికూల ఫలితాలు ఇస్తాయి. సన్నిహితుల సలహాలు తీసుకోనందుకు మిమ్ములను మీరే నిందించుకుంటారు. జీవిత భాగస్వామి ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు తీసుకోవాలి, నిర్లక్ష్యం పనికిరాదు. కాంట్రాక్టులు, లీజులు, లైసెన్సులు, సబ్ కాంట్రాక్టులు మొదలైనవి లభిస్తాయి. వ్యాపార విస్తరణకు ప్రారంభంలో ఆటంకాలు ఎదురైనా వ్యాపారం వృద్ధి చెందుతుంది. సంతాన పురోగతి, కుటుంబ పురోగతి బాగుంటుంది. సామాజికంగా, రాజకీయంగా ఏర్పడిన పరిస్థితుల వల్ల సంతాన విషయమై ఎక్కువ శ్రద్ధ కనబరుస్తారు. వాళ్ళని క్రమశిక్షణలో పెట్టడానికి మీ శాయశక్తులా ప్రయత్నిస్తారు. సంతానం కోసం అధికంగా డబ్బు ఖర్చు చేయవలసిన పరిస్థితులు. ఇది వృధా ఖర్చులు కావు, సంతానానికి బంగారు బాట అవుతాయి. వారసత్వంగా రావాల్సిన చరస్థిరాస్తులు మీకు దక్కుతాయి. కొన్ని సందర్భాలలో ఇంట్లో అప్రశాంత వాతావరణం, చిల్లర తగాదాలు ఏర్పడతాయి. మీ తగాదాల ప్రభావం పిల్లల మీద పడే అవకాశం ఉంది, అందువల్ల, కష్టమైనా, నిష్టురమైనా కోపానికి ఎక్కడా తావు ఇవ్వవద్దు. దూరప్రాంతాలలో ఉన్న మీ సన్నిహితవర్గానికి, రక్తసంబంధీకులకు మేలు చేస్తారు. వాళ్ళ డబ్బులతో వారి పేరుమీద ఇక్కడ ఆస్తులు కొనుగోలు చేస్తారు, వాటి విలువ ఇక్కడ నాలుగింతలు అవుతుంది. ఒక్కరూపాయి కూడా ఆశించకుండా వాళ్ళ ఆస్థులను వారికి భద్రంగా అప్పగిస్తారు. మీ బంధువులలో మీ

నిజాయితీ ప్రశంసించబడుతుంది. కొన్ని సందర్భాలలో పరిస్థితులు కలిసి రాకపోతే మీ రూపాయి పోగొట్టుకుంటారు కానీ పక్కవాళ్ళ నెత్తిమీద చేయిపెట్టరు. ఈ రకమైన వ్యక్తిత్వం భవిష్యత్తులో మీకు లాభిస్తుంది. నిరుద్యోగులైన విద్యావంతులకు తాత్కాలికంగా కొన్ని ఇబ్బందులు ఎదురైనా చిన్న చిన్న ఉద్యోగాలు చేసినా పోటీ పరీక్షలలో విజయం సాధించి మంచి ఉద్యోగాన్ని సాధిస్తారు. ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్, ఐ.ఆర్.ఎస్. మరియు గ్రూపు సర్వీసులకు ఎంపిక అవుతారు. రాజకీయ రంగంలో ఉన్నవారికి రాజకీయపరమైన నిర్ణయాలు లాభిస్తాయి. కొంతమంది ముఖ్యమైన రాజకీయ నాయకులతో విభేదాలు ఏర్పడినా, మీదే పైచేయి అవుతుంది. సంతానం జీవితంలో స్థిరపడటం మానసిక సంతోషానికి కారణమవుతుంది. వంశవృద్ధి ఉంటుంది (మనవాళ్ళు, మనవాళ్ళు). వాళ్ళ కోసం మరింత ఉత్సాహంగా శ్రమిస్తారు. కొన్ని సామాజిక కార్యక్రమాలు విజయవంతంగా పూర్తిచేస్తారు. కొన్నింటి బాధ్యతలను తీసుకుంటారు. నిజాయితీతో కూడిన మీ సేవలు అందరిలో ప్రశంసించబడతాయి, ప్రభుత్వపరంగా అవార్డులు లభిస్తాయి. ఆస్థుల విలువ పెంచుతారు, కుటుంబసభ్యుల అవసారాలు గమనించి ఎంతో ధనాన్ని వెచ్చించి వాళ్ళకు కావాల్సినవన్నీ ఏర్పరుస్తారు. నూతనమైన గృహాన్ని కొనుగోలు చేస్తారు. వాహనాలు మార్పు చేస్తారు. ప్రతి విషయం మీ కనుసన్నల్లోనే జరుగుతుంది. మీ ఆధ్వర్యంలో నడుస్తున్న విద్యా సంస్థలు, వ్యాపారసంస్థలు విస్తరణ చెందుతాయి, మంచి ప్రఖ్యాతి చెందుతాయి. ఈ సందర్భంగా ఒరిగిపోయిన ఓ జీవి జ్ఞాపకాలు పదేపదే వేధిస్తాయి. భగవంతుని నిర్ణయాన్ని మీరు జీర్ణం చేసుకోలేరు. ఆధ్యాత్మిక భావాలు మీ ఆవేదనకు అడ్డుకట్ట వేయలేవు. ఇన్ని విజయాలు సాధించినా సంఘంలో గొప్ప స్థాయి సాధించినా అనేక విజయాలు అష్టైశ్వర్యాలు భగవంతుడు ఇచ్చినా అవి చూసి సంతోషపడడానికి, అనుభవించడానికి నా హితుడు, సన్నిహితుడు, ప్రేమికుడు శాశ్వతంగా దూరం అయ్యాడన్న బాధ మిమ్ములను ఎంతగానో వేధిస్తుంది. సంతోషంలోనూ, దుఃఖంలోనూ పోయినవారి జ్ఞాపకాలే గుర్తుకువస్తాయి. జీవితంపైన తీవ్రమైన నైరాశ్యం ఏర్పడుతుంది. ఇక చేసేది ఏమీ లేక వారి పేరుమీద కొన్ని ధర్మ కార్యక్రమాలు చేస్తారు. మీరు ప్రేమించి, అభిమానించే వ్యక్తులు అభివృద్ధి చెందుతారు. కొన్ని కారణాల వల్ల మీ ఆధ్వర్యంలో నడిచే విద్యాసంస్థల వంటి వాటికి సేవాసంస్థల వంటి వాటికి కొన్ని సందర్భాలలో మంచి, కొన్ని సందర్భాలలో చెడు ప్రచారం జరుగుతుంది. అయితే సంస్థల గుడ్‌విల్ దెబ్బతినదు. ఏది ఏమైనా నరదృష్టి, మీ పట్ల వ్యతిరేకత, అపనిందలు, చెడు ప్రచారం చేసేవారు ఉంటారు. నిత్యం నాగ సింధూరాన్ని ధరించండి. కీళ్ళనొప్పులు, ఇ.ఎన్.టి సమస్యలు ఇబ్బంది పెడతాయి. ప్రకృతివైద్యాల పట్ల, వనమూలికల పట్ల ఎక్కువ ఆకర్షితులవుతారు. అందుకు సంబంధించిన గ్రంథాలను ఆసక్తిగా పరిశీలిస్తారు. పట్టువదలని విక్రమార్కుడిలాగా మూర్ఖులైనవారిని సరైన దారిలో పెట్టడానికి మీరు చేసే ప్రయత్నాలు విఫలమవుతాయి. ఇందు వలన సమయం, ధనం వృధా అవుతాయి. తరతమ భేదం పాటించకుండా కొంత మంది వ్యక్తులను వాళ్ళ ఖర్మకు వదిలి వేయడమే చెప్పదగిన సూచన. ఎగుమతి దిగుమతి వ్యాపారం కలసి వస్తాయి, ఉద్యోగంలో ప్రమోషన్ వస్తుంది. స్నేహం అన్న మూడు అక్షరముల మెత్తని మాట ఆప్యాయతా, అనురాగాలకు దీర్ఘకాలిక జ్ఞాపికం అవుతుంది. స్నేహంలో ఉన్న నమ్మకమే నయవంచన, ఆశ్రిత పక్షపాతానికి కారణమై నమ్మిన వాళ్ళను నట్టేట ముంచుతుంది. కనుక గుడ్డిగా ఎవరినీ నమ్మవద్దు. ప్రతి విషయంలోనూ చాలా జాగ్రత్త అవసరం. సాంస్కృతిక, క్రీడారంగాలలో మీ ప్రతిభా పాటవాలు గుర్తింపుకు నోచుకుంటాయి. అదే సమయంలో నీచ రాజకీయాలను అధిగమిస్తారు. కార్యాలయంలో సమర్థవంతంగా పనిచేస్తున్న మీరు మంచి కోసం కొన్ని

సంస్కరణలు, మార్పులు చేస్తారు. సోమరిపోతులకు మీ ఉత్తర్వులు నచ్చవు. చట్టంలో ఉండే లొసుగులను ఉపయోగించుకుని మిమ్ములను ఇబ్బంది పెట్టే ఆలోచన చేస్తారు. చివరికి మీ నిజాయితీయే గెలుస్తుంది. సమాజంలో ఉన్నటువంటి ఇలాంటి అనారోగ్య పరిస్థితులు కుల, మత, వర్గ, ప్రాంతీయ ద్వేషాలు అగ్ని జ్వాలలుగా సమాజాన్ని ఆవరించడం మీకు భరించలేని అంశంగా మారుతుంది. కృషికి, సామర్థ్యానికి, ధర్మానికి కాని కాలం దాపురించిందని సమర్థించుకుంటారు. మనస్సులో భావాలు ఏ విధంగా ఉన్నా నలుగురు నడిచిన దారిలోనే నడవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. మీ అంతరాత్మసాక్షికి విరుద్ధంగా కొన్ని ముఖ్యమైన పత్రాల మీద సంతకాలు చేస్తారు. జన సంబంధమైన, నూనె సంబంధమైన, ఖనిజ సంబంధమైన వ్యాపార వ్యవహారాలు మీకు లాభిస్తాయి. మీకు వచ్చిన లాభాలలో కొంత శాతం సామాజిక, ఆధ్యాత్మిక అవసరాల కోసం ఖర్చుపెడతారు. మీ దగ్గర లంచాలు తీసుకున్న వాళ్ళు అవినీతి గురించి మాట్లాడటం మీకు చెప్పరాని ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అవినీతి గురించి మాట్లాడడానికి అవినీతి పరులకే ఎక్కువ హక్కు ఉందని మీరు భావిస్తారు. అనుకోకుండా పిల్లల విషయంలో ఖర్చులు తెచ్చిపెడతాయి. మీ బాధ్యతలు విస్మరించకుండగా పిల్లల విషయంలో తగిన విధంగా ప్రవర్తిస్తారు, ఖర్చుచేస్తారు. చాలా సందర్భాలలో సమస్యల నుండి తప్పించుకోవడానికి అవకాశం ఉన్నా ఆ విధంగా చేయక సమస్యలను, బాధ్యతలను సమర్థవంతంగా ఎదుర్కొంటారు. నైతిక ధర్మానికి ప్రాతిపదికగా నిలుస్తారు. పాల ఉత్పత్తులు, తత్సంబంధిత వ్యాపారాలు చేసేవారికి కాలం అనుకూలంగా ఉంది. వ్యాపారాన్ని మరింత విస్తృతం చేస్తారు. రాజకీయ పదవి లభిస్తుంది. ప్రతిష్టాత్మకమైన యూనివర్సిటీలో సీటు లభిస్తుంది. అత్యున్నత సాంకేతిక విద్యను అభ్యసిస్తారు. మందు వ్యాపారం, మద్యం వ్యాపారం తక్కువ ఖరీదు కలిగిన గృహముల వ్యాపారాలు లాభిస్తాయి. అయితే సగానికి పైగా లాభాలు పెట్టుబడుల రూపంలో చూసుకోవాల్సి వస్తుంది. ఏది ఏమైనా ఈ మాత్రం లాభపడటం మంచిదని సంతోషిస్తారు. అనవసరమైన ఆలోచనలు చేసి మనస్సు చెడగొట్టు కోకూడదు, అత్యాశకు దూరంగా ఉంటారు. తెలియని విషయాలు తెలుసుకోవడానికి అన్యభాషలు నేర్చుకోవడానికి ప్రాధాన్యతనిస్తారు. ఈ సంవత్సరం చిరకాల కల సాకారం అవుతుంది. కొంత మంది దంపతుల విషయంలో చట్టరీత్యా శాశ్వతంగా విడిపోవడం జరుగుతుంది. కుటుంబ సంబంధమైన కలహాలు, భార్య వేధింపులు, కోర్టులు, పోలీస్‌స్టేషన్లు మొదలైన వ్యవహారాలన్నీంటికీ తెరపడుతుంది, తాత్కాలిక ప్రశాంతత లభిస్తుంది. కోరితెచ్చుకున్న కోడలు ఊహించనటువంటి సమస్యలను సృష్టిస్తుంది. సమాజంలో వివిధ రంగాలలో పేరుప్రఖ్యాతలు చెందిన వ్యక్తులకు సన్మాన సత్కారాలు చేసి మంచి పేరు తెచ్చుకుంటారు. మీరు ఏ విషయం చెప్పినా కాదు, వద్దు అని అపశకునాలు పలికి మిమ్ములను నిరుత్సాహపరిచే వ్యక్తులు, మీరు కార్యక్రమాలు ప్రారంభించ గానే సిగ్గు విడిచి మరలా మీతో నడిచివస్తారు. ఆస్తులకోసం, ధనంకోసం తల్లిదండ్రులతో కూడా వివాదం కల్పించే ప్రయత్నాలు కొందరు చేస్తారు. మీకు లేని ఉద్దేశ్యాలను మీపై ఆపాదించి రక్తసంబంధీకులకు దూరం చేయాలని బంధువులలో ఓ కూటమి విశేష ప్రయత్నాలు చేస్తుంది. అయితే వీటన్నింటినీ మీరు సమర్థవంతంగా ఎదుర్కోగలుగుతారు, మీ వ్యక్తిత్వాన్ని నిరూపించు కుంటారు. జ్యేష్ఠకుమారుడు లేక జ్యేష్ఠ కుమార్తె విషయంలో సంతోషించదగినటువంటి పురోగతి సంవత్సర ద్వితీయార్థంలో కలుగుతుంది. లాటరీలు, జూదాలు, క్రికెట్ బెట్టింగులు పనికిరావు. ఇష్టదేవతా ప్రార్థనలో మనస్సు లగ్నం అవుతుంది. ఏకాంతంగా ఎక్కువసేపు భగవదారాధన చేయగలుగుతారు. సంవత్సర ద్వితీయార్థం వచ్చేటప్పటికి ఆర్థికంగానూ, ఆస్తులపరంగానూ,

శక్తిసామర్థ్యాలపరంగానూ బలోపేతం కాగలుగుతారు. ఇతరుల పట్టలేనంత ఉన్నత స్థితిలో ఉంటారు. స్త్రీలతో సంబంధ బాంధవ్యాలు రచ్చకెక్కనంత వరకూ మీకు వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు. నకిలీ ఆధ్యాత్మిక సామాగ్రి కొని మోసపోతారు. ఏరోనాటికల్ ఇంజనీరింగ్ చదువుతున్న వారికి, చదువు పూర్తయినవారికి మంచి అవకాశాలు కలసివస్తాయి. పోలీసుశాఖలో పనిచేస్తున్న వారికి మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. అవార్డులు లభిస్తాయి. వ్యాపార లావాదేవీలలో భాగస్వాములు పరోక్షంగా స్వంతలాభాలు చూసుకుని, సామూహిక, సంస్థాగత ప్రయోజనాలను పట్టించుకోరు. హోటల్స్ నడిపేవారికి అనుకూల కాలం. హోటల్ కొనుగోలు మీద దృష్టిసారిస్తారు. ప్రభుత్వ పరంగా రావాల్సిన రాయితీలు లభిస్తాయి. విద్యాపరంగా, ఉద్యోగపరంగా అభివృద్ధి బాగున్నప్పటికీ ఇతరులతో పోల్చి చూసుకున్నప్పుడు కొంత లోటుగా అనిపిస్తుంది. ఇలాంటి వాటిని పట్టించుకోకుండా కృషిని కొనసాగించడమే చెప్పదగిన సూచన. నిత్యం అష్టమూలికా తైలంతో అరటినార వత్తులతో దీపారాధన చేయండి, సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి. ఈ సంవత్సరం రుద్రపాశుపత హోమం చేయించాలి. పగలకు, ప్రతీకారాలకు అతీతంగా పెద్దమనిషిగా వ్యవహరిస్తారు. కొన్ని సందర్భాలలో ఎందుకు కృషి చేస్తున్నామో, దానికి అంతం ఏమిటో అర్థంకాని అయోమయస్థితి ఏర్పడుతుంది. అయినప్పటికీ కార్యక్రమాలను మధ్యలో వదిలివేయరు. మంచి ఫలితాలు వచ్చేవరకూ కృషి చేస్తారు. డాక్యుమెంట్స్ మీద సంతకాలు చేసేటప్పుడు ఒకటికి రెండుసార్లు పరిశీలించుకుని ఆ కాగితంపై సంతకం చేయండి. మీరు ఎలాంటి ఫైనాన్స్ స్కీములలో చేరవద్దు. గణితవిద్యకు (సి.ఏ) సంబంధించి విశేషంగా కృషిచేసి అనుకూల ఫలితాలు సాధిస్తారు. ఎంతోకాలంగా వేధిస్తున్న ఓ సమస్యను పరిష్కరిస్తారు. విద్యార్థినీ విద్యార్థులు ఉన్నత విద్యాకోర్సులను అభ్యసిస్తారు, స్కాలర్‌షిప్పులు లభిస్తాయి. సంఘంలో పలుకుబడి కలిగినవారి అండ, ఆశీస్సులు లభిస్తాయి. దారిద్ర్యానికి దూరంగా కుటుంబాన్ని ఉంచాలనే ఉద్దేశ్యంతో దివారాత్రులు కష్టపడతారు. గతంలో కొనుగోలు చేసిన స్థిరాస్థి అమ్ముడు పోకుండా ఇబ్బంది పెడుతుంది. డబుల్ రిజిస్ట్రేషన్ వల్ల నష్టం వచ్చే అవకాశం ఉంది, జాగ్రత్త వహించండి. ఉన్నంతలో విలాసవంతమైన జీవితం గడుపుతారు, పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. మానవీయ కోణంలో మీరు గడుపుతున్న జీవనం కొందరికి కంటకప్రాయం అవుతుంది, మీరు పనిచేస్తున్న విధానం మీ పై అధికారులకు తప్ప ఇతరులకు నచ్చదు. మీ అంతర్గత భావాలని, కోపాన్ని అదుపుచేసుకుని మనస్సులో ఓ విధంగా పైకి ఓ విధంగా ఉంటారు. మనస్సు విప్పి మాట్లాడటంవల్ల సమస్యలు వస్తాయని అనుభవపూర్వకంగా తెలుసుకుంటారు. వివాహాది శుభకార్యాలు ఘనంగా పూర్తిచేస్తారు. కుటుంబంలో మరొకరి సంపాదన మొదలవుతుంది. ఆభరణాల భద్రత విషయంలో జాగ్రత్తగా ఉండాలి, చోర భయం పొంచి వుంది. ప్రేమవివాహాల పట్ల మీ అభిప్రాయాలు వివాదాస్పదం అవుతాయి. మీ ఎదుగుదలను మీ ఆత్మీయవర్గం, బంధువర్గం సహించలేరన్న విషయాన్ని కొన్ని సంఘటనలు రుజువు చేస్తాయి. ఇది మీకు అత్యంత ఆశ్చర్యం కలిగిస్తుంది. మీరు దూరంగా ఉంచాలన్న వ్యక్తులతోటి మీ కుటుంబసభ్యులు సన్నిహితంగా ఉండడం మీ మనోవేదనకు కారణం అవుతుంది. ఆంతరంగిక విషయాలలో ఇతరుల జోక్యాన్ని అతికష్టం మీద నిరోధిస్తారు. మీకు దక్కవలసిన ప్రయోజనాలకుగాను స్వల్పమైన సాంకేతిక సమస్యలు ఏర్పడతాయి. దానిగురించి మీరు పెద్దగా ఆందోళన చెందవలసిన అవసరం లేదు. కాస్త ఆలస్యమైనా మీ ప్రయోజనాలు మీ చేతికి అందుతాయి. సహోదర సహోదరీవర్గానికి కొన్ని బాధ్యతలు మీ నెత్తిన పడతాయి. ధర్మాన్ని అధిక్రమించలేక కుటుంబ సభ్యులను ఒప్పించలేక మానసిక ఒత్తిడికి లోనవుతారు. నిత్యం సర్వరక్షా చూర్ణంతో స్నానం చేయండి. మీకు జరిగిన

నమ్మకద్రోహానికి తగిన ప్రతీకారం తీర్చుకుంటారు. ఉన్నత స్థానాన్ని అధిరోహించడానికి మీ శత్రువర్గం చేసే ప్రయాత్నాలకు అడ్డుపడతారు, శత్రువర్గాన్ని జయిస్తారు. వాస్తవాలకు అతీతంగా ఊహాలోకంలో మీరు తీసుకున్న నిర్ణయాలు సక్రమమైన ఫలితాలు ఇవ్వవు, ఏకపక్ష నిర్ణయాలు కూడా కలిసిరావు. నలుగురితో కలిసి చర్చించి, నిపుణుల సలహాలు తీసుకుని, మీ ఆలోచనలు అమలు చేయండి మేలు జరుగుతుంది. ఊరేగింపులు, ఉద్యమాలు, నిరాహారదీక్షలు, సామాజిక పోరాటాలు మొదలైనవి చక్కగా నిర్వహించగలుగుతారు. వాయిదాల చెల్లింపులపైన ఓ స్థిరాస్థిని కొనుగోలు చేస్తారు. కీలక సమయంలో కర్ణుడు భార్గవ అస్త్రాన్ని మరచిపోయినట్లుగా, మీరు కొన్ని విషయాలను మరచిపోతారు. అందువల్ల కొంత నష్టం జరుగుతుంది. ఇలాంటి తప్పిదాలు జరగకుండా జాగ్రత్తపడాలని భావిస్తారు, డైరీ మెయిన్‌టెయిన్ చేసే పద్ధతి ప్రారంభిస్తారు. ప్రేమ వివాహాలు ఫలించవు. కొన్ని అవమానాలు ఎదురయ్యే పరిస్థితులు గోచరిస్తున్నాయి. సమాజంలో మీకంటే ఎక్కువ స్థాయిలో ఉన్నవారు మీ మాటను ధిక్కరిస్తారు, మీ ముందు పొగడడమూ, మీ చాటున తిట్టడం కొంత మందికి నిత్యకృత్యం అవుతుంది. గట్టిగా మాట్లాడి సాక్ష్యాధారాలు చూపించి కొన్ని వివాదాస్పదమైన అంశాలను పరిష్కరించ గలుగుతారు. పురుషులకు సంబంధించి దీర్ఘకాలికంగా వివాహం కాక, ఇక వివాహం కాదు, మీకు వివాహ యోగం లేదు అని నిర్ధారించుకుని బాధపడుతున్న వారికి ఈ సంవత్సర ద్వితీయార్థంలో వివాహం అవుతుంది. దురుసుగా అహంకారంతో మాట్లాడుతున్న వారికి పద్ధతులు మార్చుకోమని తీవ్రంగా హెచ్చరిస్తారు. ఈసారి మంచిగా చెప్పడం జరగదని హెచ్చరిస్తారు. పూజలు హోమాది క్రతువులు చేస్తారు. ఇన్సురెన్స్, ఫైర్ ఇన్సురెన్స్ మొదలైన వాటి పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించండి. చిన్న చిన్న చేతి వృత్తులు, చిన్న చిన్న వ్యాపారాలు చేస్తున్న వారికి, రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి మంచి ఫలితాలు సంభవిస్తాయి. ఆధ్యాత్మిక సంబంధమైన వృత్తులలో ఉన్న వారికి పరీక్షా కాలం. ఈ సంవత్సరం ఏదైనా ఒక సోమవారం శివాలయంలో అభిషేకం చేసి, పూజారికి వస్త్రాలు దానంగా ఇవ్వండి, మంచి జరుగుతుంది. క్రీడారంగంలోని వారికి కుళ్ళు రాజకీయాలు, ఇబ్బందులు ఏర్పడతాయి. టీవీ, సినిమారంగంలోని వారికి ఆశాజనకం గోచరిస్తున్నాయి. చిత్రకళాకారులకు, ఆర్ట్ డిజైన్ చేసే వారికి మంచి ఫలితాలు గోచరిస్తున్నాయి. విద్యార్థినీ విద్యార్థులు సరస్వతీ తిలకం ధరించాలి, జ్ఞానచూర్ణం సేవించాలి. ప్రొఫెసర్స్ చేతిలో ఉన్న మార్కులు సంతృప్తికరంగా లభించవు. భాగస్వామ్య వ్యాపారంలో లాభాల పంపకాల విషయంలో మీకు అన్యాయం జరిగే అవకాశం ఉంది. ఉన్నత స్థానాలలో ఉన్నవారు, పెద్దలు, గౌరవనీయులు సమసమాజ నిర్మాణానికే కంకణం కట్టుకున్నామని చెబుతున్న పెద్దలు మీ పట్ల అన్యాయమైన తీర్పునిస్తారు. ఎవరో చేసిన పనికి మీరు బాధపడాల్సి వస్తుంది. మనఃస్సాక్షికి గురౌతారు. న్యాయం, ధర్మం గాడితప్పి సామాజిక స్పృహ కోల్పోయి మీకు జరిగిన అన్యాయాన్ని ఎవరు ఖండించరు ప్రేక్షకపాత్ర వహిస్తారు. కాలం అనంతమైనది చాలా గొప్పది. ఈశ్వరేచ్ఛననుసరించి కాలమే అన్యాయానికి సమాధానం చెబుతుంది. మీ ద్వారా పనులు చేయించుకుని, మీ శ్రమను, శక్తిసామర్థ్యాలను ఉపయోగించుకుని కొంతమంది వ్యక్తులు ఇవ్వవలసిన ప్రతిఫలం కన్నా తక్కువ ఇచ్చి ఎంతో చేశామని చెప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. ఆ ధనాన్ని మీరు తిరస్కరిస్తారు. మీరు అనుకున్నది సాధించడానికి ఏటికి ఎదురీదుతారు కొంత వరకు అనుకూల ఫలితాలు సాధిస్తారు. ఆత్మీయులైనవారు వక్రమార్గంలో వెళుతుంటే అడ్డుకుని మంచి సలహాలు చెబుతారు. అందు వలన మీరు విరోధులు అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. మీ మాటలు వారి చెవికెక్కవు. వాళ్ళ జీవనగమనంలో మార్పురాదు. మరీ మాట్లాడితే ఈ దుస్థితికి కారణం నువ్వే అని మిమ్ములను నిందించే పరిస్థితి వస్తుంది. మాతృ

సంబంధిత వర్గం నుండి వివాహ సంబంధిత విషయాలు ప్రస్తావనకు వస్తాయి, బంధువులు పూనుకుని ఐకమత్యంగా నిర్ణయాలు తీసుకుంటారు. మీరు అతి గోప్యంగా ఉంచడం వల్ల మీ అంతరంగిక వర్గానికి విసుగు కలుగుతుంది. ఎంతో ఆశపెట్టుకుని చేసిన పనికి తగిన ప్రతిఫలం లభించకపోవడం మీ నిరాశకు కారణం అవుతుంది. సమయం కోసం వేచి ఉండడం తప్ప చేయగలిగింది ఏమీ లేదని గ్రహిస్తారు. అనవసరమైన వ్యక్తుల గురించి చర్చించడం, మీకు సంబంధంలేని విషయాల గురించి బహిరంగ ప్రకటనలు చేయడం మంచిది కాదు. కుటుంబసమేతంగా విదేశీయానం చేస్తారు. ఆత్మీయ వర్గానికి ఋణాలు యిచ్చి ఆదుకుని వాళ్ళకు విరోధం అవుతారు. భగవదనుగ్రహం వల్ల ఉన్నటు వంటి స్థాయికి ఇబ్బంది లేదు. సమాజ స్వరూపం గ్రహించి సందర్భానికి తగిన నిర్ణయాలు తీసుకుని నష్టపోకుండా మీ ప్రయోజనాలను కాపాడుకుంటారు. సమాజంలో వివాదాస్పదమైన వ్యక్తులు మీకు సన్నిహితులు అవుతారు. వీళ్ళ వల్ల భవిష్యత్తులో ఇబ్బంది ఉందని గ్రహిస్తారు, వీళ్ళను ఎలా వదిలించుకోవాలో తెలియక ఆలోచనలో పడతారు. ప్రతిరోజు సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, దైవికం అనే ధూపంతో పొగవేయండి, దుష్టశక్తులకు దూరంగా ఉంటారు. లగ్నంలో సంచరించు కేతుగ్రహ ప్రభావం, సప్తమంలో సంచరించు గురురాహువుల ప్రభావం, దశమంలో ఫలితాలు సాధిస్తారు. ఆత్మీయులైనవారు వక్రమార్గంలో వెళుతుంటే అడ్డుకుని మంచి సలహాలు చెబుతారు. అందు వలన మీరు విరోధులు అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది, మీ మాటలు వారి చెవికెక్కవు, వాళ్ళ జీవన గమనంలో మార్పురాదు. మరీ మాట్లాడితే ఈ దుస్థితికి కారణం నువ్వే అని మిమ్ములను నిందించే పరిస్థితి వస్తుంది. మాతృ సంబంధిత వర్గం నుండి వివాహ సంబంధిత విషయాలు ప్రస్తావనకు వస్తాయి, బంధువులు పూనుకుని ఐకమత్యంగా నిర్ణయాలు తీసుకుంటారు. మీరు అతి గోప్యంగా ఉంచడం వల్ల మీ అంతరంగిక వర్గానికి విసుగు కలుగుతుంది. ఎంతో ఆశపెట్టుకుని చేసిన పనికి తగిన ప్రతిఫలం లభించకపోవడం మీ నిరాశకు కారణం అవుతుంది. సమయం కోసం వేచి ఉండడం తప్ప చేయగలిగింది ఏమీ లేదని గ్రహిస్తారు. అనవసరమన వ్యక్తుల గురించి చర్చించడం, మీకు సంబంధంలేని విషయాల గురించి బహిరంగ ప్రకటనలు చేయడం మంచిది కాదు. కుటుంబ సమేతంగా విదేశీయానం చేస్తారు. ఆత్మీయవర్గానికి ఋణాలు యిచ్చి ఆదుకుని వాళ్ళకు విరోధం అవుతారు. భగవదను గ్రహం వల్ల ఉన్నటువంటి స్థాయికి ఇబ్బంది లేదు. సమాజ స్వరూపం గ్రహించి సందర్భానికి తగిన నిర్ణయాలు తీసుకుని నష్టపోకుండా మీ ప్రయోజనాలను కాపాడుకుంటారు. సమాజంలో వివాదాస్పదమైన వ్యక్తులు మీకు సన్నిహితులు అవుతారు. వీళ్ళవల్ల భవిష్యత్తులో ఇబ్బంది ఉందని గ్రహిస్తారు, వీళ్ళను ఎలా వదిలించుకోవాలో తెలియక ఆలోచనలో పడతారు. ప్రతిరోజు సర్పదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, దైవికం అనే ధూపంతో పొగవేయండి, దుష్టశక్తులకు దూరంగా ఉంటారు. లగ్నంలో సంచరించు కేతుగ్రహ ప్రభావం, సప్తమంలో సంచరించు గురురాహువుల ప్రభావం, దశమంలో సంచరించు శనిగ్రహ ప్రభావం, గురుశుక్ర మౌఢ్యములు, రవిచంద్ర గ్రహణాలు ప్రధానమైన విషయాలను నిర్ధేశిస్తున్నాయి. ఎంత ధనం వచ్చినా అంత ఖర్చులను ఎదుర్కోవడానికి విసుగు విరామం లేకుండగా శ్రమిస్తారు. ఒక సామాజిక వర్గం అయినవారి అండదండలు లభించడం వలన అన్ని విధాలుగా లాభపడతారు. రాజకీయ నాయకులు మీకు ఇచ్చిన వాగ్దానాలు తప్పుతారు. పన్నులు వసూలు చేసే అధికారులవల్ల కృత్రిమంగా ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఖర్చులు ఎంతగా ఉన్నప్పటికీ

ఆర్థికపరమైన ఇబ్బంది ఉండదు. సంతానం మొండి వైఖరి వల్ల కొంత మనస్తాపం కలుగుతుంది. ఏది ఏమైనప్పటికీ సంవత్సరం ప్రథమార్థం, ద్వితీయార్థం బాగున్నాయి, సమాజంలో మీ స్థాయి పెరుగుతుంది.

## స్త్రీలకు ప్రత్యేకం

ఈ రాశిలో జన్మించిన స్త్రీలకు చాలా బాగుంది. మీ పేరు మీద చేసే వ్యాపారాలు లాభసాటిగా నడుస్తాయి. మొండికి పడిన సంతానాన్ని ఓ దారిలో పెట్టగలుగుతారు. పొదుపు చేసిన ధనం ఉపయోగపడుతుంది. స్వగృహం లేనివారికి స్వగృహం ఏర్పడుతుంది. విలువైన ఆభరణాలను, వస్తువులను కొనుగోలు చేస్తారు. అవివాహితులైనవారికి వివాహ కాలం, పునర్వివాహ ప్రయత్నాలు చేసేవారికి ప్రయత్నాలు పలిస్తాయి. శారీరక వ్యాయయము, యోగా మొదలైనవి చేస్తారు. ఉన్నంతలో చక్కగా కనబడటానికి ప్రయత్నిస్తారు. అలంకార సామాగ్రి అమ్మేవారికి, చిన్న చిన్న వ్యాపారాలు చేసేవారికి, బ్యూటీ పార్లర్స్ నడిపేవారికి కాలం బాగుంది. కుటుంబ సంబంధమైన వ్యవహారాలు మధ్య మధ్యలో చికాకు పెడతాయి. కొంత మంది విషయంలో జీవిత భాగస్వామితో విభేదాలు తారాస్థాయికి చేరి చట్టబద్ధంగా విడిపోయే పరిస్థితి గోచరిస్తుంది. పుట్టింటి యోగక్షేమాలు ఎలా ఉన్నయో విచారించడం పెద్ద నేరంగా పరిగణించబడుతుంది. ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. ఉన్నత విద్యాయోగం ఉంది (పిహెచ్.డి వంటిది) సివిల్ సర్వీసులకు ఎంపిక అవుతారు. పోటీ పరీక్షలలో విజయం సాధించి మంచి ఉద్యోగాలు సాధిస్తారు. గ్రీన్ కార్డు లభిస్తుంది. మోకాళ్ళనొప్పులు వెన్నునోప్పులు బాధించే అవకాశం ఉంది. పెద్దవాళ్ళు చెప్పిన మంచి మాటలు వినకపోవడం వల్ల నష్టపోతారు. సంతాన పురోగాభివృద్ధి మానసిక ఆనందానికి కారణం అవుతుంది. పిల్లల విషయమై జీవిత భాగస్వామితో కొన్ని సందర్భాలలో విభేదాలు వస్తాయి. కుటుంబానికి ఆర్థికంగా అండగా ఉంటారు. ఆరోగ్య పరంగా జాగ్రత్తలు అవసరం, గైనిక్ ప్రాబ్లమ్స్ ఇబ్బంది పెట్టే అవకాశం ఉంది. పరీక్షల పరంగా మంచి మెరిట్ మార్కులు సాధిస్తారు. జ్యేష్ట సంతాన విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనబరచాల్సిన పరిస్థితులు ఏర్పడతాయి. ప్రేమ పెళ్ళిళ్ళు, కులాంతర వివాహాలు చర్చనీయాంశం అవుతాయి. మీరు మనోధైర్యంతో కుటుంబ అభివృద్దే ధ్యేయంగా పరిశ్రమిస్తారు. వ్యాపారపరమైన విషయాలు అనుకూలంగా ఉన్నాయి. మీకు రావాల్సిన స్థిర చరాస్తులు కోర్టు ద్వారా వస్తాయి. ఇతరులు డాక్యుమెంట్స్‌లో చేసిన మార్పులవల్ల (మోసం) కొంత వరకు నష్టపోతారు. అయినవాళ్ళు, సన్నిహితులు మీ ప్రయోజనాలకు గండి కొడతారు. సమాజంలో మానవీయ కోణాలు, స్నేహం,ధర్మం నశించి కేవలం ధన ప్రాతిపదిక మీదనే ప్రపచం నడుస్తుందని గ్రహిస్తారు. దుష్టులకు, దుర్మార్గులకు సహాయం చేయకూడదని నిశ్చయించుకుంటారు. సంతానంలేని వారికి సంతానప్రాప్తి, ఉద్యోగపరంగా ప్రమోషన్ వస్తుంది. కొంతమంది వ్యక్తులు నమ్మకద్రోహం చేస్తారు. మనోధైర్యం వహించండి. సమాజంలో అనాదిగా స్త్రీ మోసపోవడం జరుగుతుందని గ్రహించి సరిపెట్టుకోండి. కళాశాలలో ర్యాగింగ్ చేస్తున్నవారికి తగిన విధంగా బుద్ధి చెబుతారు. మంచి ధైర్యసాహసాలు ప్రదర్శిస్తారు. స్త్రీ అంటే అబల కాదు సబల అని నిరూపిస్తారు. డ్రైవింగ్, మార్షల్ ఆర్ట్స్ నేర్చుకుంటారు. అధునాతన పోకడలపట్ల ఆకర్షితులవుతారు, మీరు ధరించే దుస్తులు, మాట్లాడే విధానం ఈ కాలానికి తగిన విధంగానే ఉంటుంది. సనాతన సాంప్రదాయాల గురించి మీ దగ్గర మాట్లాడటానికి పెద్దవాళ్ళు సహితం జంకుతారు. మనకిష్టమైన పద్ధతిలో మనం జీవించే హక్కు ఉందని మీరు భావిస్తారు. డిజైనింగ్ వర్క్ చేసేవారికి, ఎంబ్రాయిడరీ వర్క్ చేసేవారికి కాలం అనుకూలంగా ఉంది, సీజనల్ వ్యాపారాలుర

చేసేవారికి ఈ సంవత్సరం కలసివస్తుంది. పూజాద్రవ్యాలు అమ్ముకునే షాపుల వారికి కూడా చాలా బాగుంది. విదేశీయాన ప్రయత్నాలు ఫలిస్తాయి. విదేశాలలోమీ మనస్సుకు తగిన ఉద్యోగం దొరుకుతుంది. స్వయంకృషితో కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు మీకు మీరుగా పూర్తిచేసుకొగలుగుతారు. మీ పేరుమీద ఉన్న స్థిరాస్థి విలువ పెరుగుతుంది. జీవితంలో ఓ ఆత్మీయుడితో విడిపోవాల్సిన పరిస్థితులు ఏర్పడతాయి. స్త్రీకి స్త్రీయే శతృవు అన్న విషయం మీ విషయంలో ఋజువు అవుతుంది. అనేక రకాలుగా అష్టకష్టాలుపడి న్యాయబద్ధంగా మీకు రావాల్సిన ఉద్యోగాన్ని సాధించుకుంటారు, కోర్టు తీర్పుల వల్ల మీ ఉద్యోగానికి న్యాయం జరుగుతుంది. రాజకీయరంగంలో ఉన్నవారికి పదవులు లభిస్తాయి. కళాసాంస్కృతిక రంగాలలో ఉన్నవారికి మంచి ప్రఖ్యాతి లభిస్తుంది. అవార్డులు వస్తాయి. బంధువులతో వైరం ఏర్పడుతుంది. నిష్కారణమైన ఈర్ష్యాద్వేషాలకు మందులేదని గ్రహిస్తారు. బానిసత్వపు సంప్రదాయాలు ప్రక్కనపెట్టి, స్వేచ్ఛాజీవితాన్ని కోరుకుంటారు. ఆధ్యాత్మిక ప్రసంగాల పట్ల ఆకర్షితులవుతారు. దైవాంశసంభూతులమని చెప్పుకునే వారి మాటలు విని మోసపోతారు. ప్రేమవివాహాలు కలిసిరావు. బంధువులు, సహచారులు, పెద్దల మనస్సు బాధపడే విధంగా ప్రవర్తిస్తారు. ప్రతిరోజు సర్వదోష నివారణ చూర్ణంతో స్నానం చేయండి, తులసి చెట్టుకు ప్రతిరోజు నీళ్ళు పోయండి. ప్రతి శుక్రవారం శ్రీలక్ష్మి చందనంతో మహాలక్ష్మీదేవి పూజ చేయండి. అష్టమూలికా తైలంతో, లక్ష్మి తామర వత్తులతో దీపారాధన చేయండి. అన్ని విధాలా బాగుంటుంది. పునిస్త్రీలు, కన్యలు రుద్రాక్ష ధరించకూడదు, వితంతువులు రుద్రాక్షలు ధరించవచ్చు.

**మీ వ్యక్తిగత జాతకం గురించి తెలుసుకోవాలంటే సంప్రదించండి.**

**8466932223/4/5, 9014126121**





## సరస్వతీ తిలకము

జ్ఞాన వృద్ధికి, విద్యారంగములో విజయప్రాప్తికి, జ్ఞాపకశక్తి వృద్ధికి, సరస్వతీ కటాక్షమునకు ధరించే కుంకుమ ఈ సరస్వతీ తిలకము ! విద్యార్థినీ విద్యార్థులే కాక పెద్దవారు కూడా ధరించదగినది. అష్ట ద్రవ్యములు, సరస్వతీ తైలము, ఆవు నెయ్యి మొదలైన వాటితో మూలా నక్షత్రము శుక్రవారము నాడు సరస్వతీ హోమము 7 రోజులు చేసి ఆ హోమ భస్మమును కుంకుమ రాళ్ళతో, సరస్వతీ ఆకు పొడి, పసరు, దిష్టిచెట్టు చూర్ణముతో మిశ్రమము చేయుట జరుగుతుంది.



# 2016-2017 లో మీనరాశి ఫలితములు

| | | | |
|---|---|---|---|
| ఆదాయం - 02 | వ్యయం - 08 | రాజ - 01 | అవ - 07 |

**పూర్వాభాద్ర 4వ పాదము, ఉత్తరాభాద్ర 1, 2, 3, 4 పాదములు, రేవతి 1, 2, 3, 4 పాదముల యందు పుట్టినవారు "ది, దు, శ్యం, ఝా, దా, దే, చా, చి" అను అక్షరములు తమ పేరునకు మొదట గలవారు మీనరాశికి చెందినవారు.**

## 2016-2017 సంవత్సర ఫలితములు

మీన రాశివారికి ఈ సంవత్సరం చాలా బాగుంది. ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. ఋణాలు తీర్చివేస్తారు. నూతన నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభిస్తారు. స్థిరాస్థులపరంగా కలసి వస్తుంది. విద్యా, ఉద్యోగ సంబంధమైన విషయాలు బాగుంటాయి. సంవత్సర ప్రథమార్ధంకన్నా, ద్వితీయార్థం బాగుంటుంది. ప్రభుత్వ పరంగా రావాల్సిన ఉత్తర్వులు కాస్త ఆలస్యంగా చేతికి అందుతాయి. రాజకీయంగా అనుకూలంగా ఉంది. సామాజిక సేవాకార్యక్రమాలలో మంచి పేరు వస్తుంది. మీమీద ఆధారపడిన అనేకమందిని ఆదుకుంటారు. న్యాయం చేస్తారు. అనుకూలమైన బుధగ్రహ ప్రభావాల వల్ల ఏ పని చేపట్టినా తిరుగులేకుండా ఉంటుంది, ప్రజాకర్షణ ఏర్పడుతుంది. భాగస్వామ్య వ్యాపారంలో మీరే కీలకమైన వ్యక్తి అవుతారు. మీ పలుకుబడి ఉపయోగించి ప్రభుత్వ పరంగా మంచి ఆర్డర్లు తీసుకువస్తారు, మంచి లాభాలు పొంద గలుగుతారు. సమాజంలో ఉన్నతస్థానంలో ఉన్న వ్యక్తులతో కలిసి పనిచేస్తారు. స్త్రీల వల్ల కొన్ని ఉపయోగాలు ఏర్పడతాయి. చాలామంది మీ పట్ల నమ్మకం కలిగి వాళ్ళ సమస్యలను చెప్పుకుంటారు. వాళ్ళ సమస్యలు పరిష్కరించి స్త్రీల దగ్గర ఓ నమ్మకాన్ని ఏర్పరచుకోగలుగుతారు. సంవత్సర ద్వితీయార్థంలో రెండు నెలలు వృత్తి, ఉద్యోగాల పరంగా సంతృప్తి ఉండదు. సాంకేతిక పరమైన విద్యారంగంలో రాణిస్తారు. అత్యున్నత సాంకేతిక విద్యను (ఐ.ఐ.టి వంటివి) అభ్యసించడానికి అవకాశాలు కలసివస్తాయి. సంతానపరమైన విషయాలు సజావుగా ఉన్నప్పటికీ, జ్యేష్ఠ కుమార్తె, లేక జ్యేష్ఠ కుమారుని విషయంలో జాగ్రత్తలు తీసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. నూతన భాగస్వాములతో కలిసి కొత్త వ్యాపారాన్ని ప్రారంభిస్తారు. వ్యాపారంలో లాభాలు సంతృప్తి కరంగానే ఉంటాయి. భాగస్వాముల అసమర్థతవల్ల అధికారులతో చిక్కులు వస్తాయి. ఉద్యోగంలో స్థానచలనం తప్పక పోవచ్చు. అయినప్పటికీ మీ ఉనికిని కాపాడు కోగలుగుతారు. కుటుంబంలో, బంధువులలో ఏకాభిప్రాయం సాధించి ఎంతోకాలంగా ఉన్న సమస్యలను పరిష్కరించ గలుగుతారు. జరగవు అనుకున్న శుభకార్యాలు ఆకస్మికంగా ముడిపడతాయి, పెళ్ళి ఘనంగా చేయాలని నిర్ణయించుకుంటారు. దురభ్యాసాలు కలిగి, క్రమశిక్షణలేని మీ సన్నిహితులవల్ల ఇబ్బందిపడతారు. ఇసుక నుండి తైలం తీయవచ్చు. ఇష్టంలేని వ్యక్తుల నుండి ప్రేమాభిమానాలు సాధించడంవల్ల కాదని గ్రహిస్తారు. కఠినమైన నిర్ణయాలు తీసుకోవాల్సి వస్తుంది. కొంతకాలం రక్తసంబంధీకులతో విభేదాలు చోటు చేసుకుంటాయి. కంటికీ, కళ్ళకు సంబంధించిన అనారోగ్యాలు రావచ్చు. మనోనిగ్రహంతో కఠినమై క్రమశిక్షణతో

| | |
|---|---|
| | లగ్నం, రాత్రి 11.20 ని, గర్భాదానం, వృశ్చికలగ్నం, అర్థరాత్రి. |
| 18-2-2017, శనివారం, సప్తమి | విశాఖ, మేషలగ్నం ఉ.12.23ని బోర్లు వేయుటకు, విదేశీ ప్రయాణాలకు, వృషభలగ్నం, 12.07ని క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, అష్టమి, అనూరాధ, మకరలగ్నం, తె 5.10 వివాహం, గృహప్రవేశం, శంకుస్థాపన. |
| 19-2-2017, ఆదివారం, అష్టమి | అనూరాధ, మేషలగ్నం ఉ.10.39, వివాహం, గృహప్రవేశం, శంకుస్థాపన, వృషభలగ్నం మ.గం.12.02ని. అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, క్రయ విక్రయాదులు, జ్యేష్ఠ, తులాలగ్నం, రాత్రి.11.04ని, గర్భాదానం, జ్యేష్ఠ, వృశ్చికలగ్నం, 12.15ని, పశ్చిమదిశ విదేశీ ప్రయాణాలకు, మూల, మకరలగ్నం. |
| 21-2-2017, మంగళవారం, దశమి | మూల, మేషలగ్నం, ఉ.10.28ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, వృషభలగ్నం తె.11.50ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుట. |
| 22-2-2017, బుధవారం, ఏకాదశి | పూర్వాషాఢ, మేషలగ్నం, ఉ.10.20ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, ఉపనయనం, క్రయవిక్రయాలు, దస్త్రము, తులాలగ్నం, అర్థరాత్రి 11.05 గర్భాదానం. |
| 23-2-2017, గురువారం, ద్వాదశి | ఉత్తరాషాఢ, వృషభలగ్నం ఉ.11.40ని, అన్న ప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, తులాలగ్నం, రా.11.08, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| | వృశ్చికలగ్నం రా.12.09, వివాహం, గృహప్రవేశం |
| 24-2-2017, శుక్రవారం, త్రయోదశి | శ్రవణం, మేషలగ్నం, ఉ.10.19ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, తులాలగ్నం, అర్థరాత్రి 11.04ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| | వృశ్చికలగ్నం 12.05 ని., వివాహం, గృహప్రవేశం. |
| 25-2-2017, శనివారం చతుర్దశి | ధనిష్ఠ, మేషలగ్నం, ఉ.10.10ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము తులాలగ్నం, అర్థరాత్రి, 10.47ని, వివాహం, గృహ ప్రవేశం, గర్భాదానం, వృశ్చిక లగ్నం, అర్థరాత్రి 11.57ని, వివాహం, గృహప్రవేశం. |

## ఫాల్గుణ మాసం

| | |
|---|---|
| 28-2-2017, మంగళవారం, విదియ | ఉత్తరాభాద్ర, మేషలగ్నం, ఉ.10.03ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, వృషభలగ్నం, 11.15ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, తులా లగ్నం, రా.10.45ని, గర్భాదానం, వృశ్చిక లగ్నం, 11.51ని, గర్భాదానం. |
| 1-3-2017, బుధవారం, తదియ | రేవతి, మేషలగ్నం, ఉ.9.45ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము వృషభలగ్నం, ఉ.11.05ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము, కర్కాటక లగ్నం మ.3.12ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, వృశ్చిక లగ్నం, రాత్రి.11.45ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| 2-3-2017, గురువారం, చవితి | అశ్విని, మీనలగ్నం, ఉ.7.26ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము వృషభలగ్నం, ఉ.11.21ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము కన్యాలగ్నం, రాత్రి.7.44ని, వివాహం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము భరణి, వృశ్చికలగ్నం, అర్ధరాత్రి, 11.33ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| 3-3-2017, శుక్రవారం, పంచమి | భరణి, మీనలగ్నం, ఉ.గం.7.22ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, మీనలగ్నం ఉ.7.22ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, కర్కాటక లగ్నం మ.3.05ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, కన్యాలగ్నం, రాత్రి.7.40ని గర్భాదానం, వృశ్చికలగ్నం, రా.11.29, గర్భాదానం. |
| 4-3-2017, శనివారం, సప్తమి | కృత్తిక, కర్కాటకలగ్నం, మ.2.45ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, కన్యాలగ్నం, రాత్రి.7.26ని, అన్ని కార్యములకు, చర్చలకు, రోహిణి, వృశ్చికలగ్నం, రాత్రి.11.30, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |

| | |
|---|---|
| 5-3-2017, ఆదివారం, అష్టమి | రోహిణి, మీనలగ్నం ఉ.7.14ని, అన్నప్రాశన, అక్షరస్వీకారం, శంకుస్థాపన, గృహప్రవేశం, వివాహం, క్రయవిక్రయాలు, దస్త్రము. వృషభలగ్నం 11.09ని. అన్నప్రాశన, అక్షరస్వీకారం, శంకుస్థాపన, గృహప్రవేశం, వివాహం, కన్యాలగ్నం, రాత్రి.7.32ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, మృగశిర, వృశ్చికలగ్నం, 11.31ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| 6-3-2017, సోమవారం, నవమి | మృగశిర, మీనలగ్నం ఉ.7.05ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము<br>వృషభలగ్నం ఉ.11.05ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, గృహప్రవేశం, వివాహం దేవతా ప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము.<br>కర్కాటక లగ్నం, మ.2.53ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. |
| 7-3-2017, మంగళవారం, దశమి | ఆరుద్ర, మీనలగ్నం ఉ.6.42ని, అన్నప్రాశన, తూర్పు ప్రాంత ప్రయాణాలకు శుభము, క్రయ విక్రయాలు. దస్త్రము. వృషభలగ్నం ఉ.10.45ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము, తూర్పు ప్రాంత ప్రయాణాలకు శుభము, పునర్వసు, కన్యాలగ్నం, రాత్రి 7.34ని, విదేశీ ప్రయాణాలకు, ముఖ్య చర్చలకు. |
| 8-3-2017, బుధవారం, ఏకాదశి | పునర్వసు, వృషభలగ్నం ఉ.10.47ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, పుష్యమి, కర్కాటక లగ్నం, మ.2.45ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, కన్యాలగ్నం, రాత్రి.7.30ని, గర్భాదానం, పునర్వివాహం, గృహప్రవేశం, వృశ్చికలగ్నం, 11-09ని, పునర్వివాహం, గృహప్రవేశం గర్భాదానం. |
| 9-3-2017, గురువారం, ద్వాదశి | పుష్యమి, మీనలగ్నం, ఉ. 6-48 ని., అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ క్రయ విక్రయాలు, దస్త్రం, కర్కాటక, మ.2.41ని, క్రయ విక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుట, ఆశ్లేష, కన్యాలగ్నం, రాత్రి.7.26ని, గర్భాదానం, వృశ్చిక లగ్నం ఉ.11.05ని, గర్భాదానం |

| | |
|---|---|
| 10-3-2017, శుక్రవారం, త్రయోదశి | ఆశ్లేష, వృషభలగ్నం ఉ. 10.49, అన్నప్రాశన, అక్షర స్వీకారం, క్రయ విక్రయాలు, దస్త్రం, మఖ, వృశ్చికలగ్నం, రాత్రి 11.15 ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, పుబ్బ, కర్కాటకలగ్నం, మ. 2.33ని క్రయవిక్రయాలు దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, వృశ్చికలగ్నం, రా. 7.15ని, గర్భాదానం. |
| 11-3-2017, శనివారం, చతుర్దశి | మఖ, వృషభలగ్నం ఉ. 10.45ని అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము పుబ్బ, కర్కాటకలగ్నం, మ. 2.33ని క్రయ విక్రయాలు, దస్త్రం పిల్లలను ఉయ్యాలలో వేయుటకు కన్యాలగ్నం రా 7.15 ని గర్భాదానం, వృశ్చికలగ్నం రా. 11.07ని గర్భాదానం. |
| 12-3-2017, ఆదివారం, పౌర్ణిమ | పుబ్బ, మీనలగ్నం ఉ. 6.56ని, అన్నప్రాశన, అక్షరస్వీకారం, సూర్యదేవతాప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, వృషభలగ్నం, 10.51ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, ఉపనయనం, సూర్యదేవతా ప్రతిష్ట, కర్కాటకలగ్నం, మ. 2.29 క్రయవిక్రయాలు, దస్త్రము, కర్కాటక లగ్నం, 2.29, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, ఉత్తర, కన్యాలగ్నం, రాత్రి. 7.05ని వివాహం, గృహప్రవేశం, గర్భాదానం, వృశ్చికలగ్నం, రాత్రి 11.02ని వివాహం, గృహప్రవేశం గర్భాదానం. |
| 13-3-2017, సోమవారం, పాడ్యమి | ఉత్తర, మీనలగ్న ఉ. 6.40ని, అన్నప్రాశన. అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రం వృషభలగ్నం, 10.46ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతాప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రము కర్కాటకలగ్నం మ. 2.26 ని. క్రయ విక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. |
| 14-3-2017, మంగళవారం, విదియ | హస్త, వృషభలగ్నం ఉ.గం. 10.30ని అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము. |
| 15-3-2017, బుధవారం, తదియ | చిత్త, వృషభలగ్నం ఉ. 10.20ని. అన్నప్రాశన, అక్షరస్వీకారం, శంకుస్థాపన ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, కర్కాటక లగ్నం మ. 2.15ని, క్రయ విక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుట. స్వాతి, వృశ్చికలగ్నం, రాత్రి 10.49ని, గృహప్రవేశం, గర్భాదానం. |

| | |
|---|---|
| 16-3-2017, గురువారం, చవితి | స్వాతి, కర్కాటకలగ్నం 2.08ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుట. |
| 17-3-2017, శుక్రవారం, పంచమి | అనూరాధ, మకరలగ్నం అర్థరాత్రి 3.22 ని. గర్భాదానం. |
| 18-3-2017, శనివారం, షష్ఠి | అనూరాధ, వృషభలగ్నం ఉ.10.15ని, అన్న ప్రాశన, అక్షరస్వీకారం, శంకుస్థాపన, ఉపనయనం, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయ విక్రయాలు, దస్త్రము, కర్కాటకలగ్నం మ.2.01ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుట, వృశ్చిక లగ్నం, రాత్రి 10.38ని, వివాహం, గృహప్రవేశం, గర్భాదానం. |
| 19-3-2017, ఆదివారం, సప్తమి | జ్యేష్ఠ, వృషభలగ్నం, ఉ.10.11ని, అన్నప్రాశన, అక్షర స్వీకారం, క్రయవిక్రయాలు, దస్త్రము. |
| 20-3-2017, సోమవారం, అష్టమి, | మూల, వృషభలగ్నం ఉ.10.05ని, అన్న ప్రాశన, అక్షర స్వీకారం, శంకుస్థాపన, గృహప్రవేశం, వివాహం, దేవతా ప్రతిష్ఠ, క్రయవిక్రయాలు, దస్త్రం కర్కాటకలగ్నం, మ.1.59ని, క్రయ విక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు, వృశ్చిక లగ్నం రా.10.31ని, గృహప్రవేశం, గర్భాదానం, వివాహం. |
| 21-3-217, మంగళవారం, నవమి | మూల, పూర్వాషాఢ, కర్కాటక లగ్నం మ.1.53ని, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. |
| 22-3-2017, బుధవారం, నవమి | పూర్వాషాఢ, వృషభలగ్నం, ఉ.9.55ని, అన్నప్రాశన, క్రయవిక్రయాలు, దస్త్రము కర్కాటక లగ్నం, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. |
| 23-3-2017, గురువారం, దశమి | ఉత్తరాషాఢ, వృషభలగ్నం, ఉ.9.56, అన్నప్రాశన, అక్షర స్వీకారం, క్రయవిక్రయాలు, దస్త్రము, కర్కాటకలగ్నం, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. |
| 24-3-2017, శుక్రవారం, ఏకాదశి | శ్రవణం, వృషభలగ్నం, అన్నప్రాశన, అక్షర స్వీకారం, క్రయవిక్రయాలు, దస్త్రం, కర్కాటకలగ్నం, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. ధనిష్ఠ, సింహలగ్నం, క్రయవిక్రయాలు, దస్త్రము, పిల్లలను ఉయ్యాలలో వేయుటకు. మకరలగ్నం, కుంభలగ్నం - విదేశీ ప్రయాణాలకు. |
| 26-3-2017, ఆదివారం, త్రయోదశి | శతభిషం, వృషభలగ్నం, ఉ.9.44 ని, అన్నప్రాశన, క్రయవిక్రయాదులు. |



# నవనాయక ఫలితాలు

## భవిష్య భారతం (2016-17)

**1. రాజు-శుక్రుడు :** బ్రాహ్మణ గ్రహమైన శుక్రునకు రాజ్యాధిపత్యం వచ్చింది. మద్యపాన వినియోగం అధికమవుతుంది. చవుకబారు మద్యం ఏరులై ప్రవహిస్తుంది. అందరికి సమన్యాయం జరుగదు. వ్యవసాయం చేయడం జూదంగా మారుతుంది. శృంగార కార్యకలాపాలు – అక్రమ సంబంధాలు ఎక్కువవుతాయి. ఉన్నత స్థానాలలోని ప్రముఖుల శృంగార భాగోతాలు సంచలనం సృష్టిస్తాయి. విదేశీ మద్యం ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. బంగారు అభరణాలు, ఖరీదైన వస్త్రాలయాలు ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తాయి జనాదరణ పెరుగుతుంది. బంగారం ధర అందుబాటులో ఉంటుంది. నేర రంగంలో స్త్రీల పాత్ర అధికమవుతుంది, విద్య, వైద్యం, సాంకేతికరంగం, క్రీడా సాంస్కృతిక రంగాలలో స్త్రీలు బాగా రాణిస్తారు. స్త్రీలపై అత్యాచారాలు, అఘాయిత్యాలు అధికం కాకుండా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. నిర్భయ లాంటి చట్టాల ఉనికి ప్రశ్నార్థకం అవుతుంది. స్త్రీలకు అనుకూలంగా మరిన్ని చట్టాలు, ప్రభుత్వ ఉత్తర్వులు విడుదలవుతాయి. బాలబాలికల్లో బాలికలు ఎక్కువ ప్రతిభ చూపుతారు. అధునాతన, సాంకేతిక పరిజ్ఞానం యువతను చెడగొట్టటంలో ప్రధానపాత్ర వహిస్తుంది. దేశానికి ఆశాజ్యోతుల్లా ఉండవలసిన యువతీ, యువకులు నిర్వీర్యం అవుతారు. కల్తీమద్యం అనేక జీవితాలను, కాపురాలను మృత్యు గుహలోకి నెడుతుంది. గూఢచారి సంస్థలు ఘోరంగా విఫలమవుతాయి, విద్రోహచర్యలు ఆందోళన, భయం కలిగిస్తాయి. పాలకుల ఆదేశాలను అధికారులు అమలుచేయరు. క్రీడలలో రాజకీయాలు ఎప్పుడూ లేనివిధంగా చోటు చేసుకుంటాయి. అయితే క్రీడల పట్ల ప్రజాభిమానము తగ్గదు. క్రీడల వల్ల దేశానికి ప్రఖ్యాతి లభిస్తుంది. క్షణికమయిన ఆవేశములో నేరాలు చేసేవారు అధికమవుతారు. వైద్య రంగంలో నూతన విషయాలు కనుగొన బడతాయి. నల్ల బజారు వ్యాపారము ప్రజలను ఇక్కట్లకు గురిచేస్తుంది. జపాన్, హవాయి దీవులలో అగ్ని పర్వతాలు బద్దలు అవుతాయి. భార్యాభర్తల మధ్య విభేదాలు అధికమవుతాయి. విడాకులు తీసుకునే వారి సంఖ్య గణనీయముగా పెరుగుతుంది. ప్రేమ వివాహాలు నిజాయితీ నిబద్ధతను కోల్పోతాయి. పిల్లల పెంపకము అత్యంత కష్టముగా మారుతుంది. అనారోగ్యకరమైన తినుబండారాలు, అనారోగ్యకరమయిన పానీయాలు ప్రజలలో విస్తృతంగా చోటు చేసుకుంటాయి. తీవ్రవాదచర్యలు అణచి వేయటానికి ప్రభుత్వపరంగా ఎన్నడూలేని విధంగా కఠిన చర్యలు తీసుకొనబడతాయి. ఇరుగు పొరుగు దేశాల వల్ల భారతదేశమునకు ఇబ్బందులు ఏర్పడుతాయి. తెలుగు రాష్ట్రాలలో కరవు కాటకాలు సంభవం.



**2. మంత్రి – బుధుడు :** న్యాయ వ్యవస్థ ప్రజల జీవనములో ఒక ప్రధాన భాగమవుతుంది. చాలా విషయాలలో న్యాయవ్యవస్థ, జోక్యం అనివార్యముగా తోస్తుంది. న్యాయవ్యవస్థకు ప్రభుత్వానికి మధ్య విభేదాలు ఏర్పడే పరిస్థితి సంభవిస్తుంది. చట్టసభలకు, న్యాయవ్యవస్థకు, ప్రభుత్వానికి మధ్య విభేదాలు పొడచూపుతాయి. ప్రభుత్వ ఉత్తర్వులకు వక్రభాష్యం చెప్పి సొంత పనులు చక్కపెట్టుకునే అధికారులు అధికమవుతారు. ముఖ్యమయిన



బాధ్యతలు నిర్వహించవలసిన అధికారులు వివిధ కారణాల వల్ల తమ బాధ్యతలను సక్రమంగా నిర్వహించలేకపోతారు. కొందరు అధికారులు పోటీ ప్రభుత్వాన్ని నడుపుతారు. నీతి, నిజాయితీలను తుంగలో త్రొక్కి అవినీతికి కేంద్రబిందువుగా మారతారు. ప్రభుత్వ సంబంధమైన ఆస్తులు, భూములు బలవంతుల చేత ఆక్రమించుకోబడతాయి. ఆకుకూరలు, దుంపకూరల ధర అధికమవుతాయి. కుళ్ళు రాజకీయాలు అధికమవుతాయి. నాయకులు హుందాగా ప్రవర్తించరు. ఆదర్శవంతమయిన నాయకులు నల్ల పూసలవుతారు. తీవ్రవాద, ఉగ్రవాద చర్యల వల్ల ముఖ్యనాయకులను కోల్పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వన్యమృగ సంరక్షణకు, వాతావరణ కాలుష్యాన్ని అరికట్టడానికి, పురాతన వస్తు సంపద కాపాడుకోవటానికి, ప్రభుత్వ పరంగా గట్టి చర్యలు తీసుకోబడతాయి. వ్యవసాయ దారులకు వ్యవసాయరంగంలో ఒడిదుడుకులు చోటుచేసుకుంటాయి.

**3. సేనాధిపతి–కుజుడు :** సేనాధిపత్యం కుజుడికి రావడం వల్ల మారణాయుధాల వినియోగము అధికమవుతుంది. తీవ్రవాద కార్యకలాపాలు సంభవిస్తాయి. కరడుకట్టిన నేరస్తులు, ఉగ్రవాదులు జనసామాన్యంలో కలిసిపోయి, విధ్వంసాలు సృష్టిస్తారు. అగ్ని గ్రహమయిన కుజుడికి సేనాధిపత్యం రావటము వలన ప్రపంచ దేశాలమధ్య సయోధ్య వాతావరణము ఉండదు. అంతా సంఘర్షణ వాతావరణమే. వ్యక్తిగత రక్షణ, ఆస్తుల రక్షణ, పౌరహక్కుల రక్షణ పెనుసవాలుగా మారుతుంది. కిడ్నాపులు, అనుమానపు మృతులు ఎక్కువ అవుతాయి. బంగారము ధరించడం ప్రాణాంతకమవుతుంది. ముఖ్యమయిన పట్టణాలలో హింసాత్మక సంఘటనలు చోటుచేసుకుంటాయి. కొన్నిచోట్ల మతకల్లోలాలు అధికమవుతాయి. అగ్ని ప్రమాదాల సంఖ్య పెరుగుతుంది. విదేశాలకు వెళ్ళే మేధావులు యువతీ, యువకులు అధికమవుతారు. విదేశీ మోజు అనేకరకాల ఇబ్బందులకు కారణమవుతుంది.



**4. సస్యాధిపతి – శని :** సస్యాధిపత్యం శనికి వచ్చిన కారణము చేత భూముల ధరలు పెరుగుతాయి. వర్షాభావ పరిస్థితులు ఏర్పడుతాయి. నదుల అనుసంధానము వలన కొంత మేలు జరుగుతుంది. కొన్ని విభాగాలు మినహా వ్యవసాయము అంతగా లాభించదు. రైతులు ఋణాలు చెల్లించలేరు. ఎరువులు, విత్తనాలు అధిక ధర కలిగి ఉంటాయి. పొగాకు రైతులకు గడ్డుకాలము. వాణిజ్య పంటలకు తగిన మద్దతు ధర లభించదు. ఋతుపవనాలు గతి తప్పుతాయి. తుపానుల వల్ల వచ్చే వర్షపాతము ఉపయోగపడుతుంది. వేరుశనగ మాత్రం మంచి దిగుబడి ధర కలిగి ఉంటుంది. అకాల వర్షాల వల్ల పంటలకు నష్టము కలుగుతుంది. పాలు, వెన్న, నెయ్యి, ధరలు పెరుగుతాయి. నకిలీ విత్తనాలు, నకిలీ పురుగు మందులు, అరికట్టడంలో ప్రభుత్వ చర్యలు సత్ఫలితాలను ఇస్తాయి. సముద్ర తీర పట్టణాలకు, గ్రామాలకు సంకట కాలము. సముద్రపు అలల వల్ల కోత ఎక్కువ అవుతుంది. వ్యవసాయానికి తగిన ఫలం మాత్రం ప్రశ్నార్థకమవుతుంది.



**5. ధాన్యాధిపతి – గురువు :** దుంపకూరలు వెల్లుల్లి, ఉల్లి, గుగ్గిలం. క్యాబేజీ, క్యారెట్, వేరుశనగ, జీడిపప్పు, సుగంధద్రవ్యాలు, మెంతులు, మిరియాలు, కొత్తిమీర, గోంగూర,

మామిడి, నువ్వుల నూనె, వేరుశనగ అధిక ధరలు కలిగి ఉంటాయి. అన్నదాన సత్రాలు ఎక్కువ అవుతాయి. ఉన్న సత్రాలు సక్రమంగా సేవలు అందిస్తాయి. ఎక్కువ మందికి బియ్యం ఏదో రకంగా అందుబాటులో ఉంటుంది. ఇబ్బంది పడరు. నిత్యావసర వస్తువులకు కృత్రిమ కొరత ఏర్పడుతుంది. కలుషిత ఆహారాలు, పానీయాలు విస్పృంఖలంగా ప్రజలలో చెలామణి అవుతాయి. కల్తీ పాలు, కల్తీ వెన్నె, కల్తీ నెయ్యి, కల్తీ మాంసము ఇవ్వన్నీ విస్పృంఖలంగా ప్రజల్లో చలామణి అవుతాయి. చిన్నపిల్లల ఆహార పదార్థముల విషయాలలో అధిక శ్రద్ధలు అవసరమవుతాయి. ఊబకాయులు ఎక్కువ అవుతారు. ఎన్నో విధాలుగా ప్రజలను వ్యాపారస్తులు మోసము చేస్తున్నా ప్రభుత్వము మాత్రము ప్రేక్షక పాత్ర వహిస్తుంది. ప్రకృతి సంపద కొల్లగొట్టి అమ్ముకునే గూండాలకు ముఖ్య రాజకీయనాయకుల అండదండలు లభిస్తాయి.

**6. అర్ఘ్యాధిపతి – కుజుడు** : పసుపు, గులాబిరంగు వస్త్రాలు ప్రజాదరణకు నోచుకుంటాయి. దక్షిణ భారతదేశంలో అన్ని రాష్ట్రాలకు ప్రతికూల సంఘటనలు. భూకంపం హూద్‌హూద్ తుపాన్లు వంటివి సంభవిస్తాయి. అన్ని దేశాల్లోనూ ప్రకృతి ఉపద్రవాలు అధికమవుతాయి. ప్రకృతి నిర్దయ పోరాటాలు, తీవ్రవాదుల దుశ్చర్యలవల్ల దుబాయి, పరిసర దేశాలు, ఇరాన్, ఇరాక్, ఖజకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ మొదలగు దేశాలకు అరిష్టము. వడగండ్లవాన, ఎరుపురంగు నీళ్ళ వర్షాలు, విచిత్రమైన వానలు సంభవిస్తాయి. వజ్ర సంపదకు, విలువైన రాళ్ళకు గిరాకీ ఏర్పడి ప్రజలలో పోరాటాలు అధికమవుతాయి. పట్టణ ప్రాంతాలలో వర్షాల వల్ల వరదల వాతావరణము నెలకొంటుంది.



**7. మేఘాధిపతి – కుజుడు** : ఎర్రని మబ్బులు, ఆకాశము ఎర్రబారుట వంటి కొన్ని వింతలు సంభవిస్తాయి. పిడుగుపాట్ల వల్ల జననష్టము జరుగుతుంది. వర్షాల కోసం సహస్ర ఘటాభిషేకం వంటి క్రతువులు తప్పవు. మేఘాడంబరము అధికముగా ఉంటుంది. గాలిలో వేగము హెచ్చుగా ఉంటుంది. ప్రచండ వేగముతో వీచే గాలి వల్ల అధికనష్టం సంభవిస్తుంది. వడగండ్లవాన, విషాదానికి కారణమవుతుంది. ఎర్రబారిన మబ్బులతో పడమటి సూర్యాస్తమయం కర్ణుని మరణానంతరం అస్తమించిన సూర్యుని గుర్తుచేస్తుంది.



**8. రసాధిపతి – చంద్రుడు :** చతుషష్టి కళాకోవిదుడైన చంద్రునికి రసాధిపత్యం వచ్చింది. కళాసంబంధమైన విషయాలలో, సాహస క్రీడలలో, క్రీడారంగంలో, స్త్రీలు ఆధిపత్యంలో ఉంటారు. అధికార పదవులకు స్త్రీలు ఎంపిక అవుతారు. కళాసంబంధిత విషయాలలో అశ్లీలం అన్ని హద్దులు దాటిపోతుంది. హాస్యం అపహాస్యం అవుతుంది. శృంగార సంబంధమయిన మందులు అధికమవుతాయి. ఇది వివాదాలకు కారణమవుతుంది. తులసి వనాలు వృద్ధి చెందుతాయి. గంజాయి తగులబడుతుంది. మామిడి పండ్లు అధికధరను కలిగియుంటాయి. కాకర, ఉసిరి కరక్కాయ, కుంకుమ, వస, గుమ్మడి, దొండ, దానిమ్మ, నేరేడు, బంగాళదుంప, వంకాయలు, ఉల్లిపాయలు, ఆకుకూరలు, ధర కలిగిఉంటాయి. ద్రాక్ష అందుబాటులో ఉంటుంది. మామిడి మధ్యస్తం. కూరగాయలు, ఆకుకూరలు, పండ్లు, సహజ గుణాన్ని



కోల్పోతాయి. యాపిల్, అరటికాయలు ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి. అలంకార ప్రాయమైన, పౌష్టిక రహిత, శక్తి రహిత ఫలాలు మాత్రమే అందుబాటులో ఉంటాయి. భోజన పదార్థాలు, ప్రకృతి విప్లవాన్ని రుచి చూపిస్తాయి. చల్లని కృత్రిమ పానీయాలు, జేబులకు, ఆరోగ్యానికి చేటు కలిగిస్తాయి. మద్యపానీయ వినియోగం అధికమవుతుంది. రకరకాల ప్రకటనల ద్వారా ప్రజలు మోసపోతారు. శక్తినిచ్చే పానీయాలు, పొడుగు పెరుగుతారు అనే పానీయాలు, ఆరోగ్యవృద్ధికి పనికొస్తాయని చెప్పే పానీయాలు ప్రజలపాలిట పెనుశాపముగా మారుతాయి. 99% పాళ్ళు ప్రచార పానీయాలు తప్పుడు పానీయాలని ఋజువవుతుంది. దోచుకునే వాణ్ని అడ్డుకునేవాడు ఎవ్వరూలేరని కాలం నిరూపిస్తుంది. కార్పొరేట్ హాస్పిటల్స్ దోపిడి నిరాఘాటంగా సాగుతుంది.

**9. నీరసాధిపతి–శని :** యువతరం బాధ్యతారహితం, తల్లిదండ్రులపై చేయిచేసుకొనుట, విలాసాలకు అలవాటు పడటం, తప్పుడు పనులు చేయటము, ఆన్‌లైన్ మోసాలు, గతంలో లేనివిధంగా ఎక్కువ అవుతాయి. యువతుల పాత్రకూడా ఆక్షేపణీయముగా ఉంటుంది. తేలికగా ధనం సంపాదించే మార్గాలు, ఊహలు అధికమవుతాయి. నేర ప్రపంచంలో యువజనుల పాత్ర అధికమవుతుంది. స్త్రీల ప్రాతినిధ్యం కూడా అధికంగానే ఉంటుంది. జీర్ణకోశ సంబంధిత రోగాలు అధికమవుతాయి. నార్కొటిక్ డ్రగ్స్, ఏరులై పారుతాయి. సాంప్రదాయాలు నల్లపూసలై పోతాయి. వావివరుసలు గంగలో కలుస్తాయి. ప్రేమ వివాహాలు అధికం, అంతకంటే అధికంగా విడాకులు. విడిపోయే భార్యభర్తల సంఖ్య అధికమవుతుంది. తీవ్రవాదుల వల్ల ఉగ్రవాదుల వల్ల బాంబు ప్రేలుళ్ళు సంభవిస్తాయి. పెద్దవాళ్ళు తప్పుడు పనులను చూసి ఏమీ మాట్లాడకుండా ఉంటే గౌరవం, లేకపోతే అవమానము. అనేక కఠిన సమస్యల్ని అవలీలగా అధిగమించిన భారతదేశము యువతరాన్ని సన్మార్గంలో పెట్టలేక కృంగిన రధచక్రాల చెంత నిస్సహాయుడైన కర్ణుని వలె దీనవేదన అవుతుంది. పూజాద్రవ్యాలు ధర అధికముగా ఉంటుంది. ఇందులో కూడా నకిలీలు చోటుచేసుకుంటాయి. దేశ ఆర్థిక పరిస్థితి నడి సముద్రములో నావవలే గోచరిస్తుంది. జ్యేష్ఠమాసం చివరలో దేశారిష్టం, ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తాయి.







# ఆర్థిక , విదేశీ వ్యవహారాలకు అనుకూల శుభసమయాలు

ఆర్థికపరమైన లావాదేవీలు-విదేశీయాన సంబంధిత విషయాలు-ప్రస్తుత సమాజంలో ముఖ్యమైనవి. బ్యాంకు ఎకౌంట్స్ ప్రారంభించడానికి, ఋణము తీసుకోవడానికి ఆర్థిక ప్రయోజనాలు ఆశిస్తూ దరఖాస్తులు చేయడానికి, మీకు రావలసిన అన్ని రకాల ఆర్థిక ప్రయోజనాలకు మరియు ధనం పెట్టుబడిగా పెట్టడానికి అనువైన శుభసమయాలు ఇవ్వడం జరిగింది. అదేవిధంగా విదేశీయాన ప్రయత్నాలకు, అందుకు సంబంధించిన సంభాషణలకు, అప్లికేషన్స్ పూర్తి చేయడానికి శుభసమయాలు ఇవ్వడం జరిగింది. ఇందులో ఇచ్చిన శుభసమయాలు ఆఫీసు వేళలలో లేదని భావించవద్దు. అందుకు సంబంధించిన సంతకాలు శుభసమయ సమయంలో చేసి ఆఫీసు వేళల్లో సమర్పించవచ్చు.

| తేది | వారము | శుభసమయము | ఆర్థిక వ్యవహారాలకు | విదేశీయాన వ్యవహారాలకు |
|---|---|---|---|---|
| **2016 ఏప్రియల్** | | | | |
| 03 | ఆది | - | ఆర్థిక వ్యవహారాలకు | |
| 08 | శుక్ర | - | ఆర్థిక వ్యవహారాలకు | |
| 09 | శని | - | | విదేశీ వ్యవహారాలకు |
| 11 | సోమ | ఉ. 9.20-10.15<br>సా. 5.30-6.15 | | విదేశీ వ్యవహారాలకు |
| 13 | బుధ | ఉ. 9.15-10.20<br>రా. 7.20 - 8.11 | | విదేశీ వ్యవహారాలకు |
| 16 | శని | ఉ.8.10 - 8.40<br>సా. 5.20 - 6.17 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 17 | ఆది | ఉ. 7.50 - 8.30<br>రా. 7.00 - 7.40 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 22 | శుక్ర | ఉ. 6.00-7.10<br>సా.5.00-6.12 | | విదేశీ వ్యవహారాలకు |
| 23 | శని | ఉ. 7.40-8.02<br>సా.6.10 - 7.20 | | విదేశీ వ్యవహారాలకు |
| 24 | ఆది | ఉ. 8.40-9.30<br>సా. 7.35-8.10 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 25 | సోమ | ఉ. 9.10 - 10.10<br>సా. 5.30 - 6.30 | | విదేశీ వ్యవహారాలకు |
| 27 | బుధ | ఉ. 9.00-10.10<br>సా. 7.40 - 8.10 | | విదేశీ వ్యవహారాలకు |

| తేదీ | వారము | శుభసమయము | ఆర్థిక వ్యవహారాలకు | విదేశీయాన వ్యవహారాలకు |
|---|---|---|---|---|
| 29 | శుక్ర | ఉ.9.10–9.30<br>సా. 5.20 – 6.10 | ఆర్థిక వ్యవహారాలకు | |
| మే<br>02 | సోమ | ఉ. 9.10 – 10.10<br>సా.5.00 – 6.00 | | విదేశీ వ్యవహారాలకు |
| 08 | ఆది | ఉ. 7.10 – 8.00<br>సా. 6.10 – 6.30 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 09 | సోమ | ఉ. 9.00 – 9.30<br>సా. 5.40–6.30 | | విదేశీ వ్యవహారాలకు |
| 11 | బుధ | ఉ. 9.00–9.30<br>రా. 7.00–8.00 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 13 | శుక్ర | ఉ. 9.10– 10.00<br>సా. 5.20 – 6.15 | | విదేశీ వ్యవహారాలకు |
| 16 | సోమ | ఉ. 9.00 – 10.10<br>సా. 5.25 – 6.10 | | విదేశీ వ్యవహారాలకు |
| 19 | గురు | ఉ. 7.30 – 8.10<br>సా. 5.15 – 6.13 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 20 | శుక్ర | ఉ. 9.15–10.15<br>సా. 6.00 – 7.00 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 22 | ఆది | ఉ. 10.08–11.53<br>సా.6.30–7.15 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 23 | సోమ | ఉ. 9.00 – 10.10<br>సా. 5.45 – 6.22 | | విదేశీ వ్యవహారాలకు |
| 27 | శుక్ర | ఉ. 9.30–10.10<br>సా. 5.23 – 8.50 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 28 | శని | ఉ. 10.30–11.10<br>సా. 5.33 – 7.14 | | విదేశీ వ్యవహారాలకు |
| జూన్<br>01 | బుధ | ఉ.9.00 – 10.20<br>రా. 8.27–9.50 | | విదేశీ వ్యవహారాలకు |
| 03 | శుక్ర | ఉ. 6.15 – 7.02<br>సా. 6.00– 7.02 | ఆర్థిక వ్యవహారాలకు | |

| తేది | వారము | శుభసమయము | ఆర్థిక వ్యవహారాలకు | విదేశీయాన వ్యవహారాలకు |
|---|---|---|---|---|
| 06 | సోమ | ఉ. 9.00 – 10.15<br>సా. 5.40 – 6.10 | | విదేశీ వ్యవహారాలకు |
| 09 | గురు | ఉ. 7.30 – 8.20<br>సా. 5.14 – 6.12 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 11 | శని | ఉ. 8.10–8.40<br>రా. 8.00–8.30 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 15 | బుధ | ఉ. 9.00 – 9.40<br>సా. 5.40–6.40 | | విదేశీ వ్యవహారాలకు |
| **జూలై**<br>02 | శని | ఉ. 7.40–8.10<br>సా. 7.01–8.20 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 06 | బుధ | ఉ. 9.00–10.10<br>సా. 6.00–7.12 | | విదేశీ వ్యవహారాలకు |
| 07 | గురు | ఉ. 8.00–8.40<br>సా. 5.12–6.12 | | విదేశీ వ్యవహారాలకు |
| 09 | శని | ఉ. 8.00–8.40<br>సా. 5.30–6.24 | | విదేశీ వ్యవహారాలకు |
| 11 | సోమ | ఉ. 6.40–7.10<br>సా. 5.19–6.18 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 14 | గురు | ఉ. 7.40–8.15<br>సా. 5.30–6.20 | | విదేశీ వ్యవహారాలకు |
| 15 | శుక్ర | ఉ. 6.20–7.15<br>సా. 6.10–7.18 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 17 | ఆది | ఉ. 8.40–9.00<br>సా. 6.40–7.20 | ఆర్థిక వ్యవహారాలకు | |
| **ఆగష్టు**<br>05 | శుక్ర | ఉ. 9.30–10.12<br>సా. 5.18–6.19 | | విదేశీ వ్యవహారాలకు |
| 07 | ఆది | | ఆర్థిక వ్యవహారాలకు | |
| 08 | సోమ | ఉ. 9.30 – 10.15<br>సా. 4.20–5.10 | | విదేశీ వ్యవహారాలకు |
| 10 | బుధ | ఉ. 9.20–10.15<br>సా. 5.10–6.20 | | విదేశీ వ్యవహారాలకు |

| తేది | వారము | శుభసమయము | ఆర్థిక వ్యవహారాలకు | విదేశీయాన వ్యవహారాలకు |
|---|---|---|---|---|
| 13 | శని | ఉ. 7.40-8.20<br>సా. 4.10-5.19 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 14 | ఆది | ఉ. 9.40-10.20<br>సా. 6.45-7.12 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 18 | గురు | ఉ. 7.40-8.20<br>సా. 6.18-7.20 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 19 | శుక్ర | ఉ. 9.30-10.20<br>సా. 5.10-6.19 | | విదేశీ వ్యవహారాలకు |
| 20 | శని | ఉ. 7.40-8.50<br>సా. 6.10 - 7.20 | | విదేశీ వ్యవహారాలకు |
| సెప్టెంబరు<br>12 | సోమ | ఉ. 9.15-10.15<br>సా. 5.10-6.02 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 16 | శుక్ర | ఉ. 9.20-10.15<br>రా. 10.19-11.40 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 17 | శని | ఉ. 8.10-8.45<br>సా. 5.30-6.02 | | విదేశీ వ్యవహారాలకు |
| 18 | ఆది | ఉ. 7.30-8.10<br>సా. 5.30-6.02 | | విదేశీ వ్యవహారాలకు |
| 19 | సోమ | ఉ. 9.10-9.45<br>సా. 4.00-5.00 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 21 | బుధ | ఉ. 10.00-10.20<br>సా. 3.38-5.26 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 22 | గురు | ఉ. 8.00-8.25<br>సా. 4.20-5.10 | | విదేశీ వ్యవహారాలకు |
| 25 | ఆది | సా. 6.30-7.00 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 28 | బుధ | ఉ. 9.15-10.15<br>సా. 3.45-4.40 | ఆర్థిక వ్యవహారాలకు | |
| అక్టోబరు<br>17 | సోమ | ఉ. 9.10-10.10<br>సా. 4.20-5.19 | | విదేశీ వ్యవహారాలకు |
| 20 | గురు | ఉ. 7.40-8.20<br>సా. 4.00-5.14 | | విదేశీ వ్యవహారాలకు |

| తేది | వారము | శుభసమయము | ఆర్థిక వ్యవహారాలకు | విదేశీయాన వ్యవహారాలకు |
|---|---|---|---|---|
| 21 | శుక్ర | ఉ. 9.45–10.10<br>సా. 4.45–5.20 | | విదేశీ వ్యవహారాలకు |
| 22 | శని | ఉ. 7.40–8.10<br>సా.6.06–7.40 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 26 | బుధ | ఉ. 6.00–7.10<br>సా. 6.08–7.52 | | విదేశీ వ్యవహారాలకు |
| 28 | శుక్ర | ఉ. 6.20–7.15<br>సా. 5.14–6.18 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 31 | సోమ | ఉ. 9.00–9.30<br>సా. 5.20–6.10 | ఆర్థిక వ్యవహారాలకు | |
| జనవరి<br>01 | ఆది | ఉ. 7.30–8.40<br>సా. 5.15–6.14 | | విదేశీ వ్యవహారాలకు |
| 05 | గురు | ఉ. 8.20–9.10<br>సా. 4.20–5.10 | | విదేశీ వ్యవహారాలకు |
| 08 | ఆది | ఉ. 7.45–8.19<br>సా. 6.14–7.30 | | విదేశీ వ్యవహారాలకు |
| 12 | గురు | ఉ. 8.20–9.15<br>సా. 5.20–6.14 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 14 | శని | ఉ. 8.20–9.17<br>సా. 6.14–7.20 | | విదేశీ వ్యవహారాలకు |
| ఫిబ్రవరి<br>06 | సోమ | ఉ. 7.01–7.45<br>సా. 5.30–6.40 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 09 | గురు | ఉ. 7.14–8.01<br>సా. 4.40–5.20 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 11 | శని | ఉ. 8.16–9.20<br>సా. 3.45–4.20 | | విదేశీ వ్యవహారాలకు |
| 12 | ఆది | ఉ. 11.40–12.10<br>సా. 6.25–7.20 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 13 | సోమ | ఉ. 9.40–10.20<br>సా. 6.20–7.30 | ఆర్థిక వ్యవహారాలకు | |
| 15 | బుధ | ఉ. 11.15–11.40<br>సా. 6.40–7.12 | | విదేశీ వ్యవహారాలకు |
| 16 | గురు | ఉ. 7.30–8.01 | | విదేశీ వ్యవహారాలకు |

శంభో మహాదేవ

# నవగ్రహ సంచార భాష్యాలు 2016-2017

## జరగబోవు సంఘటనలు

- శ్రీవేంకటేశ్వర స్వామివారి మహత్యాలు మరిన్ని చూడబోతున్నాము.
- అమెరికాలో వాతావరణ మార్పులు – భీభత్సమైన ప్రకృతి వైపరీత్యాలు.
- 10 పైసల మాత్రకు 10 రూపాయలు దోపిడీ – ప్రజలు తిరుగబడతారు.
- అనారోగ్యకరమైన ఆహార పదార్థాలు ఎన్నో అమ్మకానికి మార్కెట్‌లో సిద్ధంగా ఉంటాయి.
- ఈ సంవత్సరం సైబర్ నేరాలు అధికం.
- రుద్రాక్షలు స్త్రీలు ధరించరాదు.
- తెలుగు రాష్ట్రాలతో బి.జె.పి.కి అగ్ని పరీక్షా కాలం.
- బంగ్లాదేశ్ క్రికెట్ టీమ్ కూనలు కాదు పులులు అని నిరూపితమవుతుంది.
- క్రికెట్ రాజకీయాలు మహాభారతాన్ని తలపిస్తాయి. ఆధిపత్యపోరు హద్దులు దాటుతుంది.
- టి.డి.పి., బి.జె.పి. బంధానికి బీటలు పడతాయి.
- క్రికెటర్ ధోనీ గ్రహగతులు బాగాలేవు, పరీక్షాకాలం.
- పొగాకు రైతులకు పంటలకు గడ్డుకాలం.
- ఆఫ్ఘనిస్తాన్‌కు ప్రతికూల కాలం తాలిబాన్లు విజృంభిస్తారు.
- కల్తీ మద్యం వల్ల ముప్పు తొలిగిపోదు.
- గ్రీస్ దేశానికి ప్రతికూలకాలం.
- పారిశ్రామికీకరణ – పెట్టుబడులు వచ్చేవిషయంలో తెలంగాణ ముందంజ.
- దోపిడిలో కార్పోరేట్ కాలేజీలకు ఏదీ సాటిరాదు – అంగట్లో సరుకు – విద్య
- ధర్మానికి కాని కాలం దాపురించినది.
- కల్తీకి కాదేదీ అనర్హం.
- న్యాయానికి గడ్డుకాలం దాపురించింది.
- భూముల కుంభకోణాలు – సంచలనం.
- కాంగ్రెస్ కొద్దిపాటి బలం పుంజుకుంటుంది.
- రైతులకు అగ్ని పరీక్షాకాలం (చాలాచోట్ల).
- $158^0$లతో వణికిపోనున్న భూమాత. (ఎండ తీవ్రత)
- భారత క్రికెట్ టీంలో వర్గపోరాటం – అవినీతి.
- సామర్థ్యానికి దక్కనిచోటు.
- సౌరబ్ గంగూలీ వివాదాస్పద వ్యక్తి అవుతాడు.

- లలిత్ మోడీవల్ల చాలామంది కొంపలు మునుగుతాయి.
- చైనా దేశపు గ్రహగతులు ఏమాత్రం బాగాలేవు. ప్రజలలో అసంతృప్తి ఆర్థిక పరిస్థితి బలహీనపడటం, ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తాయి.
- వై.ఎస్.ఆర్.సి.పి., టి.డి.పి.ల మధ్య వివాదం ముదిరి పాకాన పడుతుంది. అవాంఛనీయ ఘటనలు.
- ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక హోదా రాదు.
- సెక్షన్ 8 అమలుకు నోచుకోదు.
- ఆంధ్రప్రదేశ్ రాజధాని (అమరావతి) పనులు వేగం పుంజుకుంటాయి.
- తెలంగాణ నుండి వెళ్ళిపోనున్న ముఖ్యమైన శాఖల కార్యాలయాలు.
- మందుల షాపుల నిలువు దోపిడిని అడ్డుకునే వారులేరు.
- సామాన్యుడి ప్రాణానికి విలువ లేదు.
- వింత వింతనేరాలు – సమర్థుల మేధస్సు అమోఘం.
- సామాన్యుడికి – తిండి – వైద్యం – విద్య– అందని ద్రాక్షపండు. ఇవేనా స్వాతంత్ర్య ఫలాలు?
- హెలికాప్టర్ ప్రమాదాలు అధికం, ప్రముఖుల దుర్మరణం.
- పొదుపు పాటించండి – రానున్నవి గడ్డు రోజులు.
- నిత్యావసర వస్తువుల ధరలు ఎన్నడూ లేనంతగా ధరలు మండిపోతాయి (లభ్యం తక్కువ).
- కరవు కాటకాలు సంభవించినట్లుగా పరిస్థితులు ఉంటాయి.
- చాలా మందికి ఊరట, ఉపశమనం మద్యమే అవుతుంది. (వినియోగం పెరుగుతుంది) తాగి వాహనాలు నడిపే పెద్దలు బైటపడతారు.
- అత్యాచారాలు, కిడ్నాపులు అధికమవుతాయి. (జాగ్రత్త వహించాలి సుమా)
- బ్రిటిష్ ప్రధాని డేవిడ్ కామరూన్ నిర్ణయాలపై నిరసనలు.
- దేశంలో హైఅలర్ట్, ప్రకృతి భీభత్సాలు.
- బాలనేరస్థులు పెరిగిపోతారు. వీళ్ళ నేరాల తీరు పెద్ద దొంగలకు సిగ్గుబోతుంది.
- మహేంద్రసింగ్ దోనీ చరిత్ర పరిసమాప్తం కాబోతుంది.
- బంగారం ధర పెరుగుతుంది.
- ఇతర లోహాల ధరలు పెరుగుతాయి.
- కర్ణాటక, తెలుగు రాష్ట్రాలలో కరవుకాటకాలు.
- ప్రధాని నరేంద్ర మోడి, గ్రహగతులు ప్రతికూలంగా ఉన్నాయి.
- దేశంలో ఆర్థిక మాంద్యం.
- యూరప్‌కు కష్టకాలం.
- బొగ్గు స్కామ్ చాలామందిని చుట్టుముడుతుంది.

- ఎ.సి.బి.కి చిక్కనున్న టౌన్ ప్లానింగ్ అధికారి. (సంచలనం)
- కేంద్ర మంత్రులు కొద్ది మంది రాజీనామా చేస్తారు.
- గోపీచంద్ బాడ్మింటన్ అకాడమీపై విమర్శలు.
- చైనాలో భూకంపం-వరదలు-జలభీభత్సాలు-జనజీవనం అస్తవ్యస్తం.
- యూరప్ ఖండంలోని దేశాలకు ప్రతికూల కాలం.
- తెలుగు రాష్ట్రాల్లో త్రాగు, సాగునీటి కొరతలు ఎన్నడూ లేనివిధంగా ఇబ్బంది పెడుతుంది.
- తెలుగు రాష్ట్రాల్లో కరవు కాటకాలు.
- చైనా నీచమైన కుట్రలు మరిన్ని బయటపడతాయి.
- బంగ్లాదేశ్ క్రికెట్ టీమ్ సంచలనాలు సృష్టిస్తుంది.
- రాష్ట్రంలో విద్యుత్ కుంభకోణాలు, బొగ్గు కుంభకోణాలు.
- పుణ్యనదులకు కాని కాలం దాపురించింది.
- ఇసుక మాఫియా రెచ్చిపోతుంది. గతంలో చెప్పిన ఫలితంలో మార్పు లేదు.
- వేరుశనగ ధర కొండెక్కి కూర్చుంటుంది.
- సానియా మీర్జా విజయ పరంపర.
- క్రికెట్‌కు అనారోగ్య అవినీతి రోగం పట్టుకుంటుంది.
- 90% సంతాన సాఫల్య కేంద్రాలు మోసానికి కేంద్ర బిందువులు.
- ఎయిర్ ఇండియా దివాలా.
- తెలుగు రాష్ట్రాల్లో వ్యవసాయ సంక్షోభం.
- దాహం-దాహం నీరెక్కడ. దాని జాడ ఎక్కడ.
- పాకిస్థాన్ రక్తసిక్తం.
- నిత్యావసర వస్తువుల ధరలు గతంలో ఎన్నడూ లేనివిధంగా పెరుగుతాయి.
- రష్యాలో పెను ప్రమాదమైన ప్రకృతి బీభత్సం.
- విరాట్ కోహ్లీ జాతకం బాగుందని గత సంవత్సరం చెప్పిన జోష్యంలో మార్పులేదు.
- రోహిత్ శర్మ జాతకం ఈ సంవత్సరం బాగుంది.
- మెట్రోమ్యాన్ శ్రీధరన్‌కు అత్యున్నత గౌరవ పురస్కారం.
- క్రికెటర్ ఎమ్.యస్.కె.ప్రసాద్‌కు అఖండ ఖ్యాతి.
- హిమాలయ పర్వతాలకు ఈ సంవత్సరం కూడా ముప్పు పొంచి వుంది.
- పిచ్చి దొండకాయలు కేజి 80 రూపాయలు అమ్మబడుతుంది.
- రాజకీయ పార్టీ భేదాభిప్రాయాలు గతంలో ఎన్నడూ చూడని దిగజారుడు స్థాయిని చూడబోతున్నాయి.
- ఉజ్బెకిస్థాన్‌కి మంచి భవిష్యత్తు.

- కంప్యూటర్స్‌కు నూతన వైరస్ ప్రమాదం పొంచివుంది.
- రోహిత్ శర్మ, అంబటి రాయుడు, సురేష్ రైనా, అశ్విన్, డివిలర్స్, మిల్లర్, ఉమేష్ యాదవ్ చక్కగా రాణిస్తారు.
- గంగూలీ పుణ్యమా అని క్రికెట్‌లో కుళ్ళు రాజకీయాలు తెరపైకి వస్తాయి.
- నూనెలు, నెయ్యి, పాలు, పంచదార, బెల్లం, వెన్న, ఆవు నెయ్యి, బియ్యం, మినుములు, కందిపప్పు ధరలు బాగా పెరుగుతాయి.
- పోలవరం ప్రాజెక్టు – జనులకు కల్పవృక్షం.
- ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేకహోదా – ఎడారిలో ఎండమావులే.
- విమాన ప్రమాదాలు ఘోరవిషాదం.
- వెస్ట్ యూరోపియన్ స్టేట్స్‌లో రక్తపాతం.
- ఉల్లి ధర ఈ సంవత్సరం కూడా ఘాటెక్కుతుంది.
- హోటల్ భోజనాలకు, బయట చిరుతిండ్లకు వీలైనంత దూరంగా ఉండండి.
- సంక్షేమ హాస్టల్స్‌లో భోజనాలకు ఫుడ్‌పాయిజన్ పొంచి ఉంది.
- కల్తీనూనెల బాగోతం మళ్లీ చూడబోతున్నాము. (గతంలో చెప్పిన ఈ జోష్యంలో మార్పు లేదు)
- బంగారం, వెండి, వ్యాపారుల కన్నా ఇనుము, సత్తు సామానులు, ఎండు గడ్డి, పశుగ్రాసము వ్యాపారులకు అనుకూలంగా ఉంది.
- ఇసుక, ఇటుకల వ్యాపారాలకు బంగారు రోజులు.
- కిడ్నాప్‌ల పర్వం యథేచ్ఛగా సాగుతుంది. జాగ్రత్తలు అవసరం. (గతంలో చెప్పిన ఈ జోస్యంలో మార్పు లేదు)
- విడాకులు తీసుకునే వారి సంఖ్య ఎక్కువ అవుతుంది.
- గుడుంబా రాక్షసి జనులను బలి తీసుకుంటుంది.
- ఫిలిప్పీన్ దీవుల్లో అల్లకల్లోలం.
- సమరవీర మంగళకు (శ్రీలంక విదేశాంగమంత్రి) సమర్థుడిగా గుర్తింపు వస్తుంది.
- పంజాబ్‌లో ఉగ్రవాదుల ఆకృత్యాలు.
- ఇసుక మాఫియా దందాలను దేవుడు కూడా ఆపలేడు. (రెండు సంవత్సరాల క్రితం చెప్పిన ఈ జోస్యంలో మార్పు లేదు)
- ప్రభుత్వ ఆస్పత్రుల ప్రమాణాలకు తిలోదకాలు.
- ఎన్నిసార్లు చార్జీలు పెంచినా ఆర్.టి.సి ఆర్థిక స్థితి మెరుగుపడదు.
- ఉగ్రవాదుల ఆకృత్యాలు ఎక్కువవుతాయి.
- కేంద్రంతో అరవింద్ కేజ్రీవాల్ ఘర్షణ పరాకాష్టకు చేరుతుంది.
- ఆకుకూరల ధరలు ఆకాశంలోనే ఉంటాయి.

- తప్పని కరెంటు కోతలు.
- మహిళల మీద అత్యాచారాలు, ర్యాగింగ్ కొనసాగుతాయి – నిర్భయ చట్టం ప్రశ్నార్థకం.
- ఐ.టి రంగం ఈ సంవత్సరం బాగానే ఉంది.
- తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత గ్రహస్థితులు ఏ మాత్రం బాగాలేదు– మిథున లగ్నం – పుబ్బ నక్షత్రం – సింహరాశి.
- ఎన్నడూ చూడని ఎండలు – సూర్యప్రతాపం వల్ల ప్రాణాలకు యమసంకటం.
- ఇస్రో ముప్పన్నెల విజయాల్లో అపశ్రుతులు.
- ఇండోనేషియాకు తొలగని ముప్పు.
- హాస్పిటల్స్‌కు పెద్ద రోగం పట్టింది. సామాన్యుడికి రోగం వస్తే చావడమే.
- బటానీలు అమ్ముకున్నట్లుగా మెడికల్ సీట్లు అమ్ముకుంటారు. ప్రభుత్వం ప్రేక్షక పాత్ర – ఇది పరిష్కారం లేని సమస్య.
- అవినీతిపరులే – అవినీతి గురించి – ఎక్కువగా గగ్గోలు చేస్తారు. (నడుస్తున్న చరిత్ర)
- చైనా ఆర్థిక స్థితి వెనుకంజ.
- అమెరికా ఆర్థిక పరిస్థితి కూడా ఏమంత బాగా లేదు.
- చైనాలో భూకంపం.
- రైలు, విమాన ప్రమాదాలు ఎక్కువవుతాయి. మెట్రో రైలు ప్రమాదం సంచలనం అవుతుంది. (ప్రతికూల కుజ గ్రహ ప్రభావం)
- అమెరికాకు వీడని టోర్నడోల ముప్పులు – గతంలో చెప్పిన ఈ జోస్యంలో మార్పులేదు.
- భారత్ అభివృద్ధి పథంలో వెనుకంజ
- నల్లధనం నూటికి 5% వెనక్కి వస్తుంది.
- భారత్‌లో పెట్టుబడులకు చాలా దేశాలు ముందుకు వస్తాయి.
- భారత్‌కు ఆర్థిక అనారోగ్యం – పన్నులు ఎగవేతదారులు ఎక్కువగుతారు.
- ఫిలిప్పీన్ దీవులకు ప్రతికూల కాలం.
- తెలుగు రాష్ట్రాలలో వ్యవసాయ సంక్షోభం, దాహం – దాహం – నీరెక్కడ – దాని జాడెక్కడ.
- భూకంపం వచ్చే అవకాశం ఉంది (ఫిలిప్పిన్ దీవికి).
- మయన్మార్ దేశానికి ప్రతికూల కాలం.
- పప్పు ధాన్యాల ధర సామాన్యుడికి అందుబాటులో ఉండదు.
- గతంలో ఎన్నడూ మనతరం చూడని ధరలు.
- కూరగాయలు – అందని ద్రాక్షపండ్లు – ఆకుకూరల ధరలు కూడా సామాన్యుడికి

అందుబాటులో ఉండవు.

- పగబట్టిన ప్రకృతి మనుషుల పాలిట శాపం.
- ఇంత ఘోరమైన స్థితి మనతరం చూడలేదు. చేసిన పుణ్యాలు ఏమయ్యాయి, ఎక్కడికి పోయాయి.
- అమెరికాలో తీవ్ర ప్రకృతి బీభత్సం, జలప్రళయం – భూకంపం.
- పొగరాని పోగాకు రైతుల పరిస్థితి.
- స్టాక్ మార్కెట్లు కొంప ముంచుతాయి.
- క్రీడాకారుల భద్రత విషయంలో అత్యంత జాగ్రత్త వహించాలి, అపశ్రుతులు సంభవించే అవకాశం ఉంది.
- కళాశాలలో, విశ్వవిద్యాలయాలలో కుల సంఘాల జోరు.
- తెలుగు రాష్ట్రాల పోలీసులకు ఉగ్రవాద బెడద పొంచివుంది. (జాగ్రత్త వహించండి.)
- ఎన్నిచర్యలు తీసుకున్నా ర్యాగింగ్ భూతాన్ని తరిమికొట్టలేరు.
- తెలుగు భాషకు – గడ్డు రోజులు – మరింత కొనసాగుతాయి.
- లష్కరేతోయిబా టెర్రరిస్టులు భయంకరంగా రెచ్చిపోతారు.
- కోర్టు తీర్పులే ఊరట, ప్రభుత్వానికి ముక్కుతాడు.
- అధికారులపై రాజకీయ నాయకుల దాడి. మానవ హక్కుల ఉల్లంఘన.
- ఆంధ్రప్రదేశ్‌లో బోర్డు తిప్పిన ఫైనాన్స్ కంపెనీ బాధితులకు కొంత ఊరట.
- కరుడు గట్టిన తీవ్రవాదులు పట్టుబడతారు. ఓ అపశృతి తప్పుతుంది.
- "రాధేమా" లాంటి మురికి స్వాములనే ప్రజలు నమ్ముతారు.
- ఎ.పి.లో దొంగ స్వామిజీలు మరింత మంది కొలువుతీరే సంవత్సరమిది.
- ముఖ్యనాయకుల నిర్యాణము – దేశంలో విషాద దినాలు.
- బాబాల భాగోతాలు, వికృత చేష్టలు బైటపడతాయి.
- కటకటాలపాలుగానున్న దొంగ స్వామిజీలు.
- స్వామి నిత్యానందకు తప్పని బంధన యోగం.
- గాంధీ కుటుంబంపై – ఎన్.డి.ఎ ఆరోపణలు – అత్యంత వివాదాస్పదం అవుతాయి.
- సైనా నెహ్వాల్ (బ్యాడ్మింటన్) కీలక సమయంలో తడబడుతుంది.
- పి.వి. సింధూ రాణిస్తుంది.
- సానియా మీర్జాకు తిరుగులేదు.
- సామాన్యుడి బతుకు భారం పెనుసంకటం.
- సిరియా గురించి గతంలో చెప్పిన ఫలితంలో మార్పులేదు.
- మితిమీరిన ఆత్మవిశ్వాసం వల్ల, టీమ్ ఇండియాకు చేదు అనుభవాలు.
- హైదరాబాద్‌లో నూతన పెట్టుబడులు – నూతన కంపెనీలు వస్తాయి.

- నేపాల్‌లో తిరిగి భూకంపం హిమాలయ పర్వత పరిసర ప్రాంతములకు అరిష్ట పరిస్థితులు.
- కర్కోటక – కర్ణాటక – జలరాక్షసి.
- థాయ్‌లాండ్‌కు అరిష్టకాలం.
- మలేషియాకు మళ్ళీ ప్రతికూల సంఘటనలు.
- తెలుగు చలన చిత్ర పరిశ్రమకు అనుకూల కాలం.
- రోహిత్ శర్మ, రహానే, కోహ్లీ, శిఖర్ ధావన్, అశ్విన్, ఉమేష్ యాదవ్, అంబటిరాయుడు, రాణిస్తారని గత సంవత్సరంలో చెప్పిన జోస్యంలో మార్పులేదు.
- దోనీ గ్రహగతులు బాగాలేవని చెప్పిన జోస్యంలో ఈ సంవత్సరం కూడా మార్పులేదు.
- క్రికెటర్ రాహుల్ అద్భుతంగా రాణిస్తాడు.
- గంగూలీ వంకర బుద్ధి బైటపడుతుంది.
- ప్రజలలో మానసిక బలహీనతలు ఎక్కువవుతాయి దీని ఫలితంగా ఆత్మహత్యలు అధికమయ్యే అవకాశం.
- ప్రపంచ వ్యాపితంగా టూరిజంకు ప్రతికూల కాలం.
- ప్రత్తి, మిర్చి మొలకలకే పరిమితం.
- టూరిజం ఓ సాహస కృత్యం – మానసిక ఉల్లాసంకాదు.
- భారత్ పాకిస్థాన్‌ల సంబంధాలు మరింత క్షీణిస్తాయి.
- నాగపూర్, ముంబాయి, పూణె నగరాలలో విధ్వంసం, జననష్టం.
- భారత్‌కు ప్రపంచ దేశాల మద్దతు.
- పాకిస్థాన్ నాల్గు నాలికల నైజం బయటపడుతుంది.
- శ్రీ నవాజ్ షరిఫ్ జాతకం బాగాలేదు.
- శ్రీలంక బౌలర్ హెరత్ రాణిస్తాడు.
- లిబియాలో ఆగని విధ్వంసకాండ.
- డెమాస్కస్‌లో ప్రాణనష్టం.
- తీవ్రవాదం వల్ల పాకిస్థాన్‌కు చేదు అనుభవాలు.
- కెనడాలో పౌరుల మీద – విదేశీయులమీద ఆంక్షలు ఎక్కువవుతాయి.
- సోమాలియాలో విధ్వంస కాండ.
- రాజధాని భూసేకరణ – చిలికి – చిలికి గాలివాన అవుతుంది.
- నవనవలాడే పండ్లూ – ఫలాలు తింటే రోగాలు పాలుకావడం తధ్యం.
- కలికాలం పరాకాష్ట పండ్లలో కూడా కచ్చ.
- ఆగని ఆత్మహత్యలు – అనుమానాస్పద ఆత్మహత్యలు.
- ఉత్తరాంచల్, ఉత్తరాఖండ్, బీహార్, పశ్చిమ బెంగాల్‌లకు తప్పని వరద

బీభత్సం.

- పాకిస్థాన్ మెతక వైఖరి వల్ల అత్యంత గొప్పవైన మారణాయుధాలు తీవ్రవాదులకు దొరికే అవకాశం ఉంది.
- మసకబారనున్న మోదీయిజం (2016 మార్చి నుండి).
- ఒకే స్థలం పదిమందికి అమ్ముతారు – రిజిస్ట్రేషన్ కూడా చేస్తారు – జాగ్రత్త వహించాలి జనం.
- హైదకాబాద్ ఉగ్రవాదులకు సురక్షిత కేంద్రం.
- ప్రవాన భారతీయులు మేధావులు, అత్యున్నత స్థితికి చేరుకుంటారు. (ప్రపంచ వ్యాప్తంగా)
- సంతాన సాఫల్య కేంద్రాలు కళకళలాడుతాయి.
- స్త్రీల ఆరోగ్యం అధోగతి పాలవుతుంది.
- నూతన పరిశోధనలు పాత పద్ధతులను త్రోసిపుచ్చుతాయి.
- మీడియాకు ఈ సంవత్సరం బాగాలేదు.
- భారత్–పాక్ సంబంధాలు పూర్తిగా చెడిపోతాయి. యుద్ధ వాతావరణం
- చైనై ఇబ్బంది పెదుతుంది (భారత్‌ను).
- బ్యాంకులలో అతి పెద్ద కుంభకోణాలు బయటపడతాయి.
- విద్యారంగంలో అవకతవకలు బయటపడే అవకాశం ఉంది.
- పోలీస్ ట్రయినింగ్ డాగ్స్ వల్ల ఎన్నో ప్రయోజనాలు చేకూరతాయి.
- ఆశలు పెట్టుకున్న భారీ సినిమా ఫ్లాప్.
- చైనాకు ప్రతికూల కాలము.
- స్టాక్ మార్కెట్లు పతనం.
- విరాట్ కోహ్లీ (క్రికెటర్) శకం ప్రారంభం.
- క్రీడాకారుల భద్రతకు – ముప్పు – ప్రభుత్వం గట్టి జాగ్రత్తలు తీసుకోవాలి.
- ఢిల్లీలో భూకంపం.
- అన్నిరకాల ధరలు పెరుగుతాయి.
- ముఖ్యమైన నాయకుడు ప్రజలలో పలుకుబడి కోల్పోతాడు, ఇమేజ్ తగ్గుతుంది.
- క్రికెట్‌తో పాటు ఇతర ఆటలకు కూడా ప్రజాదరణ లభిస్తుంది.
- వింత వింత నేరస్థులు, పోలీసులకు సవాళ్ళు.
- ఎన్ని బూస్ట్‌లు తాగినా ఆటలో నీరసమే (ధోనీ, జడేజా).
- ఉత్తర కొరియాకు ప్రతికూల కాలం.
- ఇషాంత్ శర్మ రాణిస్తాడు.
- సాఫ్ట్‌వేర్ రంగానికి గడ్డు రోజులు దాపురించనున్నాయి.
- యువాన్‌లో ప్రకృతి బీభత్సాలు.

- లిబియా – సిరియాలు ప్రతికూల కాలం 2016 డిసెంబర్ తరువాత మంచి రోజులు రావచ్చు.
- అనుమానాస్పద మృతులు అధికమవుతాయి.
- అమెరికా కుట్రలు, కుయుక్తులు యదాతథంగా సాగిపోతాయి.
- రాహుల్ గాంధీ వినూత్న వైఖరి ప్రజాకర్షణకు దారితీస్తుంది.
- హిమాలయ పర్వత పరిసర ప్రాంతములకు అరిష్టకాలం (గత సంవత్సరం చెప్పిన జోస్యంలో మార్పు లేదు).
- నేపాల్‌కు తప్పని భూకంపాల ముప్పు.
- డెమాస్కస్‌లో వీధి పోరాటాలు.
- సిరియాలో నరమేధం, ఆగని దాడులు – ప్రతిదాడులు దేశ గ్రహస్థితి అసలు బాగాలేదు 2016 డిసెంబర్ తరువాత మంచి రోజులు (ఈ సంగతి 2014–2015 పంచాంగంలో రాయడం జరిగింది).
- యువాన్ తైవాన్‌లలో తీవ్ర ప్రకృతి బీభత్సం.
- సైనా నెహ్వాల్‌కు ఈ సంవత్సరం కూడా ఎదురులేదు.
- చిన్న పిల్లలు ఉసురు అమెరికాకు తగులుతుంది.
- మానవ హక్కుల గురించి నిత్యం జపించే అమెరికాకు పసి పిల్లల శవాలు కనిపించవు.
- భారత్, పాకిస్థాన్ మధ్య సంబంధాలు పూర్తిగా క్షీణిస్తాయని 2014లో చెప్పటం జరిగింది. ఈ సంవత్సరం సంబంధ బాంధవ్యాలు శృతిమించి రాగాన పడతాయి.
- పాకిస్తాన్ తీవ్రవాదులవల్ల భారత్ నష్టపోతుంది – విషాద సంఘటనలు.
- అమెరికా వల్ల భారత్‌కు మాటలు – పాకిస్తాన్‌కు మూటలు.
- బ్రిటన్ ఆర్థికంగా దివాలా తీస్తుంది.
- విమానం లేక హెలికాప్టర్ ప్రయాణంలో ముఖ్య వ్యక్తి దుర్మరణం.
- లిబియా అధ్యక్షుడికి, ఉత్తర కొరియా అధ్యక్షుడికి పదవీగండం.
- హవాయి దీవులలో అగ్ని పర్వతాలు బద్ధలవుతాయి.
- క్రీడాకారులు సింధూ, కస్యప్‌ల జాతకం బాగుంది.
- పురాతన క్రీడలకు ఆదరణ పెరుగుతుంది.
- ఢిల్లీ ముఖ్యమంత్రి కేజ్రీవాల్ వింత పోకడలు విమర్శలు – ప్రశంసలు.
- చైనా ఆర్థిక పరిస్థితి దిగజారుతుంది– ఎగుమతులు తగ్గుతాయి.
- చివరకు ఎ.టి.ఎమ్.లో కూడా దొంగనోట్లే. 2013 లో చెప్పిన ఈ ఫలితంలో మార్పు లేదు. ఈ సంవత్సరం మరీ ఘోరంగా ఉంది.
- మగపిల్లల పెళ్ళిళ్ళు చాలా కష్టం – సంబంధాలు కుదరవు (90%).

- పాకిస్థాన్ కడు నీచమైన దేశమని ప్రపంచమంతటికీ తెలుస్తుంది.
- చిన్న చిన్న లంచాలు తీసుకునేవారు పట్టుబడతారు – పెద్ద లంచాలు తీసుకునే వారు పట్టుబడరు.
- వేలల్లో లక్షల్లో ప్రజాధనం మింగినవాళ్ళు పట్టుబడతారు. శిక్షలు పడతాయి. వేలకోట్లు ప్రజాధనం మింగిన వారికి శిక్షలు పడవు ఇది కలి ధర్మం – ధర్మానికి కాని కాలం దాపురించింది.
- మన క్రికెటర్లు ఎన్ని రకాల శక్తివంతమైన పానియాలు తాగినా కీలక సమయాల్లో నీరసపడతారు.
- ఉత్తరప్రదేశ్‌లో శాంతి భద్రతల సమస్య – ముఖ్యమంత్రి అఖిలేష్‌కు అగ్ని పరీక్ష.
- భాగ్యనగరంలో తీరని దాహార్తి. వరుణదేవుడు ముఖం చాటేస్తాడు.
- జపాన్‌కు ప్రతికూలకాలమని గ్రహగతులు ఉద్దేశిస్తున్నాయి.
- ఫైనాన్స్ కంపెనీల దివాలా (మరికొన్ని).
- బోర్డు తిప్పేసిన ఫైనాన్స్ కంపెనీల నుండి ఖాతాదారులకు హామీలు తప్ప డబ్బులు రావు.
- ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పరిస్థితి సంక్షోభంలో.
- క్రికెట్‌లో ఇంగ్లాండ్ పుంజుకుంటుంది.
- జర్మనీ దేశానికి ఋణబాధలు.
- లిబియా బాధితులకు ఐరోపాదేశాల సహాయం లభించదు.
- విద్యార్థినీ, విద్యార్థులారా దయచేసి ఈతలకు వెళ్ళకండి – విహార యాత్రలూ వద్దు. గత రెండు సంవత్సరాలుగా గ్రహగతులు బాగాలేవు.
- గొప్ప ప్రపంచ ప్రఖ్యాత పర్యాటకుడిగా ప్రధానమంత్రి నరేంద్రమోడీకి ఖ్యాతి.
- విదేశీ వస్తువులు కొనవద్దు, గాంధీజీ.
- విదేశీ పెట్టుబడులు, విదేశీ వస్తువులు ముద్దు, నరేంద్రమోడీ.
- కల్తీకల్లు కనబడే మృత్యువు.
- ఇండియన్ క్రికెట్ టీమ్‌కు దక్షిణాఫ్రికా గడ్డమీద చేదు అనుభవాలు.
- భూ ఉపరితలంపై వాయుగుండాల బీభత్సం ధాన్యం ధర సామాన్యులకు అందుబాటులో ఉండదు.
- ప్రాజెక్టులు నీటి నిల్వలతో కళకళ (తుపాన్లకు కృతజ్ఞతలు).
- చైనా ఆర్థిక వ్యవస్థ – బోర్డు తిప్పేసిన ఆర్థిక సంస్థలా తయారవుతుంది.
- పౌల్ట్రీ రంగానికి చేదు అనుభవాలు.
- నేపాల్‌కు ప్రతికూల కాలం – సంక్షోభం.
- ఎ.పికి ప్రత్యేక హోదా రాదు. దానితో సరి సమానంగా కేంద్రం నుండి

వివిధ రూపాల్లో సహాయం అందుతుంది.

- ఆక్రమిత కాశ్మీర్‌లో మిలిటెంట్ల అత్యాచారాలు, తీవ్రవాద కార్యకలాపాలు ఎక్కువవుతాయి.
- కనకపు సింహాసనముపై ఒక "శునకము" కూర్చుండును (ఆధ్యాత్మిక ప్రపంచంలో మరో అపశృతి) స్వామి నిత్యానందకు తప్పని బంధన యోగం.
- నూతన దైవాంశ సంభూతులు పుట్టుకొస్తారు. ప్రజలను దోచుకుంటారు.
- తెలుగు చలనచిత్ర పరిశ్రమలో చిన్న సినిమాలు ఆదరణకు నోచుకుంటాయి.
- బోర్డు తిప్పిన ఫైనాన్స్ కంపెనీ దివాలా ఒక నాటకం – ఎంక్వైరీ ఓ బూటకం ప్రజలను వినూత్న మార్గంలో మోసం చేసేందుకు దివాలా కుట్ర – దివాలా అబద్ధం.
- కార్పొరేట్ హాస్పిటల్స్‌లో పేషంటును కోడిమాంసం తిన్నట్లుగా తింటారు (డబ్బు) ఈ మధ్య కోడిబొచ్చును కూడా వదలకుండా తింటున్నారు కొంత మంది డాక్టర్లు (గుంటూరు).
- సిరియాకు ప్రతికూల కాలం.
- మంచి ఆటగాళ్ళకు అన్యాయం (క్రికెట్).
- హిందూత్వ అతివాదులు వార్తలలోని వ్యక్తులవుతారు. విమర్శలు వస్తాయి.
- ఉత్తరప్రదేశ్‌లో మత కల్లోలాలు.
- భావ ప్రకటనా స్వేచ్ఛకు ఆటంకాలు రాజ్యాంగ స్ఫూర్తి.
- కుళ్లు రాజకీయాల వల్ల క్రికెటర్ రహానేకు ఇబ్బందులు.
- సామాన్యులకు చదువు దూరం. ఎడ్యుకేషన్ మాఫీయాకు పెద్దల అండదండలు చదువు "కొన" లేము.
- ప్రజాస్వామ్య వ్యవస్థకు – న్యాయవ్యవస్థకు మధ్య విభేదాలు దేశ వ్యాపిత చర్చ.
- పి.వి. సింధూ విజయయాత్ర కొనసాగుతుంది.
- పత్తి రైతులకు పరీక్షాకాలము.
- విద్యార్థులారా ! మిమ్మల్ని వేడుకుంటున్నాను దయచేసి ఈతలకు వెళ్ళకండి.
- పశు, పక్షి సంతతికి కాని కాలం దాపురించింది.
- దేవాలయాల్లో వింతలు – విడ్డూరాలు.
- యాదాద్రి లక్ష్మీనృసింహ స్వామి ఖ్యాతి అంతకంతకు పెరుగుతుంది. స్వామి దీవెనలు ఇరు రాష్ట్ర ప్రజలపై ఉంటాయి మరియు వెంకటేశ్వరుని ఆశీస్సులతో అమరావతి అభివృద్ధి చెందుతుంది.
- ఇక గ్రామపంచాయితీలకే సర్వాధికారాలు – సర్పంచే సర్వాధికారి.
- ఈ సంవత్సరం తప్పని ఇరు రాష్ట్రాలలో నీటి కరవు (సాగు, త్రాగు)
- అభిమానుల పరుగుల దాహం తీర్చనున్న విరాట్ కోహ్లి.

- భారత్‌లో మరిన్ని దాడులకు ఉగ్రవాదుల కుట్రలు.
- జలమండలికి మరోపేరే జలగల మండలి.
- రాష్ట్రంలోనే ఆదర్శ గ్రామంగా పేరొందనున్న గంగాదేవి పల్లి.
- చైనా ఓడరేవుల్లో విస్ఫోటనం వందలాది మృతులు.
- రైల్వే నిలయాలు దోపిడికి ఆలయాలు.
- ఈసారి ఆలయాలలో తప్పని తోపులాట – ఆయువు తీరే ఆట.
- నియంత్రణ రేఖ దాటి పాక్ ఆగడాలు అనవసర కాల్పులు సామాన్యులే సమిధలు.
- పహాడీ షరీఫ్ ఉగ్రవాద ముఠాలకు కేరాఫ్.
- రహస్య కార్యకలాపాల వ్యాపారంలో బంగ్లాదేశ్, మయన్మార్ యువకులు
- బట్టబయలు కానున్న ఉగ్రవాదులతో పోలీసుల సంబంధాలు (హైదరాబాద్ మరియు ఇతర చోట్ల)
- సింగపూర్, హాంగ్‌కాంగ్, బ్యాంకాక్‌లలో పేలుళ్ళు వందల్లో ప్రాణ నష్టం.
- తెలంగాణ, కర్నాటకలకు మధ్య తెరలేపనున్న క్రిష్ణమ్మ, తుంగభద్ర వివాదం.
- నదుల అనుసంధానం దిశగా అన్ని రాష్ట్రాల ముందడుగు.
- ఉన్న ఉసురు తీయడానికే ప్రభుత్వ అసుపత్రులు.
- ఎమ్.ఎన్.సిలకు భారతీయ యువకుల సారధ్యం.
- ఆగని రైతన్నల ఆత్మహత్యలు ఆపలేని ప్రభుత్వాలు.
- ప్రభుత్వ ఆసుపత్రుల అక్రమాలకు, కోట్లల్లో సొమ్ము స్వాహా.
- అండర్ వరల్డ్ దాదాలకు ఈ సంవత్సరం కూడా చేటు కాలం.
- పౌరనివాసాలపై పాక్ దాడులు ఒప్పంద విఘాతానికి దారులు.
- వరుస కట్టనున్న నిత్యపెళ్ళి కొడుకులు (భాగ్యనగరంలోనే ఎక్కువ).
- ప్రేమోన్మాదులు పేట్రేగే సంవత్సరం సోదరీమణులారా జాగ్రత్త !
- విఫలం కానున్న నాగా శాంతి ఒప్పందం.
- ప్రజారోగ్యంతో వ్యాపారుల ముప్పేట దాడులు.
- తెలుగు రాష్ట్రాలలో మహమ్మారిగా మారనున్న డెంగ్యూ చేతులెత్తేసే ప్రభుత్వాలు.
- షేర్ మార్కెట్లో ఫార్మా, ఐ.టి షేర్ల హవా.
- ఊళ్ళోనే దొరకని ఉల్లి పై కప్పుకు చేరనున్న పప్పులు.
- ఈ సంవత్సరం తగ్గనున్న ఆహార ధాన్యాల సాగు.
- కర్ణాటక ప్రాజెక్టులకు సుప్రీం మొట్టికాయ.
- అధికార పీఠం పైనున్న వ్యక్తుల అసందర్భ వ్యాఖ్యలు ప్రజాబాహుళ్యంలో చర్చనీయాంశాలు.
- భాగ్యనగరంలో విచ్చలవిడి గన్‌కల్చర్.
- ముదిరిపాకాన పడనున్న రాష్ట్రాల మధ్య జల, విద్యుత్ వివాదాలు.

- తెలుగు వ్యక్తికి రెడ్ కార్నర్ నోటీస్ జారీచేయనున్న ఇంటర్‌పోల్.
- ఉత్తర బంగాళాఖాతంలో వరుసగా రెండు అల్పపీడనాలు, జనజీవనం అస్తవ్యస్తం.
- ప్రజారోగ్యాన్ని గాలికి వదిలేయనున్న ప్రభుత్వాలు, వ్యాపారాలలో అధికారుల కుమ్మక్కు
- తెలంగాణలో ఆగని రైతన్నల ఆత్మహత్యలు.
- బ్యాంకింగ్ షేర్లు వెనక్కి ముందుకి.
- బాదుడు పెంచనున్న బ్యాంకులు, ఖాతాదారులకు అదృశ్య టోపీలు.
- తెలంగాణ రాష్ట్రాలలో ఇద్దరు మంత్రులకి, ఎ.పి లో ఇద్దరు మంత్రులకు మంగళం.
- నల్లధనంపై కేంద్రం కుంటి అడుగులు.
- వేలాదిగా తరలనున్న పశువులు, కబేళాలే ఆశ్రయాలు.
- నీరుగారనున్న గుడుంబా నిషేధం.
- కొనసాగనున్న పార్లమెంటు ప్రతిష్టంభన .
- ఢాకాలో ఉగ్రవాదుల ఘాతుకాలు, వందలాది పౌరుల నడివీధి హత్యలు.
- ఆగని బాలకార్మికుల తరలింపులు బాలలా, పశువులా?
- ఒకేరోజు అరడజనుమంది అన్నదాతల ఆత్మహత్యలు. చేష్టలుడిగిన ప్రభుత్వాలు.
- ఆరిపోయేది రైతన్న, ఊరిపోయేది దళారన్న.
- ఇరుగుసేవలకన్నా పొరుగు సేవలకే ప్రభుత్వాల ప్రాధాన్యం.
- షేర్ మార్కెట్‌లో ఇంకా రత్నాలున్నాయి ఏరుకున్న వాడే షేర్.
- పేలిపోవటంలో ముందుండనున్న విమానం టైర్లు తృటిలో తప్పనున్న ప్రమాదాలు.
- బంగారాన్ని చులకన చేయకండి నెమ్మదించినా దాని పరుగు ముందుకే.
- ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఆగని ర్యాగింగ్ భూతం.
- ధూమపాన వ్యసనాన్ని దూరం చేసేందుకే సరికొత్త అవిష్కరణలు.
- అబ్కారీ శాఖలో 60 కేజీల బంగారంతో పట్టుబడునున్న అధికారి.
- మలేషియా, సింగపూర్, హాంగ్‌కాంగ్, యుఏఇ లో విమాన ప్రమాదాలు.
- దమాస్కస్ (సింధూ) లో తిరుగుబాటుదారుల వీరంగం సైనిక దళాలకు ఉగ్రవాదులకు మధ్య హోరాహోరి, వందలాది మంది హతం.
- జనరిక్ ఔషధాల నాణ్యత నేతి బీరకాయతో నెయ్యి గుట్టురట్టువుతుంది.
- పండ్లకు తప్పని కార్బైడ్ మాగుడు (అధికారుల అబద్ధపు వాగుడు) ప్రభుత్వాల ప్రేక్షకపాత్ర.
- ఈ సంవత్సరం బూమ్‌కు నోచుకోనున్న గుంటూరు, విజయవాడ భూములు.
- ఎన్ని ఊగిసలాటలున్నా 30,000 చేరనున్న సెన్‌సెక్స్.

- దక్షిణాదిలో ఆగిపోనున్న సంగీత ఝరి.
- కాశ్మీర్, ఆఫ్ఘనిస్థాన్‌లోని ఉగ్రవాదులకు చేయూతనందించే పాక్ తరువాత ఇస్లాం నేత హత్య. మిస్టరీగా మారబోతుంది.
- టెల్ అనీద్ (ఇజ్రాయిల్) విమానాశ్రయంపై ఉగ్రవాదుల దాడులు.
- యాదాద్రికి పోటెత్తనున్న భక్తుల రద్దీ. నియంత్రించలేని అధికార గణం.
- నామాల స్వామీ వర్షాలన్నీ తిరుమలలోనేనా అందరినీ దయచూడు తండ్రీ.
- వివాదాస్పద వ్యాఖ్యలలో చిక్కులలో పడనున్న కేంద్ర మంత్రి.
- గనుల శాఖలు ఘనులు తవ్విన కొద్దీ అక్రమార్కులు ఎ.సి.బి. కొరడా.
- కరుడు గట్టిన నేరస్థుల విషయంలో చక్కపడనున్న క్షమాభిక్ష తంతు (క్షమాభిక్ష లభించదు).
- శిరస్త్రాణం లేదా? శిరస్సే ఉండదు యువతా జాగ్రత్త !
- భాగ్యనగరంలో నిత్యం బాంబు కలకలం వార్తలే.
- షేర్ మార్కెట్ మహాపతనాలు ఈ సంవత్సరము చూడవలసి ఉంటుంది.
- మధ్య ప్రాచ్య గల్ఫ్ దేశాలలో ఆరని ఉగ్రవాద చిచ్చు – సామాన్యులు సమిధలు.
- మనుషులని చంపే చీమలు, దోమలు, ఎలుకలు, పిల్లులు, కుక్కలు, పారాహుషార్.
- పేద బాలల మరణాలు ఆపలేని ప్రభుత్వాలు ప్రభుత్వ ఆసుపత్రులు.
- సిరియా నుంచి ఐరోపా దేశాలకు వలస వెళ్ళేవారిపై అఘాయిత్యాలు, వందల సంఖ్యల్లో మృతులు.
- పండ్లే కదా అని పీక్కుతింటే ప్రాణం తీస్తుంది జాగ్రత్త !
- జాతీయ అవార్డు అందుకోనున్న తెలుగు సినిమా కవి చంద్రుడు.
- కొత్త పుంతలు త్రొక్కనున్న ముషారఫ్ ఆలోచనలు (రాజకీయంగా).
- లిబియా, ఉత్తర ఆఫ్రికా, సిరియాలో నిరంతర కల్లోలాలు, యుద్ధాలు.
- ఫైనాన్స్ లాగానే బోర్డు తిప్పేయనున్న మరో సంస్థ.
- భారత్ అమ్ములపొదిలో కొత్త క్షిపణి ఈ సంవత్సరమే.
- కొత్త పుంతలు తొక్కే సంవత్సరం ఇది.
- కె.సి.ఆర్. ఆధ్వర్యంలో ప్రగతిమార్గంలో, గ్రామ సీమలకు మంచి పేరు.
- ఉత్తర కాశ్మీర్‌లో ముష్కరుల దాడులు – జననష్టం.
- 10 కిలోల దోసకాయ, 20 అడుగుల బీరకాయ వంటి వింతలు.
- 2 తలల దూడ, ఎనిమిది కాళ్ళ గొర్రె పాడిలో వింతలు.
- మాతా అమృతానందమయికి దేశ విదేశాల్లో గొప్ప ఆదరణ.
- కలెక్టర్లే కాదు బిల్లు కలెక్టర్లు కూడా కోటీశ్వరులే, నిర్ణేతలే.
- భారత సర్వ సైన్యాధ్యక్షుడు ఆర్మీ చీఫ్ దల్‌బీర్‌సింగ్‌కు పేరు ప్రఖ్యాతలు.
- భాగ్యనగరానికి పట్టనున్న మహర్దశ – తిరిగి రానున్న రియల్ బూమ్.

- ప్రపంచ వ్యాప్తంగా కొన్ని రోజుల పాటు షట్‌డౌన్ కానున్న కొన్ని నెట్‌వర్క్‌లు.
- ఇంకా బయటకు రానున్న నల్లదొంగల స్విస్‌బ్యాంక్ సమాచారం.
- మధుమేహ రోగుల ఉపశమనానికి కొత్త మందులు.
- ఇరు రాష్ట్ర ప్రభుత్వాలకూ తలనొప్పిగా మారనున్న స్థానికత అంశం.
- షార్ విజయబాటతో వినువిధులలో మువ్వన్నెల జెండా.
- తెలంగాణలో టి.ఆర్.ఎస్ × బి.జె.పి., ఎ.పి.లో టి.డి.పి × బి.జె.పి.
- ఈ సంవత్సరం కూడా వానల రాక అరకొరే.
- అక్కినేని వారసుడికి రానున్న మంచి గుర్తింపు – అఖిల్.
- ప్రచార ప్రహసనంగా గ్రామాల దత్తత.
- ఉత్తర భారతంలో కొన్ని చోట్ల అల్లర్లు, కర్ఫ్యూ వాతావరణం.
- వానకావాలా నాయనా తుపానే గతి భరించక తప్పదు.
- సీమాంధ్రలో కొత్తగా బంగారు ఖనిజాల గనులు బయటపడతాయి.
- వీధుల కెక్కనున్న అన్నదమ్ముల విద్యుత్ పంచాయితీలు.
- విచక్షణారహితంగా ఖనిజాల వినియోగం భావితరాలకు తీరని శాపం.
- చేతివ్రాత బాగా లేకపోతే తలరాతలు మారుతాయి (వైద్యులకు).
- కుప్పకూలనున్న కొన్ని చిన్నదేశాల పెద్దవిమానాలు.
- అటార్నీ జనరల్ (భారత్) సమర్థుడిగా మంచి పేరు.
- జనాభా తక్కువ, ఓటర్లు మాత్రం ఎక్కువ చిత్రమా? విచిత్రమా?
- వంటనూనెలు కొనాలంటే ఈ సంవత్సరం సామాన్యుడికి సలసలే.
- పదునెక్కనున్న ఔషధ నియంత్రణ చట్టం సామాన్యుడికి దొరకని దుకాణం మందులు.
- బద్ధకపు గురుదేవులకు ప్రభుత్వాల పంగనామాలు.
- విదేశాలలోని హిందూ దేవాలయంలో ముష్కరుల వల్ల ముప్పు.
- బ్యాంక్ షేర్స్ నమ్ముకున్న వాడికి బేఫికర్ (ఎప్పటికయినా).
- పదే పదే కాల్పుల విరమణ ఒప్పంద ఉల్లంఘన భారతీయుడా గర్వించు పాకిస్థాన్ ఖబర్దార్.
- హోజి ఉగ్రవాదుల మితిమీరనున్న చర్యలు (భాగ్యనగర్‌లో).
- క్రిష్ణా గోదావరులు ఖాళీ – అయినా అన్నదాతా సుఖీభవ.
- దేశ క్షేమం, స్వక్షేమం కోరేవారందరూ 4 సోమవారాలు దగ్గరలోని శివాలయంలో రుద్రుడికి అభిషేకం చేయించండి.
- మీకు ఎన్నికలు వస్తున్నాయా  అయితే భారీ ప్యాకేజీలొస్తాయి బి రెడీ.
- కాశ్మీర్‌లో ఆగని ఉగ్రవాద కాల్పులు – పెడచెవిన శాంతి చర్యలు.
- ఇతరులకు జరిగే ఒక్క మేలు ఓర్చుకో – దేవుడు మీకు 10 మేళ్ళు చేస్తాడు.

- క్యాట్‌లో అధికారుల పిటీషన్లకు చుక్కెదురు.
- అమరావతిలో అంతులేని ఇసుక దందాలు ఒక వర్గంకే పెద్దపీట.
- వెలుగు చూడనున్న చీకటి కోణాలు – కర్ణాటక ప్రభుత్వ ప్రాజెక్టుల అక్రమాలు.
- నూనె గింజల సాగుపై వరుణుడు కన్నెర్ర రైతుల ఆదాయాలకు భారీ తొఖ్ఖ.
- దుంప పంటలకు వ్యవసాయ ఉత్పత్తులకు ఈ సంవత్సరం బాగుంది.
- అభినవ రాబిన్‌హుడ్, బీహార్ పప్పూ యాదవ్‌కు మంచి పేరు.
- హిమాచల్ ప్రదేశ్‌లో కొండ చరియలు పడి భవనాలు నుగ్గునుగ్గ నిర్వాహితులు బొగ్గుబొగ్గ.
- కాశ్మీర్ జమ్మూ హైవేలలో మోటార్ల మోతలు, పౌరుల ప్రాణాలకు ముప్పు.
- కుప్పలుగా కూలనున్న రైల్వే వంతెనలు – కుదేలవనున్న రైలు ప్రయాణాలు.
- ధర్మాసుపత్రిలో అధర్మ కార్యకలాపాలు.
- కారుపట్టీలకు కేంద్రం ఔటర్ రింగ్ రోడ్ మార్గాలు.
- అశ్లీల వెబ్‌ల మురికి గుంటలలో కూరుకోనున్న ముందు తరం యువతరాలు.
- కోస్తే కాదు కొంటే కంట తడి పెట్టించే ఉల్లికి ఈ సంవత్సరం మరో బెర్లి తోడవుతుంది "ట" (తోడుతుందన్న–మాట).
- భారత్‌పై పాక్, ఆఫ్ఘనిస్తాన్ బలగాల దాడి.
- థాయ్‌లాండ్‌ల దాడి, తుపాకులతో కాదు, నకిలీ భారత కరెన్సీలతో.
- ఇక ఇంటికి కావలసిన వస్తువులన్ని హోమ్ డెలివరీనే వ్యాపారరంగంలో వినియోగదారుడికి ఓదార్పు.
- ఇక త్రాగడానికి పంటలకి – విద్యుదుత్పత్తికి అన్నిటికీ సముద్రపు నీరే గతి.
- తెలుగు రాష్ట్రాలలో లెక్కకు మించిన ప్రేమోన్మాదుల ఆగడాలు.
- అవినీతి నిలయాలుగా మారనున్న సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసులు.
- నరమేధం జరిగేది వీధుల్లో కాదు జాతీయ రహదార్లపై.
- 1 ప్లాటును 5 మందికి అమ్మే అసలైన చీటర్స్ బయటపడతారు.
- నకిలీ దస్తావేజులతో ప్రజలు మోసపోతారని భూమి దస్తావేజు 10 మంది దగ్గర ఉంటుంది.
- అంతర్జాతీయ ఎర్ర చందనం స్మగ్లర్లు పట్టుబడతారు.
- జీవంలేని జీవనదులు అది దుర్ముఖి వింతల్లో ఒకటి.
- ప్రతీ నీటిబొట్టు విలువైనది, వృధా మానండి – భవిష్యత్తు కాపాడండి.
- హిమనదుల్లో మార్పులు మంచు కరిగి కొంపలు ముంచుతుంది.
- భాగ్యనగరంలో కుప్పకూలనున్న పురాతన భవంతులు ప్రాణనష్టం.
- నాగా తీవ్రవాద (నాగాలాండ్) నేతల విధ్వంసం దాడులలో హతం.
- టేక్ ఆఫ్ అయిన వెంటనే ప్రమాదాలకు గురికానున్న విమానాలు.
- క్రీడాకారుడిగా స్విస్ రోజర్ ఫెదరర్ ప్రపంచ రికార్డు సాధిస్తాడు.

